ఆంధ్రగ్రంథమాల : ఇరువదవ కుసుమము

శ్రీ

అళియ

# రామభూపాలుడు

*(Life and times of Aliya Rama Raya of Vijayanagar).*

1530 - 1565

సీ. అతఁడు కర్ణాటరాజ్యరమాధినాథుఁ
డార్యరక్షావిచక్షణుం డద్రిధైర్యుఁ
డనఘచారిత్రుఁ డఖిల రాజాధిరాజ
రాజపరమేశ్వరుఁడు రామరాజవిభుఁడు.

—రామరాజీయము.



టి. శివశంకరం.

వెల రూ. 1-8-0.



*To*
*My Esteemed and Dear Friend*
**Mrs. I. J. PITT**
of Cambridge.

# విన్నపము

విజయనగరసామ్రాజ్యచరిత్రము హిందూస్థాన చరిత్రమునం దొక గంభీరఘట్టము. విజయనగరసామ్రాజ్యము రెండువందలసంవత్సరములు దక్షిణహిందూస్థానమునందు మహామ్మహీయవిజృంభణమును ప్రతిఘటించిన హిందూమహాసామ్రాజ్యము. విజయనగరసామ్రాజ్యము వైదికసంస్కారము నప్రతిహతముగను రెండువందల సంవత్సరములు రక్షించి, పోషించి ఆంధ్రకర్ణాటకసంస్కారములకు హిందూసంస్కారసామ్రాజ్యమునందు గౌరవప్రతిష్ఠలను సమకూర్చినది. శ్రీకృష్ణదేవరాయలు, విద్యారణ్యస్వాములు, పెద్దనామాత్యుడు, భట్టుమూర్తి, పింగళిసూరనార్యుడు, మంత్రితిమ్మరుసు మొదలగు మహానుభావులు విజయనగరసామ్రాజ్య మంతరించినను విజ్ఞానధీరసామ్రాజ్యములందు పరంజ్యోతులవలెను ప్రకాశించుచున్నారు. విజయనగరసామ్రాజ్యవిజృంభణ విలయోదంతములు పండితపామరుల కాత్మోపలబ్ధికి సాధనభూతములు. విజయనగరచరిత్రమునందు ప్రసిద్ధఘట్టమైన అళియరామ

భూపాలుని చరిత్రమును రచియించిన శ్రీయుత టి. శివశంకరముగారు ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులు.

ఇట్టి విజయనగరసామ్రాజ్యచరిత్రమునందు అళియ రామభూపాలుని చరిత్రోదంతము గంభీరవిషాదపూరితోదంతము. రామరాజు తన తొంబదియారవయేట కత్తిని చేతబూని శత్రువులనుమను పోరి వీరస్వర్గమును బడసిన యుదంతము వీరచరిత్రమునందు గంభీరాధ్యాయము. ఈవీరాధ్యాయ మతిగంభీరమైనను ప్రళయబీజగర్భితము. వీరధర్మారాధనమును ఫలాపేక్షను గలిగి నపుడు ధర్మచ్యుతిని బొందుచున్నది. గ్రంథకర్త గారు ధర్మాధ్యాయమునందు ధర్మసందేహ నివృత్తిని జేయుటకు సమకట్టిన ప్రయత్నము సమయోచితమైనను సార్థకము గాలేదు.

“సదాశివుని చెరయందుంచి తాను సింహాసనము నెక్కిన యీ భూపాలుని శీలమునకు కళంకముగ కన్పట్టునేమో. కాని యిప్పటి సమయసందర్భముల సమగ్రముగ సమీక్షించినచో యీని రాజవిపర్యాసము కేవలము సామ్రాజ్యసంగ్రహణార్థము కొరకే చేయబడినదని వ్యక్తమగును. తుంగభద్ర యొడ్డున నిల్చి తన యొక్క బాహుబలముచే పైనుండి దిగివచ్చు తురకల నడ్డుకట్టి మరియొకదానిచే దక్షిణాపథము నందలి తీర్థక్షేత్రముల రక్షయుదాన మెసగిన రామరాజన్యుని వ్యక్తి దృశ్యము యొక్క శేషగిరి విభ్రమాశ్చర్యముల గలిగించునట్టిది. ఇట్టి చరిత్ర

గతకాలానుభవము వర్తమానప్రయోజనముల కును, వర్తమానకాలానుభవము భావ్యభివృద్ధికిని వినియోగపడుట ప్రకృతిధర్మము. ఆంధ్రసంస్కారాభ్యుదయమునకు మధ్యయుగమునందు సకలవిధములను విజయనగరసామ్రాజ్యమును సామ్రాజ్యాంతర్భాగములును వినియోగపడిన విధమును పదునాలుగు పదునైదు పదియారు శతాబ్దుల దక్షిణహిందూస్థానచరిత్రము విశదముచేయుచున్నది. ఆంగ్లమునందు రాబర్టుస్వ్యూయలుగారు రుప క్రమించిన విస్మృతసామ్రాజ్యచరిత్రము చరిత్రపండితుల హస్తములందు క్రమవికాసమును బడయుచున్న విధమును శ్రీయుతులు కృష్ణస్వామయ్యంగారు, హీరాసుపండితుడు మొదలగువారు ప్రచురించిన గ్రంథములు విశదముచేయుచున్నవి. ఆంధ్రమునందును శ్రీయుతులు కొ. లక్ష్మణరావు, చి. వీరభద్రరావు, మ. సోమశేఖరశర్మ, కుందూరి ఈశ్వరదత్తు, కు. సీతారామయ్యగారులు మొదలగు విద్యావంతులు రచియించిన గ్రంథములు చరిత్రాంశములను వికసింపజేయుచున్నవి. ఆంధ్రగ్రంథమాలయందు శ్రీయుత కుందూరి ఈశ్వరదత్తుకృతమైన జీర్ణవిజయ నగర చరిత్రము ౮-వ కుసుమముగను, శ్రీయుత కుకుగంటి సీతారామయ్యగారు రచియించిన తంజాపురాంధ్రనాయకరాజ చరిత్రము ౧౭-వ కుసుమముగను ప్రచురింపబడినవి.

శ్రీయుత టి. శివశంకరముగారు రచియించిన అళియరామ భూపాలుడు ఇరువదవకుసుమముగను ప్రచురితమగు చున్నది. ఈ ప్రచురణము లన్నియును సమగ్రమును, సప్రమాణమును నైన చరిత్రావసరమును విశదము చేయు చున్నవి.

శ్రీ శివశంకరముగా రాంధ్రభాషావిశారదులు, కళాభిజ్ఞులు, పరిశోధకులు, దేశభక్తులు, దైవభక్తులు. వారి సంస్కారప్రభావము గ్రంథమునందంతటను ప్రత్యక్షమగుచున్నది. తేటతెనుగు, ఉదారభావములు, కళావిలసితములైన పటములు, సద్భావభరితములైన ముఖపద్యములు శివశంకరముగారి సంస్కారశీలమును విశదముచేయుచున్నవి. కృతికర్త అళియరామభూపాలుని చరిత్రమును రసవంతముగను, నుదారముగను, గంభీరముగను, సాహసికముగను, ధర్మపరముగను ప్రదర్శించుటకు జేసిన ప్రయత్నములు పాఠకలోకమున కానందమును గలుగజేయగలవు. కృతికి సుప్రసిద్ధచరిత్ర పండితులు కృష్ణస్వామయ్యంగారు తొలిపలుకును, కృతికర్త పీఠికను వ్రాసి పాఠకలోకమునకు గ్రంథపరిచయమును జేసియున్నారు. ఈ గ్రంథమును ఆంధ్రగ్రంథమాలయందు ౨౦-వ కుసుమముగను ప్రకటించుట కనుమతించిన శివశంకరముగారికి ప్రకాశకులు కృతజ్ఞులు. గ్రంథ

ముద్రణప్రకాశనములందు సంభవించిన కాలయాపనము నకు ప్రకాశకులు చింతిలుచున్నారు. ఆంధ్రమహాజనులు శ్రీశివశంకరముగారి గ్రంథము నాదరించి వారి ప్రయత్న మును సార్థకముచేయుటకు ప్రార్థితులు.

ఆంగీరస సం. మార్గశీర్ష శు. ౫, శుక్రవారము. } కా. నాగేశ్వరరావు.

# FOREWORD

BY

## Rao Bahadur

## Dr. S. Krishnaswami Aiyangar,

M. A., Ph. D., M. R. A. S., F. R. Hist. S., F. A. S. B.

I have great pleasure in contributing this foreword to an account of Aliya Ramaraja of Vijayanagar in Telugu by my friend, Mr. T. Siva sankaram of Penukonda. Mr.Sivasankaram needs no introduction to those interested in Vijayanagar History. He is well known as one of those taking a deep interest in matters like this, having the means and finding the leisure to utilise to purpose the local knowledge and information collected from various sources to bear upon the subject. He is well read in Telugu, and commands a literary style likely to be appreciated by lovers of Telugu literature. It is indeed kind of him to have asked for this foreword, and I accede to his request with great pleasure.

The booklet runs to very near 200 pages, of which almost a half is devoted to the previous history of Vijayanagar including in it an account of its foundation, its growth under the

first dynasty of Vijayanagar up to the reign of the great Devaraya II, the rise of the Saluva and Tuluva dynasties, bringing the account down to the death of the great Krishnadevaraya. In this part, the account, though brief, is, on the whole, clear and fairly correct, having regard to the material at our disposal. It could have been more elaborate, but the purpose of the author is merely to provide the background for describing the career of the dominant personality he has chosen for treatment. While on the whole the account may be regarded as satisfactory, the part dealing with the rise ot Saluva Narasimha to power and the assistance he received from Narasa Nayaka of the Tuluva dynasty ought to have been a little more elaborate to avoid the possibility that there is of the unwary reader misunderstanding the position to some extent. Of course, as was stated above already, this part is merely introductory to that which follows, and the want of elaboration may readily be excused therefore. In an account of Ramaraya, the rise to power of the Nayak of Madura, Nagama Nayaka, and more particularly his son Visvanatha Nayaka, is to a great extent appropriate. Mr. Sivasankaram takes the right line, although perhaps he does not indicate it quite clearly in his narrative, that the disturbances in

the last years of the reign of Krishnadevaraya were probably the influencing causes that led to the unsatisfactory condition of the Nayakship of Madura at the time. Though he does not state it in so many words, he gives sufficient indication that it is Achyuta's reorganisation of the southern part of the empire that was responsible for the rise to prominence of Visvanatha Nayaka. It is from this period that Ramaraja comes into prominence. Even so, we do not hear of him till some years after the accession of Achyuta to the throne. The actual occasion that called for the emergence of Rama and his brothers into importance seems really to have been the maladministration brought about by the brother-in-law of Achyuta, the elder of the two who bore the same name, who is described by historians as "The mad" Tirumala. The attempt that this Salakam Tirumala made to concentrate all power into his own hands, and ultimately even to extend an invitation to the neighbouring Sultans for support ending in the assasination of the young ruler Venkatadri, son of Achyuta naturally provided the occasion. Ramaraya's emergence therefore is that of a saviour of the empire, both from an usurpation and from the intrusion, not merely of the influence but of the actual power of the Adil Shah in the immediate

neighbourhood. Rama's relationship with the royal family, his disinterested efforts to bring about the succession of Sadasiva, and the carrying on of the administration in the earlier years solely in the interests of the empire, all indicate that he probably had no idea of usurping the imperial position. The actual exercise of power through critical stages of the history of the empire over a stretch of years seems gradually to have developed along the lines of not merely putting all power into his own hands, but even of his being made to stand before the world as the representative of the imperial power of Vijayanagar that ultimately brought about the actual usurpation, of which the only indication is the imprisonment of Sadasiva, though we do not know for certain when actually he was imprisoned and whether he was actually thrown into what might be called a prison. That Sadasiva was reduced to the position of a nonentity is quite clear. That position may have been forced upon Ramaraja and his brothers by the circumstances of the times. Mr. Sivasankaram points out in his account that at one time, early in his career, even his brothers were dissatisfied with the treatment accorded to the monarch. If that could 'be substantiated, Ramaraja would have to be regarded as having delibirately usur-

ped the position. Just a little over 100 pages of the book is devoted to a detailed description ot the career and the campaigns of Rama and his brothers in the interests of the empire. The several wars between the various Bahmani Kingdoms and the effective intervention undertaken by Vijayanagar in these wars, and the ultimate commanding position achieved by Vijayanagar in Dekhan politics as a consequence thereof are all described with a certain amount of fullness and clearness.

Mr. Sivasankaram seems to lay himself out to show that in the ultimate combination of the Muhammadans and the war that resulted in consequence even, the dominent motive was nothing religious. He gives a certain number of instances to prove that in the days of Vijayanagar Empire, hostility to the Muhammadans as such was not a part of administrative policy. That particular point hardly needs any demonstration as even before the days of Vijayanagar that was more or less the policy of the Hindu rulers, and the Muhammadan subjects of the empire were generally fairly treated and

allowed a considerable amount of freedom. This was extended even to foreign settlers engaged in commerce, whether they were Muhammadans or Christians. That does not necessarily prove that religious fanaticism did not form part of the provocation that brought about the ultimate combination against Vijayanagar. So far as the Nizam Shah was concerned, one may regard that the personal humiliation and successive defeats that he suffered would be sufficient to explain his hostility. But what does need explanation is why the neighbouring Islamic states, which exhibited a more or less consistent friendship towards Vijayanagar, such as the Adil Shahi Bijapur and the Qutub Shahi Golkonda should have so readily and heartily joined in the combination. This position may perhaps require further exploration by Mr. Sivasankaram himself.

Writing a life of Ramaraya, as Mr. Sivasankaram does, the reader may sometimes feel that he is making too much of a hero of Ramaraya. A careful reading will however, show that there was enough in Ramaraya to

deserve the portraiture, and, on the whole, Mr. Sivasankaram's estimate may be regarded as fairly correct, though some explanation as to why he did not provide himself against so much hostility in his neighbours would have been in place. Ramaraja's interference in the Muhammadan kingdoms was not always of his own seeking, and intervention in behalf of one as against another, and the resulting discomfiture are likely to be causes of provocation. Repititions of this however brought about, would certainly leave irritation behind. That seems quite enough to account for the harted that the Nizam Shah conceived against him, and the common danger that there was on his achieving a dominence. which would put all the Muhammadan states in a position of established inferiority to the Hindu power would be sufficient to explain the dissatisfaction felt by the other powers that ultimately combined with Ahmadnagar.

On the whole, Mr. Sivasankaram has done his self-imposed task quite well from his own point of view, through perhaps it would have been better { he had devoted a smaller

proportion of the book to the anterior history of Vijayanagara, and brought in more details from Telugu literature with which he is thoroughly acquainted, into the Life of Ramaraja himself to have given us a fuller portraiture of the Raya. We congratulate him on his achievement and leave the suggestion to him to carry out, as soon as a new edition of the work should be called for, which we hope will soon be the case.

*"Dassara"*
*12th October 1931.*
*Mylapore, Madras. S.*

**S. KRISHNASWAMI AYENGAR.**

---

# ప్రస్తావన

ఇండియా దొరతనపువారు (Government of India) చిరకాలముగ 'ఆర్కియలాజికల్ డిపార్టుమెంటు' (Archaeological Department) అనియు, 'ఎపిగ్రఫీ డిపార్టుమెంటు' (Epigraphy Department) అనియు రెండు శాఖల నెలకొల్పి పరిశ్రమల జరుపుచున్నారు. చరిత్రాత్మకములగు ప్రాతకాలమునాటి గుళ్లు, గోపురములును పాడుపడిన యంతఃపురములును, పూడియున్న నగరములును, నాణ్యములును, గృహోపకరణములును, ఇతరవస్తుచయమును త్రవ్వి పైకెత్తి శోధించి, కాలప్రవాహమున వానినన్ని వేశముల నిర్ణయించుట మొదటి శాఖవారు చేయుచుండు పని. రెండవసంస్థచే మూలమూలల నుండు శిలాశాసనములయు తామ్రశాసనములయు వ్రాతలు సమకూర్చబడి, వానిని దేశభాషా వాఙ్మయములతో పరిశీలించి, యందలి చరిత్రాంశములు స్థిరగ్రంథములుగ సేకరింపబడుచుండును. ఏటేట నీ యిరుశాఖల వారు సాధించు కార్యనివేదిక సర్కారువారు వెవ్వేరుగ

ముద్రించి ప్రజలకు వెలకొనగుదురు. గొప్ప గ్రంథాలయములందును వీనిని కొని పేర్చుటయు కలదు. మదరాసు మ్యూజియంవంటి పురాతనచిత్రవస్తుశాలలయందును ఈగ్రంథములను ప్రేక్షకులకు చదువుట కొనగుదురు. చరిత్రకళాజిజ్ఞాసువుల కీసంబారము ముంగొంగుపసిడి వంటిది. దీనిని ముక్కముక్కగ శోధించి, ఆయాకాలపు ఫలకమందు పొదిగించి, యామూలమున చన్ననాటి చరిత్రమునకు సమగ్రతనిచ్చి, జీవకళనొసగి చిత్రించి ప్రదర్శించుట యీపండితులకు విహారము. ఇట్టి పండితాగ్రగణ్యులలో కొందరు తగిన పారితోషికములతో సర్వకళాశాలలచే మన్నింపబడుదురు. మరికొందరు యేవేతనములేకయే జిజ్ఞాసయే బ్రతుకు చవిగగొని రమించుచుందురు. బొంబాయినగరమున హీరాస్ (Rev Heras) పండితుడును మదరాసు, మైసూరులకు డాక్టర్ కృష్ణస్వామి అయంగార్లును, వంగదేశమున యధునాథ సర్కారుగారును యిట్టి పండితవర్గమునకు మచ్చు లనవచ్చును. వీరిపరిశ్రమలఫలముల వివరమంతయు ఇంగ్లీషుభాషయందే ప్రచురింపబడుచున్నది. ఈరెండు ఉద్యమములకై సర్కారు బొక్కసమునుండి యేటేట లక్షలకొలది ద్రవ్యము వెచ్చమగుచుండును. ఈ ఖర్చంతయు తుదకు పన్ను చెల్లించు పల్లెటూరిరైతుపై బడు భారమే.

ఇట్లున్నను ఈ వ్రాతలు దేశభాషలందు, కుగ్రామపు చదువరుల కందజేయుట మిక్కిలి తక్కువ. లేదనియే చెప్పవచ్చునేమొ. ఈకొదవను సవరించు సంకల్పముతో చరిత్రకళాపండితులు వ్రాసియుంచిన ఇంగ్లీషు గ్రంథములగొని రాయలసీమయే నెలవుగ విజయనగర సామ్రాజ్యము నేకచ్ఛత్రముతో నేలిన చక్రవర్తుల జీవిత కథల సులభమైన తెలుగుతో వ్రాయ తలపెట్టి వెంకటపతిమహారాజచరిత్రమును తెలుగున వ్రాసి ప్రచురించితిని. ఈ నా చిన్నయత్న మళియరామరాజుకథ నట్లె వ్రాయ పురికొల్పినది. ఈ మహామహుని జీవితోదంతము భారతీయయువకులకు సర్వతోముఖముగ గుణపాఠమయి వెలయించునట్టిది. శరీరమున నసువుల ధరించుటతో మాత్రము బ్రదు కనదగదు. బ్రదుకు రసజ్ఞులకు లలితకళ. తెంపు దానికి పెట్టని సొమ్ము. ఆంగ్లేయభాషయందు '(living dangerously)' అని యొకయుక్తియున్నది. అపాయముతో కూడిన బ్రతుకు తెలుగు అనుట దీనియర్థము. ఈజీవనపద్ధతియే యుత్తమోత్తమ మందురు. ఈనాడు యిటలీదేశనాయకుడగు మసోలిని (Facist) ఫేసిస్ట్ అను పేరితో నొక యుద్యమమునే యీపద్ధతికి కుదురుగ నెలకొల్పి, దేశయువకుల నపాయములసరకు గొననంతటియను దిన పరిశ్రమలచే ధైర్యసాహసముల కలవరచుచున్నాడు.

ఇది మనపూర్వీకులకు క్రొత్తదై యుండలేదు. భారతకథ యం దర్జునుడు, అభిమన్యుడు, కర్ణుడు, భీష్ముడు, ద్రోణు డు మున్నగువారి వర్తనమునకు సొగసు నిడునది యీ తెంపరితనమె. పూర్వకాలపు విద్యాపద్ధతుల చొప్పున, గురువులు శిష్యులకు బోధించుచుండిన మొదటిపాఠ మదియె. విశ్వామిత్రుడు శ్రీరామలక్ష్మణులకు నేర్ప మొద లిడినదియు, ద్రోణుడు కౌరవపాండవుల కారంభించినపాఠ మును నీ 'సిలబస్' ననుసరించియె. రాముడు శివధనస్సును విరుచుటయు, అర్జునుడు మత్స్యయంత్రము తెగవేయు టయు నీజీవితశిక్షణమున కుసిగురుతులు. జార్జి సార్వభౌ ముని యారసుడగు (Prince of Wales) యువరాజున కల వరించిన శిక్షణక్రమమందు వన్నె నిచ్చునది యీ తెంపరి తనమే. అళియరామభూపాలుని జీవితకథ యనర్గళముగ ప్రకటించువైఖరియు నిదియె. సర్వవిధముల నీరాజన్యుని జీవితచిత్రము వీరపూజకు ప్రతిష్ఠించతగిన మూలవిగ్ర హము.

ఈకథకుమాతృక పైచెప్పినహీరాస్ పండితుడు(Heras) రచియించినఆరవీటివంశాభ్యుదయము(Aravidu dynasty). వారికి నాకృతజ్ఞతావందనముల మరియొకసారి యీ మూలమున సమర్పించుచున్నాను.

రాజ్యతంత్రపరిస్థితులు వేగముగ మారుచున్నవి. స్వరాజ్యకాంక్ష ప్రజలయందు ముదురుచున్నది. బ్రిటిషు ప్రభువులుసహితము దీనికిసుముఖులై మొనయుచున్నారు. ఇప్పటి భారతీయయువకులకు దేశరక్షణకై చాలినంత త్రాణ చాలదనుట నుభయపక్షములకు దుఃఖము. స్వరాజ్యాపాదనమున కిది యభ్యంతరమై యెదురొడ్డి యున్నది. ఈయడ్డమునుదాటుటకు దొరతనపువారే 'ఇండియన్ స్యాండ్ హర్స్ట్' (Indian Sandhurst) అను పేర సమరక్రమమును బోధించుటకై కళాశాల నొకదానిని మన దేశమందు నెలకొల్పి భారతీయయువకులకు శిక్షణము నొసగనున్నారు. భరతఖండమునకు విడుమర సమీపించుకొలది యువకులందు తెంపరితనము హెచ్చవలయుట యవసరము. అట్లుకాదేని యభ్యాగతమై నడచివచ్చుచున్న స్వరాజ్య భాగ్యలక్ష్మి ముందుకు సాగిరాదు. ఇట్టిసమయమందు భారతీయయువకుల కళియరామభూపాలుని కథవంటి వాఙ్మయ శకలము లుత్తేజకములనుట యతిశయము కాదు.

అనంతపురపు రాయలసీమ కళాశాలయందు చరిత్రకళాధ్యాపకులగు మ. రా. శ్రీ దేశభట్ల నరసింహం పంతులవారు (M. A. L. T.) యిందలి విషయవిన్యాసము సమీక్షించి యామోదించిరి. దీనికి ముఖవచనము వ్రాసిన ఇతిహాసపరిశోధక పండితాగ్రేసరులు

డాక్టరు కృష్ణస్వామి అయ్యంగార్లవారు. నామిత్రులగు సి. యస్. వెంకటరావుగారు యిందలి ముచ్చున్న చిత్రముల రచించి పుస్తకమునకే వన్నెతెచ్చినవారు. హాసన్ నిజాంషా త్రివర్ణచిత్రమునకు మాతృకనిచ్చి నాకు తోడ్పడిన యుదారులు హైదరాబాదు నగరమున ప్రఖ్యాత న్యాయవాదులగు ప్రతాపరెడ్డిగారు. ఆలిఆదిల్షా దిమ్మెను ఎరవొసగి (హైదరాబాదున చంద్రకాంత ముద్రాక్షర శాలాధికారులును పిక్టోరియల్ సంపాదకులు నగు) మ. రా. శ్రీ కృష్ణస్వామిముదిరాజుగారు నాచింతదీర్చిరి. పలుదిక్కులనుండి నాకు తక్కిన ఛాయాచిత్రముల సేకరించి యిచ్చిన మిత్రవర్గమును చిత్రపటముల పట్టికయందక్కడక్కడ పేర్కొనియున్నాను. ఈపుస్తకపు ముద్రణమున గన్పట్టు శుద్ధసిద్ధికి ఆంధ్రగ్రంథమాలవా రుత్తరవాదులు. ఈసహాయసంపత్తిని సమగ్రముగ తలచినప్పుడు శాంతిపర్వమున శుకజనన ఘట్టమందలి "అపుడు మందాకిని సాకారమైవచ్చి" అను 252 పద్యము మనసుకు వచ్చుచున్నది. వీరి కందరిని ఈమూలమున నాకృతజ్ఞతాపూర్వక వందనముల నాచరించుచున్నాను.

పెనుగొండ, టి. శివశంకరం.

---

# విషయసూచిక

---


పుట

## మొదటియధ్యాయము — రాజవైభవవ్యాప్తి

ఆర్థికసంపత్తి - నగరవైభవము ... ... ౧–౭

## రెండవయధ్యాయము — ఆరవీటివంశావళి

ఆరవీడు - వంశవృక్షము - ఉద్యోగము - కుటుంబము ౮–౧౫

## మూడవయధ్యాయము — సామ్రాజ్యపుపూర్వకథ

దక్షిణాపథము - సామ్రాజ్య కైంకర్యము - పాండ్యుని స్వార్థపరత - ముసల్మానులరాక - ఉపద్రవములు - వీరబల్లాలుడు - విద్యారణ్యయోగి - సామ్రాజ్యస్థాపన - కుమారకంపన - గోపనరాయడు - కేంద్రప్రభుత్వరచన - వైభవోన్నతి - శ్రీకృష్ణదేవరాయలు - కృష్ణరాయలనిర్యాణము ౧౮–౩౮

## నాల్గవయధ్యాయము — విశాలోద్యమము

రామరాయనికార్యభారము - హిందూ మహమ్మదీయ సామరస్యము ... ... ... ౩౯–౫౬

పుట

## అయిదవయధ్యాయము — విశ్వనాథనాయకుడు

అచ్యుతుని దక్షిణదిగ్విజయము - విశ్వనాథునిబాల్యము- అధికారపదవి - విశ్వనాథుని రాజభక్తి - విశ్వనాథుని కార్యసిద్ధి - విశ్వనాథుని యేలుబడి - విశ్వనాథుని ధీరోదాత్తత - అరియనాథమొదలియార్ - విఠ్ఠలుడు - సణాదర్శము ... ౫౩–౬౭

## ఆరవయధ్యాయము — సలకముతిమ్మరాజు

తిమ్మనిచెల్లుబడి - వెంకటాద్రిపట్టాభిషేకము ... ౬౮–౭౨

## ఏడవయధ్యాయము — వేంకటాద్రి (Venkata I)

వేంకటునిదిట్టతనము - పెనుగొండ బాబయ్యాయినాము ౭౩–౭౬

## ఎనిమిదవయధ్యాయము — సలకముతిమ్మనిచావు

వేంకటునిహత్య - తిమ్మనిదురాశ - ఆత్మహత్య - రామరాజుసన్నాహము. రామరాజు కార్యసిద్ధి ౭౬–౮౩

## తొమ్మిదవయధ్యాయము — సదాశివుడు

రామరాయని స్వార్థరాహిత్యము - సదాశివుని పట్టాభిషేకము - రాజ్యాంగరచన - విప్లవనిరోధము - తమ్ములు ధిక్కరించుట - వారియనునయము - ఏలుబడి వితరణ - పవిత్రక్షేత్రముల పెంపు - మంగలుల మన్నన - రాజ్యాంగపు బిగువు ౮౪–౧౦౬

పుట

పదియవయధ్యాయము — విదేశసంపర్కము

పోర్చుగీసువారి ప్రవేశము - సుల్తానుల బేరము - పారి
తోషికము - పోర్చుగీసుల దుడుకు - మరల
సంధి - పోర్చుగీసుల వ్యాపకము - వారిదుడుకు
నరికట్టుట ... ... ... ౧౦౭—౧౧౩

పదునొకండవయధ్యాయము — అళియరామరాజు
సింహాసన మెక్కుట

కళంకము ... ... ... ... ౧౧౪—౧౧౫

పండ్రెండవయధ్యాయము — దండనీతి

భామినీ సుల్తానులు - బిజాపురపు దుడుకు : సామదాన
ములు-బిజాపురపు సుల్తానుని చపలత - మిత్ర
భేదము - సంధి - విగ్రహము - శరణాగతరక్ష
ణము - మరల మిత్రభేదము - అహమ్మద్‌నగర
పరిభవము - బిజాపురమున కుపకృతి ... ౧౧౬—౧౪౬

పదమూడవ యధ్యాయము - వైరివర్గపుమేలుకొల్పు

వైరివర్గపు మేలుకొల్పు ... ... ... ౧౪౭—౧౫౨

పదునాల్గవ యధ్యాయము - సమరసన్నాహము

శుద్ధాంతమున వీడ్కోల్పు - ఆయత్తత - తాకు ౧౫౩—౧౬౩

పదునేనవ యధ్యాయము - రక్షస్తగ్గియుద్ధము

రక్షస్తగ్గియుద్ధము ... ... ... ౧౬౪—౧౬౬

పుట:

## పదునారవ యధ్యాయము - వీరస్వర్గము

సుల్తానుల భేదతంత్రము ... ... ౧౨౩-౧౩౩

## పదునేడవ యధ్యాయము - అస్తమయము

శత్రువులకొల్ల - సుల్తానుల సైరణ - సుల్తానుల
వీడ్కోలు - తిరుమలుని నగరప్రవేశము -
సంక్షీణప్రభ ... ... ... ౧౩౭-౧౭౭

## పదునెనిమిదవ యధ్యాయము - గుణాదర్శము

గుణాదర్శము ... ... ... ... ౧౭౮-౧౮౪

అనుబంధము ... ... ... ... ౧౮౫-౨౦౫



శ్రీ

# అళియ రామ భూపాలుడు

## చిత్రముల పట్టిక

1. ఇసాబెల్ పిట్ సాధ్వీమణి (Mrs. Pitt)

వీరు ఇంగ్లాండున కేంబ్రిడ్జ్ నగరవాసులు. గ్రంథకర్తకు ఆప్తమిత్రులు. వీరికి పెనుగొండయం దభిమాన మెక్కువ. అనంతపురమండలమందు వీరి నెఱుగనివారరుదు. తెలుగు భాషయందు వీరికి రుచి మెండు. ఆంధ్ర (వార) పత్రిక ననేక సంవత్సరములుగఁ దెప్పించుకొని సవిమర్శనముగ చదువుకొను చుందురు. ఇంగ్లాండులోని భారతవిద్యార్థివర్గమున కాప్తులు. ఈపుస్తకము నంకితమొనర్చియుండుట ఈసాధ్వీమణికే.

2. అళియరామభూపాలుడు (త్రివర్ణచిత్రము)

దీనికి మాతృక పూనా ఇతిహాససంశోధకమండలివారియొద్దనున్న పాతచిత్రము. ఇయ్యది రెవరెండుహీరాస్ (Rev. Heras) గారు వ్రాసిన ఆరవీడువంశాభ్యుదయ మను పుస్తకమున ముద్రింపబడియున్నది. దీనిని త్రివర్ణచిత్రముగ రచియించినవారు చిత్రకళానిపుణులగు మ॥ రా॥ శ్రీ, పెనుగొండ C. N. వెంకట రావుగారు.

3. కళ్యాణదుర్గము (ఊరు, వెనుక కోటకొండ)

4. పురద్వారము, కళ్యాణదుర్గము

(౨-వ పుట) "అనంతపురమండలమందలి కళ్యాణదుర్గమే యీ కళ్యాణపురమని ... ... ... ... ..."

(వీని ఛాయాచిత్రములు కల్యాణదుర్గములోనుండు మిస్ మిల్లర్ (Miss Miller) గారను క్రైస్తవసేవిక తీసినవి.)

5. హంపి శిథిలములు

(౭-వ పుట) "నగరముయొక్క చుట్టుకొలత ౨౪ మైళ్లు."

(ఈ చిత్రము గగనదృశ్యము. పాడుపడినదశను సూచించునది. ఇయ్యది ఆంధ్రగ్రంథమాలలోని 'జీర్ణవిజయనగరసామ్రాజ్యము'న ముద్రించినది.)

6. విజయనగరమున రాచనగరు

(౭-వ పుట) "ఆబాటసారి యెన్నియో రాచభవనముల చూచెననియు వైభవమున నేదియు విజయనగరపు రాజమందిరముతో సరిపోలదనియు వ్రాసియున్నాడు."

(ఈ చిత్రము 'జీర్ణవిజయనగరసామ్రాజ్య' మందలిది.)

7. విజయనగరసామ్రాజ్యశంకుస్థాపనము (త్రివర్ణచిత్రము)

(౨౬-వ పుట) "ఇదియే విజయనగరసామ్రాజ్యస్థాపనమున కంకురార్పణ మందురు."

(ఇయ్యదియు పైచిత్రమువలెనే ఆంధ్ర గ్రంథమాలవారిచే సేకరింపబడినది. ఇది విద్యారణ్యులు హరిహరబుక్కరాయల సమక్షమున శంకుస్థాపన చేసిన దృశ్యము. చిత్రకారుని యూహయే దీనికి మాతృకయై యుండనోపు.)

8. చంద్రవదన మంటపము (౨)

(౮3-వ పుట) 'కదిరిదేవాలయపు ముఖమంటపమును నేటికిని చంద్రవదనమంటప మనెదరు.'

మొదటి చిత్రమున గోపురమును, దానిముందర పొట్టిగ నగపడు మంటపమును కలవు. మరియొకదానియందు మంటపమే ప్రత్యేకముగ నగుపడును.

(ఈ రెండుఛాయాచిత్రములు తీసిపంపినవారు కదిరియందుండు క్రైస్తవసేవిక మిస్ డేయిస్ (Miss Dais) గారు.)

9. చంద్రవదన మోహియార్ గోరీ

(౮3-వ పుట) 'ఆరెండుశరీరములు పూడ్చినచోటే పై పేర్కొన్న చంద్రవదనమోహియార్ సమాధి.'

(దీనినిసహితము తీసిపంపినవారు పైచెప్పిన మిస్ డేయిస్ గారు.)

10. బాబయ్యదర్గా

(౮౭-వ పుట) 'ఈ సమాధియే బాబయ్యదర్గాయందుండు పూజ్యస్థానము.'

(ఈఛాయాపటమును తీసియిచ్చినవారు పెనుగొండలోనుండు క్రైస్తవసేవిక మిస్ డి యంగ్ (Miss De young) గారు. ఈకట్టడపు కుడివైపున గర్భస్థానమందిరమందు సమాధి కలదు.)

11. బాబయ్య ఉరుసు సమారాధన

(౮౭-వ పుట) 'హిందూమహమ్మదీయసామరస్యము నాట్యమాడుచున్నదోయన చూపట్టును.'

(ఇదియు పైచెప్పిన మిస్ డి యంగ్ గారు తీసినదే.)

**12.** బీబినాంచారు దేవాలయము, ఒరయూరు

(౪౮-వ పుట) 'ఈ దేవాలయమునుకట్టించి దేవుని ప్రతిష్ఠించి పూజలుసల్ప నియమించిన ప్రభువు విశ్వనాథనాయకుడు.'

(ఇయ్యది S. I. రైల్వే పోదనూరునందు మెకానికల్ ఇంజనియర్ దొంతి నారాయణస్వామి శ్రేష్ఠిగారు తీసి పంపిన ఛాయాపటము.)

**13.** అరాబిక్ మంత్రము, శ్రీరంగ దేవాలయము

(౪౯-వ పుట) 'బ్రాహ్మణులకు గాయత్రియెట్లో తురకల కీవాక్య మట్టిది.'

(దీనిఛాయాపటమును తీసిపంపినవారు ఉపకారవేతనమునందిన తహసిల్ దార్ నల్లాడై గ్రామవాసులగు, సి. చిదంబర మొదలియార్ గారు.)

**14.** విశ్వనాథనాయకుడు (త్రివర్ణచిత్రము)

(౫౪-వ పుట) 'సామ్రాజ్యసేవాధురంధరుడు స్వామికార్య దీక్షారతుడు.'

(ఈ త్రివర్ణచిత్రమును రచియించియిచ్చిన చిత్రకారులు ధర్మవరము బోర్డుహైస్కూల్ లోని చిత్రకళోపాధ్యాయులగు S. B. ఇసరెయిల్ గారు దీనికి మాతృక మధురమీనాక్షి దేవాలయములోని శిలాప్రతిమ.

**15.** మధుర మీనాక్షీ దేవాలయము

(౬౨-వ పుట) 'మధురయందు మీనాక్షీ సుందరేశ్వరుల దేవాలయముల జీర్ణోద్ధారణము గావించి విస్తరించెను.'

(ఈఛాయాపటము అసిస్టాంట్-ఇంజనీయర్ మ-రా-శ్రీ, A. రాజగోపాలయ్యంగార్ వారు తీసిపంపినట్టిది.)

**16.** శ్రీరంగక్షేత్రము

(౭౭-వ పుట) 'శ్రీరంగక్షేత్రములోని రంగనాథస్వామి దేవాలయమును విస్తరించి యభివృద్ధిచేసినకీర్తి విశ్వనాథునిది!' (ఇదియు A. రాజగోపాలయ్యంగారు తీసిపంపినది.)

**17.** అరియనాథ మొదలియార్ స్తంభము

(౭౧-వ పుట) 'అరియనాథమొదలియార్ ఈ నాయకునికి మంత్రిపుంగవుడై ఈకార్యదీక్షులయందు కుడిభుజమో యన మెలగి మన్నన లందినవాడు.'

(ఇయ్యది మధురదేవాలయములోని శిలావిగ్రహము. దీని ఛాయాపటమును తీసిపంపినవారు పైచెప్పిన రా॥ చిదంబర మొదలియార్ గారు.)

**18.** పెనుకొండ కొండకోట

**19.** గుత్తిదుర్గము

(౯౦-వ పుట) 'ఈనడుమ రాజధానివిడిచి చన్న అళియరామరాయ తిరుమలరాయలును, వాని యనుచరులును పెనుగొండ * * గుత్తికోటల వశపఱచుకొని * * * * ......'

**20.** తిరుపతి దేవాలయము

(౯౫-వ పుట) 'అదేతిరుపతియందు తమ్ముడు సదాశివునికి పదమూడవయేట పట్టముకట్టబడెను.'

**21.** ఆలీ అదిల్ షా

(౧౪౮-వ పుట) 'ఆయానకును ఆయనరాణికిని ఆలీయందున్న పుత్రవాత్సల్యము గాఢమైనది.'

(ఇయ్యది హైదరాబాదులోని చంద్రకాంతముద్రాక్షరశాలాధి
కారులు 'పిక్టోరియల్' సంపాదకులు నగు మ-రా-రా-శ్రీ,
కృష్ణస్వామి ముదిరాజుగారు పంపినది )

**22.** హసన్ నిజాంషా (త్రివర్ణచిత్రము)

(౧౬౨-౧౬౩) 'హసన్ నిజాంషా రామరాజునకు ముఖా
ముఖి నెలకొన్నవాఁడాయె.'

(ఇయ్యది చిత్రకళానిపుణులగు పెనుగొండ C. N. వెంకట్రావు
గారిచే త్రివర్ణచిత్రముగా రచియింపబడినది. దీనికి మాతృక
హైదరాబాదు రెడ్డిగ్రంథాలయములోని పర్షియన్ వ్రాత
పుస్తకమందలి ఛాయాచిత్రము. దీనిని నా కొసగినవారు
మ-రా-శ్రీ, S. ప్రతాపరెడ్డిగారు.)

**23.** పెనుగొండ

**24.** విజయనగరకాలమునాటి పెనుగొండ పురద్వారము

(౧౭౬-వ పుట) 'సింహాసనము మొదలయినవానితో నుపె
గొండదిక్కు మొగమైసాగి నడువజొచ్చిరి.'

**25.** పెనుకొండ, రామబురుజు

(పెనుకొండ గగనదృశ్యపు పటమున కుడితట్టు దిగువకొనయందు
కనబడునది రాచనగరు. పెనుగొండ ఊరువాకిలి రక్షస్తగ్ధి
యుద్ధ మయినపిమ్మట తిరుమల సదాశివులు ఈ పురద్వార
మును దాటియే లోపలికొండ చేరినది. రామబురుజు పడమటి
యూరువాకిలియొద్ద నుండునది.

ఈ త్రివర్ణచిత్రము C. N. వెంకట్రావుగారిచే నడుపబడు బోర్డు చిత్రపాఠశాలలోని విద్యార్థిచే రచియింపబడినది. ఈ చిత్రముల కన్నిటికిని కర్త వెంకట్రావుగారు.)

26. విఠల-అచ్యుత దేవాలయములు

(౧౯౭-వ పుట) 'విఠల - అచ్యుత దేవాలయములు భిన్నము కాకుండుట యు'

(హాస్పేట వకీలు నటేశ మొదలియార్ గారు తీసిపంపిన చిత్రము.)

27. విజయనగరమునాటి సింహాసనము

(౯౬ పుట).

(ఈ ఛాయాచిత్రమును సేకరించి పంపినవారు ప్రొఫెసర్ ఎస్. వి. కృష్ణయ్యంగారు, మైసూరు.)

28. క్రీడాజలాశయము

29. ఏనుగుల లాయములు

30. పంపాపతి గోపురము

31. విజయనగరమున సభాభవనము

(౧౮౨ వ పుట.) 'క్రీడాజలాశయము, ఏనుగుల లాయములు, అతిసుందరమగు పంపాపతి గోపురము.'

32. జైన దేవాలయములు

**33.** గగనమహల్ (త్రివర్ణ చిత్రము)

(ఇయ్యది పెనుగొండ బోర్డు చిత్రకళాశాలలోని బస్తరులపు విద్యార్థి అక్కులప్ప (రా. C. N. వెంకటరావుగారి శిష్యుడు) చే రచియింపబడినట్టిది.)

**34.** రామబురుజు

౨౫ చిత్రములయొక్క సమదృశ్యము.

---

శ్రీ

# అళియ రామభూపాలుడు

## మొదటి యధ్యాయము

---

### రాజ్యవైభవవ్యాప్తి

పరపు లోఁతును గల పరిఖతోఁ బొడవును
ఘనమును నగుకోట గలిగి తగిన
వాకిళ్లు బలుపుఁ గావలి నొప్ప రమ్య గృ
హవ్రాతములు గొమరారు వీథు
లందంబులగు మేటియంగళ్ల నెల్లవ
స్తువులును శోభిల్ల సుజనబహుళ
మై ధాన్యములును ఘృతాదిరసద్రవ్య
ములును నానాయంత్రములును బహువి
ధాయుధములు బిరుదు లగుయోధులును బండి
తులు విలాసినులును దూతముఖ్య
పరిజనములు నెఱయఁ బరమోత్సవంబులు
మెఱయఁ బురము చెలువు మిగులనలయు.

—శాంతిపర్వము, పద్యము ౩౮౯.

ధనములకు ధాన్యములకు నుత్పత్తితలము
లయినవాని కించుకయును హాని గాక
యుండఁ దనకును బండార మొదవఁ దగను
పార్జనము సేయవలయు భూపాలకుండు.

—శాంతిపర్వము, పద్యము ౩౯౨.

శ్రీ కృష్ణదేవరాయల యనంతరము (౧౫౩౦) పట్టమునకు వచ్చినవారు క్రమముగ నచ్యుత వేంకట సదాశివు లైనను, నిజముగ రాజ్యభారమును వహించి సామ్రాజ్యపు వెనుకటి యశోవైభవముల దఱుగనీయక యుద్ధరించినకీర్తి యీ కథానాయకు డగు నళియరామునిది. రాయలకాలముననే పులికట్టు (ప్రళయకావేరి) ప్రధానపట్టణముగ జేసికొని, పూర్వోత్తరపు దిక్కున వ్యాపించియుండిన తెలుగుదేశమున కధినాథుడై యేలుచుండిన దిట్ట యితడు. ఈయనకు ‘రామరాజీయ’మను గ్రంథపు బిరుదుగద్యమున ‘కల్యాణపురవరాధీశ్వరు’ డనియు పేరొసగబడి యున్నది. అనంతపుర మండలమందలి కల్యాణదుర్గమే యీ కల్యాణపుర మని చరిత్రకళానిపుణు లగు డాక్టర్ కృష్ణస్వామి అయ్యంగారు ఆధారముల విమర్శించి కని వ్రాసియున్నారు. ఆయూర మిగిలియుండు ప్రాతనాటికోటకొత్తళములం దారాయని చూపులకాంతి నేటికిని లీనమైయున్న దేమో.

రాయల కార్యకర్త సచివు డన్నను, సేనాని యన్నను నళియరాముడే. విజయనగరచక్రవర్తి పరంపరలో రాయలకు పిమ్మట నళియరామునే యక్బర్ కాలపుచరిత్రకారుడగు ఫెరిష్టా (Ferista) సహితము పేర్కొనియున్నవాడు. అచ్యుత వేంకట సదాశివులను లెక్కగొని యుండలేదు. ‘ప్రపన్నామృత’ కావ్యమందుకూడ కృష్ణరాయలకు పిమ్మట రామరాజే చక్రవర్తిగ గణింపబడి యుండుట. తనకు పిమ్మట రామరాయడే సామ్రాజ్యసింహాసనము నెక్కుటకు తగినవాడని కృష్ణరాయలకే తోచి యుండెగాబోలు. తన యవసానకాలమున నారాయడు రాముని జేరబిలిచి, ప్రభుత్వాధికారమును జేత నునిచి, తన యనంతర మచ్యుతునికి పట్టము గట్టుమని పురెంచుటకు కారణ మదియే. ఆయాజ్ఞను తలమోచియే, రామరాజు విజయనగరమున తానెదుటనిల్చి ౧౫౩౦వ సంవత్సరమున మహావైభవసంభ్రమములతో అచ్యుతునికి పట్టాభిషేకమహోత్సవమును జరుపుట. అచ్యుతుడు సింహాసనస్థుడై యున్న కాలము పండ్రెండుసంవత్సరములు. ఈనడుమ పొడకట్టిన సామ్రాజ్యవిస్తీర్ణ విజృంభణములకు మూలము తలచుగ రామరాయ డనుట జ్ఞాపక ముంచుకొన దగినది. ఆతరుణమున రాజ్యవైభవమును కనులారజూచిన పాంథులు వివ

రించియున్నారు. వారివ్రాతల గమనించినట్టయిన యారా యని కార్యభారపరిమాణ మింతటిదని యూహించుటకు చాలియుండును. పడమట గుల్బర్గ, యుత్తరమున బంగాళ ములోని సాంధీపము, దక్షిణమున మళయాళసింహాళద్వీప ములు, తూర్పున సముద్రమే పొలిమేరగ గల్గు ద్వీపకల్ప మంతయు నాకాలమున సామ్రాజ్యవిస్తీర్ణమై యుండినది. ఇందలిప్రజ యసంఖ్యాకము. సైన్యమో ౧౫ లక్షల వరకు లెక్కగొనబడుచుండెను. పోర్చుగీస్ దేశస్థులవంటి విదేశపు శస్త్రోపజీవులు రాణువయందు భృతికై యధికార మును వహించి సేవించెడివారు. గజరాజి నాల్గువేలు, మేటికెలవంటి తురగరాజములసంఖ్య నలుబదివేలునయి యుండెను. రాజ్యమంతయు పెక్కుచిన్నరాష్ట్రములుగ భాగింపబడి, వానిని వెవ్వేరు నాయకులు పరిపా లించుచు రాజధానికి కప్పములు చెల్లించుచుండిరి. అక్క డక్కడ మనకంటి కగపడుచుండు కర్నూలు, గుత్తి, గండికోట, పెనుగొండ, పావుగడ, మద్దిగిరివంటికోట లాసామంతనాయకులవై యుండవలెను.

ఆర్థికసంపత్తి

రాజ్యమునకు ద్రవ్యసంపత్తియు నపారము. సామంతవర్గ మేటేట రాజధానికి చెల్లించుకప్పము లటుండ, నదులనుండి

యు, గనులనుండియు బంగారము పుష్కలముగ పుట్టు
చుండెను. గుంతకల్లు నొద్దనుండు వజ్రకరూరువంటి ప్రదే
శములందలి గనులు వెలగలరాళ్ల నీనుచుండినవి. వాణి
జ్యపు రాకపోక లూహించుటకు నలవికాదని యిటలీ
దేశపు యాత్రికుడొక డాకాలమున చూచి వ్రాసియు
న్నాడు. అప్పటి ధనికులు కుబేరుల బోలియుండిరట.
ఇటలీనుండి ఎగుమతి యగుచుండిన బట్టలు మున్నగాగల
సరకంతయు రాజ్యమున కర్చగుచుండినది. పడమటిసము
ద్రతీరముననుండు గోవానగరమునుండి, విజయనగరము
వఱకును దినదినమును వచ్చిపోవు సరకులబండ్లబారు
సంతనాళ్లయందువలె బాటలనిండుకు క్రిక్కిరియుచుండెను.
సరకులు రాజధానిచేరిన జాలును, లాభము నిశ్చయ
ము. వ్యాపారులు పదునేనుదినములు కాలినడకతో
సరకులు మోసికొనివచ్చినను తమసరకులనమ్ముట యతి
సులభమై రూపాయకు నాల్గణాలకుమీద లాభమ్ము
మిగులుచుండెడిది. వ్యాపారులు మరల కొనిపోవు [illegible]రుల
వులు రత్నములు, ముత్యములు, వజ్రములే. [illegible]
వారికికల్గు నాదాయము మఱి హెచ్చు. ఇక [illegible]
దేశమునుండి దిగుమతి యగుచుండిన గు[illegible]
సుంకమే యేటేట లక్షన్నర నిష్కములవె[illegible]

ద్రపు రేవులే అరువదియుండెనన్న, ఓడవర్తకప్రవాహ
మెంత విస్తారముగ నుండవలెనో యూహించనగును.
పోర్చుగీస్ దేశపు వ్యాపారులు విజయనగరమందు బస
చేసికొని యుండెడివారు. ఆ నగరరాజమున వేసవియం
దెండ వేడిమి యధికమైయుండుటచే, రాత్రులు వీధుల
యందును, తాళ్వారములయందును పరుండినను భయము
లేక నిద్రించ గల్గియుండిరి. వారు గోవాద్వారమున విజ
యనగరమం దమ్ముటకై కొనివచ్చుచుండిన సరకులు,
గుఱ్ఱములు, చీనాగాజు, వెల్‌వెట్, డమాస్క్ అనుపట్టు
వస్త్రవిశేషములు, కేసరియే మొదలుగాగలవి. టర్కీ
దేశపువ్యాపారులు తమ సరకులనమ్మి వానికి నూరుబం
గారునాణెములును, నాభరణములను గొనిపోయెడివారు.
ఆకాలమున నన్నిటికంటె ముఖ్యమైనది గుఱ్ఱముల
బేరము. ఈగుఱ్ఱములు పరిషియాదేశమునుండి దిగుమతి
గుట. గోవామీాదనే వీనికి మార్గము. రాజ్యమునకు
కలసిన గుఱ్ఱము లన్నియు పోర్చుగీస్‌వా రెగుమతి
చున్నందుచే, విజయనగరపుచక్రవర్తులు వారి యం
కముకల్గి వర్తించుటకు గారణ మయ్యెను. ఆ
కనే పశ్చిమసముద్రతీరమునసుండు గోవానుండి
దపు రేవగు మైలాపురమునొద్ద నున్నవారి

పట్టణమగు స్యాన్‌థోం (San Thome) వరకు నిర్భయముగ రాకపోకల జేయ గల్గియుండిరి.

నగర వై భ వము

ఇక రాజధానివైభవమునుగూర్చి సీసర్ ఫ్రెడరిక్ (Caesor Frederick) అను నిటలీదేశపు యాత్రికుడు తల్లికోట యుద్ధమయిన పిమ్మట చూచి యచ్చెరు వంది వ్రాసియున్నాడు. వీధులవెడల్పును, సౌధముల నిడివియు కనులపండువొనర్పునట్టివై యుండెనట. నగరముయొక్క చుట్టుకొలత యిరువదినాల్గుమైళ్లు. ఆ బాటసారియెన్నియో రాజభవనముల చూచెననియు, వైభవమున నేదియు విజయనగరపు రాజమందిరముతో సరిపోలవనియు వ్రాసియున్నాడు. ఆ నగరవాసులు ధరించుబట్టలు వెల్వెట్, డమాస్క్ అను పట్టువస్త్రపు రకములవి. వారివారి యంతస్థునకు తగిన కుళ్లాయిలు తలపై ధరింతురు. చెవులయందు పోగుల పెట్టుకొందురనియు కని వ్రాసియున్నాడు. సవారికి గుఱ్ఱముల గొని యింటియం దుంచుకొనుట యప్పటి పౌరుల భాగ్యవైభములకు గుఱుతుగ నెంచబడు చుండెడిది.

— —

# రెండవ యధ్యాయము

## ఆరవీటి వంశావళి

ఆభరతాన్వయంబున ర
        ణాధ్వరయూపభుజుల్ మహోగ్రరి
త్రీభుజు లుద్భవించిరి యు
        ధిష్ఠిరముఖ్యులు విశ్రుతాఖ్యు లు
ర్వీభరణప్రవీణులు వి
        వేకధురీణులు దానదీక్షితా
గ్రాభిహితు ల్సుధీయుతు లు
        దారదయాహృదయు ల్శుభోదయుల్

రవికులం బలరింప శ్రీరాముఁ డయిన
శౌరి తనరెండుకన్నులు సరియె కాఁగఁ
దలఁచి సోమాన్వయము పవిత్రంబుసేయ,
నవని శ్రీరంగవిభు రాముఁడై జనించె.

పట్టాభిషేక విపర్యయంబునఁ బ్రోలు,
        వెడలి ప్రియానుజు ల్వెంటఁగొలువఁ
జిత్రకూటాభిఖ్యఁ జెలఁగుపెన్గొండ సాం
        ద్రహారిద్విషేంద్రనా డవనిఁజేరి
ఖలజనస్థానవాసులఁ బల్వుర వధించి
        మహిమ సలకఖర స్మయ మడంచి

హరివీరభటమహోద్ధతి నద్ధి గంపింప
దురమునఁ గదిసి తద్ద్రోహిఁ దునిమి
యనఘుతరపార్థివేంద్రర నధిగమించి,
సాధుకర్ణాటవిభవ సంస్థాపనంబు
పూని శరణాగతులనెల్లఁ బ్రోచె రాముఁ
డతఁడు నిజచరితంబు రామాయణముగ.

—వసుచరిత్రము, ప్రథమాశ్వాసము, ౫౮, ౮౩, ౮౪.

## ఆ ర వీ డు

అంతటి రాజ్యవైభవవిజృంభణములకు బట్టుకొమ్మయై వెలసిన అళియరామరాయని పుట్టుపూర్వోత్తరముల నిక గొంత విచారింతము. ఈయన యారవీటి వంశమువాడు. ఆరవీడను నూరు ఈవంశమునకు జన్మభూమి. అనంతపురమండలమున తాటిపర్తితాలూకు యెల్లనూరు నొద్ద చిత్రావతియొడ్డున నుండు పాడుపడినపల్లియయే యప్పటి యీయారవీడు. కర్నూలు మండలమునసహిత మారవీడను నొక యూరున్నది. ఈ వంశమువా రక్కడను వ్యాపించి యుండిరనుట సంభావ్యము. కృష్ణరాయలకు బూర్వమె యీసంతతివారు శస్త్రోపజీవులై విజయనగరపు సామ్రాజ్యపుపెంపునందు చేదోడు వాదోడుగ పాల్గొని దానికి క్రమముగ తెలుగుమెఱుగు నిచ్చినవా రన నగు. ‘ ఆంధ్రకర్ణాటసామ్రాజ్య ’ మనుబిరుదమున నుత్త

రార్ధమును గడించినది సాళ్వనరసింహమునకు పిమ్మట యారవీటివారే. మరి చెప్పిన రామరాయడే యనవచ్చు నేమొ?

వంశవృక్షము

చరిత్రశోధన వెలిపుచ్చినంతవరకు నీవంశావళికి మూల పురుషుడు తాతపిన్నమ. అరిభీకరుడనుట యీయన బిరుదము. సోమదేవు డితని కౌరసుడు. తండ్రికి మించిన వాడు కొడుకు. ఒకటేనాసరమున నేడుకోటల ముట్టడించి పరాక్రమించి నిల్చిన వీరుడని ఖ్యాతిగాంచినవాడు. ఇట్టి సోమదేవునికి జన్మించిన రాఘవేంద్రుడు పేరుకు తగినట్టు పరగెను. రాఘవేంద్రునికి పిన్నమ యుద్భవించి, యారవీటిపురాధీశుడై యేలినవాడు. ఈ పిన్నమకొడుకే యారవీటి బుక్కరాజు. ౧౪౮౫-౮౬ సంవత్సరమున విరూపాక్షదేవుని కిరీటమును సాళ్వనరసింహుని నెత్తిపైనిడి సింహాసన మెక్కించిన కార్యదక్షుడు. ౧౫౧౦ సంవత్సరమున కృష్ణరాయల పట్టాభిషేకసమయమందు పరిషత్తు నలంకరించిన వీరవరులలో, నీ బుక్కరా జగ్రగణ్యుడు. ఇట్టి బుక్కరాయనికి రామరాజను పుత్రుడుదయించి బాలాంబిక యనుకన్యను వివాహమై, సపాదుని (గోలకొండ సుల్తానుని) నిర్జించిన శూరుడని పేరొందెను..

వేంకటపతి యాతనికి తమ్ముఁడు. ఈతమ్మునిగొని జ్ఞాతివర్గమునకు చేరిన వేంకటాద్రి తిరుమలులను వారి సహాయము చేగుత్తి పెనుగొండదుర్గముల నాక్రమించి గోలకొండ సుల్తాను నోడించెను. అవనగిరి కర్నూలు కోటల ముట్టడించి జయించినదియు నీరామరాయఁడే. ఈయనకుగొడుకులు ముప్వురు. తిమ్మ, కొండ, శ్రీరంగయనుట వారిపేర్లు. వీరియందు కడవాడగు శ్రీరంగరాజే మన యళియ రామరాజు తండ్రి. అనేకశత్రువుల జయించినవాఁడనుకీర్తి యీయనకు గలదు. ఉదారి. భయములేనివాఁడు. వినయపరుఁడు. సాహసి. 'వసుచరిత్ర'యందు భట్టుమూర్తి యీ క్రిందిపద్యమున బొగడియుండు 'శ్రీరంగశౌరి' యీ రంగరాజే.

వెసవిభవ ణరాజ్యవిముఖుఁడై సహ్యభూ
వలయంబు చేకొని నిలువఁడేని
సప్తసాలాంతరస్థాయియై నిదురించు
తటినిజాగరణంబుఁ దాల్పఁడేని
శ్రుతిదూర భోగసక్తత విఱ్ఱవీఁగి తాఁ
జరణ మగ్రజుదెసఁ జాపఁడేని
నలరారు సిరి దనయఁడుగునఁగూర్చి గ
ట్టిగ నీగి చేయి మాటి కొనఁడేని

రమణఁబ్రతి సేయవచ్చు శ్రీరంగశౌరి
భయదరిపు పురహారి నిర్భయవిహారి
యార్యసత్కారకారి యౌదార్యవిభవ
ధారియై మించు శ్రీరంగశౌరి కెపుడు.

—వసుచరిత్రము, ప్రథమాశ్వాసము, 38 పద్యము.

కృష్ణరాయలకాలమున నీశ్రీరంగరాజు మంత్రియైయుండె ననుటకు కర్నూలున శాసనమొకటి యాధారమైయున్నది. ఇందు శ్రీరంగరాజుపేరు 'మహామండలేశ్వర రామరాజ పెదశ్రీరంగదేవమహారా' జని చెక్కఁబడియుండుట కననగును. కృష్ణరాయల కాలమునకు ముందునుండి సామ్రాజ్యపు మంత్రులకు 'మహామండలేశ్వర'యనుట బిరుదు. ఈ శ్రీరంగరాజు సతీమణిపేరు తిరుమలాంబ. వీ రిరువురికి కోన,తిమ్మ,రామ,వీరతిమ్మ,వేంకటయను కొడుకు లైదుగురుండినట్లు "వసుచరిత్ర" "నరసభూపాలీయ" గ్రంథములు పేర్కొనుచున్నవి. ఈయయిదుగురియందు కోన, తిమ్మ, యను నిద్దరు వసుచరిత్రమున పరాక్రమవంతులుగ బొగడబడి యున్నారు. కాని యిందుకు చరిత్రాత్మకమైన యాధారములు మరియేవియు గానరావు. మూడవవాడే యీ కథానాయకుడగు రామరాజు. కోదండరాముడనియు నితనికి నామాంతరము. తమ్ము

లగు తిరుమలవేంకటపతు లిరువురు రాయలకు పిమ్మట దక్కని సుల్తానులదాడి నరికట్టి సామ్రాజ్యజీర్ణోద్ధారదీక్ష యందు మన యళియరామరాజునకు గుడియెడమభుజ ములై యభినవభీమార్జునులోయన దోడ్పడిన వీరాగ్ర గణ్యులు.

ఉద్యోగము

పసితనమున రామరాజు, గోలకొండ సుల్తాన్ కుతుబ్షాసైన్యమందు భృతికి యధికారమును వహించి యుండెను. ఒకానొకప్పుడు నాకుతుబ్షా విజయనగరపు పొలిమేరపై దాడివెడలి కొంతభాగము నాక్రమించి తన యనుచరులలో మహమ్మదీయున కొప్పజెప్పుటకుమారుగ రామరాజు నధినాథునిగ జేసి తన రాజధానికి మరలిన వాడాయె. రామరాజిట్లు మూడు సంవత్సరములు పాలించునంతలో ప్రక్కనున్న బిజాపురపు సుల్తాన్ అదిల్షాయొక్క సైన్యము కొల్లకై బయలుదేరి రామ రాజు రక్షణయందున్న ప్రాంతముల జొరబడి గ్రామా రామసీమల గొల్లలాడినవి. ఈ దుండగమును రామరా జెదుర్కొన మొనసినపుడు శత్రుసైన్యము లాతని వెడల నడచెను. రామరాజు చేయునది లేక, తన నాథుడగు గోల కొండసుల్తానునొద్ద సహాయము వేడబోవ, జరిగిన ప్రమాద

వృత్తాంతమును విని తనభృత్యుఁడు పరికిపందయని, నిండు సభయందు పరిభవించి కొలఁవు చాలించినవాఁడాయె. ఆ సమయముననే రామరాజు కృష్ణరాయల నాశ్రయించుట. అదిమొదలు రామరాయల ధీప్రజ్ఞాశౌర్యపరాక్రమముల వికాసమున కవకాశముగలుఁగ నాతనిమెప్పు వడసి యామహామహుని యనుఁగుకూతును బెండ్లియై 'అళియ' బిరుదమును గడించినవాఁడయ్యె. తుళువభాషయందల్లునికి 'అళియ' యనిపేరు. ఆవలకు రాయలమంత్రియై యున్న యాతనితండ్రి శ్రీరంగరాజు పిమ్మట తాను మంత్రిపదవిని చేకొని రాజ్యరథము నీడ్చినట్టు గురుతు లున్నవి.

కుటుంబము

రామరాజునకు భార్యలు నలుగురు. తిరుమలాంబ, అప్పలాంబ, కొండమ, లక్ష్మమ్మ యనుట వారిపేర్లు. తిరుమలాంబ కృష్ణరాయల కొమరిత. అప్పలాంబ జిల్లేళ్ల పెద్దనందిరాజు పుత్రి. కొండమ్మలక్ష్మమ్మలు పోచ్చిరాజుతిమ్మని కొమార్తెలు. శుద్ధాంతమున వీరిలో ముగ్గురికి, సత్యభామ, దైవచింతామణి, మానమోహిని, నిజస్వరూపిణి యను మారుపే ర్లున్నట్టు మహారాష్ట్రచరిత్రకారుడగు ఛందోర్కర్ వ్రాతవలన నూహింపదగియున్నది. తిరుమలాంబయందు కృష్ణప్ప, పెద తిమ్మ యను వీరు లుదయిం

చిరి. ఈపెదతిమ్మడే యహమ్మద్‌నగరపు సుల్తాన్ నిజాంషా నెదిరించి జయించిన శూరుడు. ఈవృత్తాంతము కడప మండలపు బొల్లవరమను గ్రామమున నుండుశాసనము ప్రకటించుచున్నది. అం దీరాజకుమారుని పేరు 'పాపతిమ్మయదేవమహారాజ'యని చెక్కఁబడి యుండుట కననగును. అప్పలాంబకు సంతాన మున్నట్లగుపడదు. కొండ, తిమ్మయను నిద్దరు కొండమ్మయొక్క కొడుకులు. ఆనెగొంది రాజ్యమున కధిపతియయియున్న వా డీకొండడే. తిమ్మడు రాయచూరి కోటయందధికారమును వహించియుండెను. రామరాజు కిద్దరుకొమార్తె లున్నట్లును కానవచ్చుచున్నది. దేవరకొండను, ఇంద్రకొండను జయించిన జ్యోతమరాజు ఒక యల్లుడనియు నంద్యాల, కర్నూలు కోటల పాలించుచున్న బస్వంతరాజు మరియొక కూతురి పెనిమిటి యనియు ప్రతీతి.

---

## ఆరవీటి వంశావళి


పిన్నమరాజు
సోమదేవ
రాఘవదేవ
పిన్నమరాయ లేక పిన్నశౌరి (ఆరవీటిపురాధీశుడు)
ఆరవీటిబుక్క=బాలాంబిక
రామరాయ=లక్కాంబిక
వెంకటపతి
తిమ్మరాజు
చెన్నవెంకటపతి
శ్రీరంగ
వెంకటపతి

## ౨. ఆరవీటి వంశావళి




* ఈవ్యక్తియే మన కథానాయకుడు.

# మూడవ యధ్యాయము

## సామ్రాజ్యపు పూర్వకథ

ఏనుంగుపజ్జలో నెల్ల సత్త్వంబుల
  పజ్జలు నడఁగిన యట్ల పోలె
రాజితక్షత్త్రి ధర్మమునకు లోనయి
  సర్వధర్మంబులు జను మఖములు
వేదంబులును శుభవృత్తంబులును దండ
  నీతి మాసినఁ జెడు భూతలంబు
సంస్కారరహితమై చాల హీనతఁ బొందు
  నష్టైన ప్రజకుఁ జేటావహిల్లు
రాజులరసిన నెమ్మది బ్రదుకుఁగాన
రాజు సర్వోత్తముడు ధర్మరాజి యందు
రాజధర్మంబ యెక్కుడు రాజనంగ
ధర్మదేవతయన వేఱె ధర్మతనయ.

—శాంతిపర్వము, ద్వితీయాశ్వాసము ౨౩౮.

అళియరాముని విశాలదృష్టి, స్వార్థత్యాగమును, మొనయికలోతును, విరివియు, కార్యదీక్షల దృశ్యమును చదువరుల మనఃఫలకముల చిత్రించవలె నన్న విజయనగర సామ్రాజ్యపుకథ సంక్షేపముగ, దాని వెనుక భిత్తికబడ గుర్తించినగాని సమగ్రత యలవడదు.

## దక్షిణాపథము

భరతఖండమందు చిరకాలముగ దక్షిణాపథము హైందవజాతీయపరార్థ సంప్రదాయములచే వివిధరీతుల పవిత్రతనందినట్టిది. రామసేవాపరాయణుఁ డగు నాంజనేయుఁడు విహరించిన పట్టులుండుట యిచటనే. శంకరరామానుజమాధ్వులవంటి బ్రహ్మజిజ్ఞాసువులకు జన్మభూమి. శైవసిద్ధాంతసామరస్యమున కాటపట్టు. వైష్ణవప్రపత్తి యాండాళ్ కన్యయై రూపమెత్తి వెలయించిన ద్వీపకల్పము. సంసారసాగరమును తరింపమొనయు మానవవర్గమునకు శ్రీశైలము మొదలు కన్యాకుమారివరకు తిరుపతి శ్రీరంగము కంచి మొదలుగాగల నూటయెనిమిది తిరుపతులను నఖండదీపస్తంభములకు కుదురుదరి దోవజూపుటకు అవ్వై, తిరువళ్లువర్, తిక్కన, పోతన, వేమనవంటి రెక్కమానులకు నెలవు.

## సామ్రాజ్యకైంకర్యము

ఇట్టి పావనప్రదేశమునకు రక్షణవలదా? ఈరక్షణకైంకర్యమునకై విజయనగరసామ్రాజ్యమే ఈశ్వరసంకల్పమున నెలకొనియుండెననుట చరిత్ర వెలయించుచున్నది. ఈకైంకర్యమే మహోదారమగు నాదర్శమై వీరబల్లాళుఁడు మొదలుకొని చక్రవర్తిపరంపరల యెదుటనిల్చి వారిసం

కల్పముల తీవ్రముగ నుద్ఘోషించి నిర్వహింప చేసెననుటయు వ్యక్తమగును.

### పాండ్యుని స్వార్థపరత

ఇపుడు మన రాయలసీమయను ప్రాంతములకు దక్షిణభాగమంతయు రెండువేలేండ్లకుపూర్వము చోళ పాండ్యచేర దేశములన బరగుచుండినవి. పాండ్యరాజ్యమునకు మధుర రాజధాని. పదునాల్గవ శతాబ్దారంభమందు, అనగా1310 సంవత్సరమున దీనికి రాజైయున్నవాడు 'వీరపాండ్య'. సుందరపాండ్య వీని సవతితల్లికొడుకు. అన్నను పదభ్రష్టునిజేసి సింహాసనమును తానాక్రమించవలెననుట వీనికురాశ. వీనిని సాధింపసమకట్టి సహాయసంపత్తికై యపుడు ఢిల్లీసుల్తానుగ నుండిన అలావుద్దీన్ ఖిల్జీకి కబురుపంపి సహాయమును వేడెను.

### ముసల్మానుల రాక

ఆసుల్తాను ఇదిసమయమని గ్రహించి, తన వజీరగు మాలిక్ కాఫరును బలములతో మధురకు పంపినవాడాయె. వీరపాండ్యుడు ముసల్మానుల రాకరాపిడికై భయమంది పురమువదలి 'బ్రదికియుండిన శుభములు బడయవచ్చు' ననునట్లు పఱచి వెన్ను చూపెను. అప్పటికిని మాలిక్ కాఫర్ విడువలేదు. వీరపాండ్యుని వెన్నంటిపట్టి

చెరగొని ఢిల్లీసుల్తానునొద్దకు పంపెను. మాలిక్ కాఫర్ కొన్ని దినములుండి మరలుటకుముందు తన యనుచరుల గొందరిని సైన్యములతో పట్టణమందు దిగవిడిచి చనియె. అది మొదలు మధురనగర మనేకసంవత్సరములు ముసల్మానుల యనాయకత్వమునకు పాలయ్యెను. పాండ్యు లెట్లో కొంతకాలమునకు తమ రాజ్యమునుండి తురకబలముల వెడలగొట్టిరి. కాని యీశాంతి యవధి చిరకాలముజరిగినట్లు కానరాదు. మరల ౧౩౭౭ సంవత్సరమున నప్పటి ఢిల్లీసుల్తాన్ మహమ్మద్ తుగ్లక్ (Mohamed Toghlak) కన్యాకుమారివరకు దక్షిణాపథ మంతయు నాక్రమించి యుండెనని ఫెరిష్టా వ్రాసియున్నాడు. ఇందును పట్టిచూడ కొంతకాలమునకే పాండ్యరాజ్యము రాజధాని మధురతో కూడ మరల ఢిల్లీసుల్తాను సేనాని జలాలుద్దీన్ హాసన్ షా యొక్క యాధిపత్యమునకు లోనయ్యెనని తెలియుచున్నది. వీడైనను తననాధుని యాజ్ఞలపైవర్తించుట మాని వానిపై తిరుగబడి స్వతంత్రించి వర్తింపజొచ్చెను. వానిచే నియమింపబడిన యధికారులు జలాలుద్దీన్ చే హాతులైరి. తన పేరనే నాణెముల ముద్రించి తానే మధురకు సుల్తానుడై అయిదుసంవత్సరములు రాజ్యమేలెను. వీని మంత్రియు, వీనియల్లుడు గయాజుద్దీన్ క్రమముగ సుల్తానులై మధుర పట్టణము నధివసించినవారైరి.

## ఉపద్రవములు

ఈనడుమ మహమ్మదీయులు మధురనగరమున కాపా దించిన యుపద్రవము లనేకములు. వీరి రాపిడికి వెఱచి ప్రజలొకరినొకరు చూచిమాటాడుటకే వెనుదీయుచుండిరి. పురవ్యవహారములన్నియు నున్నదున్నట్లు ముసల్మానుల సంప్రదాయమునకు లోనయ్యెను. జనులు వివిధములగు సంకటములకు పాలయిరి. పురదేవతను మళయాళము నకు కొనిపోయి దాచిరి. శ్రీరంగములోని రంగనాథునియు, శ్రీదేవి భూదేవులయు నుత్సవవిగ్రహములు మహమ్మ దీయులచే బడియె. దేవాలయములందలి పూజలు సంపూ ర్ణముగ నిల్చిపోయెను. పదునాల్గు శిఖరములచే కనులకు పండువై యొప్పుచున్న దేవాలయప్రాకారముల మహమ్మ దీయులు కూలద్రోచిరి. రథ్యల చెఱచిరి. ఎట్లో గర్భ గుడియు రెండు సత్రములుమాత్ర మీయాపదకు తప్పి మిగిలెను. ఇదియంతయు జరుగుట 1310 సంవత్సరము మొదలు 1340 సంవత్సరముల నడుమ. రాజ్యములోని ప్రజలకు రానురాను తమలోతమకు స్పర్థలు ప్రబలుచు న్నందున, ఐకమత్యము సున్నయై యప్పటి మహమ్మ దీయపాషండుల నెదిర్చి గెలువజాలరైరి.

వీరబల్లాళుడు

అయినను విధివశాత్తున నీవిషాదపరిస్థితుల దూరదృష్టి చే గని పావనదక్షిణాపథమున కాసన్నమయియుండు ప్రమాదము నరికట్టుటకు వీరాగ్రణి యొక డీమహా నాటకరంగమున పొడకట్టెను. ఈయన పేరు వీరబల్లాళసార్వభౌముడు (Veera Ballala III) హొయిసల చక్రవర్తులలోనివాడు. ఈమహోదారసంకల్పమును నెరవేర్చుట కసువులనే యర్పించిన త్యాగశీలుడు. తనజీవితమందు కార్యసిద్ధి గాంచలేకున్నను విజయనగరచక్రవర్తుల కీ కార్యదీక్ష నొప్పజెప్పి చన్నమహోపకారి.

వీరబల్లాళుని బలము లక్షయిరువదివేలపదాతులని లెక్కగొనబడినది. అంతకుముందు పలుమార్లు దక్షిణాపథము నాక్రమించ మొనసిన మహమ్మదీయులతో బోరి గెల్చినవాడు. దక్షిణపుకొనయం దుండు రామేశ్వరమున తన విజయధాటిని గుర్తించుటకై విజయస్తంభమును నాటించిన వీరాగ్రణి. ఈసమరములలో తుదిదానిని ౧౩౪౦ సంవత్సరమున సమక్షముండి చూచినవాడు ఇబన్ బాటుటా (Ibn Batuta). వీడు ముందుపేర్కొన్న మధుర సుల్తాన్ జలాలుద్దీన్ బావమరిది. ఇప్పటి శ్రీరంగక్షేత్రము నొద్ద 'కణ్ణనూరుకొప్ప'మను నూ రొకటియున్నది. ఇది యప్పటి

మధురసుల్తానునకు రాణువస్థానమై యారువేల బలము నకు వసతిగ నుండెడిది. వీరబల్లాళుడు తనసైన్యములతో నీ యూరిపై దాడివెడలి యక్కడి తురుష్కబలము నోడించి యాకోటను ముట్టడించెను. ఈ ప్రమాదమును సుల్తాను నకు దెల్పిరి. వాడు ఏడువేలగుఱ్ఱపురౌతుల గూర్చుకొని వీరబల్లాళుని నెదుర్కొన నడచెను. ఒక్కొక్క రౌతును తనపాగనువిప్పి గుఱ్ఱపుగొంతుకు చుట్టి (అది చావున కైనను సిద్ధమగుటకు సంకేతముగ) మొనసెను. అది మంచి మధ్యాహ్న సమయము. వీరబల్లాళుని సైన్యములు విశ్రమించుకాలము.

ఆవేళగు రైజిగి యున్నదున్నట్టు మహమ్మదీయుల బల ము శత్రువులపైఁబడ, అవి కకావికలై చెదరె. మహమ్మ దీయులు పట్టిచినశత్రువుల ననేకులఁ జంపిరి. మిగిలిన వారిలో కొంద రడవులలో దూరి దాచికొనిరి. వీరబల్లా ళుడు శత్రువులచే జిక్కెను. మహమ్మదీయులు వానిని తెగటార్చి వాని సర్వస్వము న్నాక్రమించిరి. వానిశవ మును కోటగోడ కానించి యున్నది తాను చూచినట్టు ఇబన్ బాటుటా (Ibn Batuta) వ్రాసియున్నవాడు. మహమ్మదీయుల యెడ తెగని పోరాటముతో హొయిసల వంశమే యిట్లు నిస్సంతుగ నంతరించెను.



కల్యాణదుర్గము (ఊరు, వెనుక కోటకొండ)

"అనంతపురమందలి కల్యాణదుర్గమే ఈ కల్యాణపురమని (౨ పుట.)



పురద్వారము, కల్యాణదుర్గము

" ఆయూర మిగిలియుండు పాతనాటి కోటకొత్తళములం దారాయని చూపులకాంతి నేటికిని లీనమై యున్నదేమో. " (౨ పుట.)

విద్యారణ్యయోగి

ఈహాయిసల సార్వభౌముని పరంపరయొక్క సామంతవర్గమునకు చేరియుండి మిగిలిన రాజన్యు లైదుగురు పట్టువిడువక యుత్తరాభిముఖులై యచట ప్రబలియున్న భామినీసుల్తానులనైనను దక్షిణమునకు దిగి రానీయక నరికట్ట సంకల్పించి వెడలిరి. వీరైదుగురు కాకతీయ ప్రతాపరుద్రునిమంత్రులనియు మరియొక ప్రతీతి యున్నది. ఆతురుష్కులు దిగవచ్చుచో మధురసుల్తానుని కలసికొన్న ప్పుడు దక్షిణాపథమున కాసన్నమగు నుపద్రవము నూహించియే యారాజన్యపంచక మీపన్నుగడ కుపక్రమించుట. వారి భాగ్యవశమున విద్యారణ్యయోగి తుంగభద్రాతీరమున - పాండవులకు వనవాసమున వ్యాసుడు పొడగట్టినరీతి. వారికంట బడెను. ఆపరిసరములందే కుందేళ్లుకొన్ని వేటకుక్కల తఱుముచుండినట్టును, ఆ విపరీతమును గని యాక్షేత్రమం దేదో క్షాత్రమహిమయుండవలెననియు విద్యారణ్యుడు గ్రహించినట్టు గాథయొకటి యనూచానముగ వినబడుచున్నది. ఆనెగొంది పరిసరములే యీక్షేత్రము.

సామ్రాజ్యస్థాపన

విద్యారణ్యయోగి యాయయిదుగురు రాజన్యులలో నొకడైన బుక్కరాజున కానెగొందియందు పట్టముగట్టి, యుం

తరించిన హొయిసల వంశము నుద్ధరించిన శ్లోకగాథ యున్నది. ఇది జరుగుట 1340 సంవత్సరమున. ఇదియే విజయ నగరసామ్రాజ్యసంస్థాపనమున కంకురార్పణ మందురు.

కుమారకంపన

ఈ బుక్కరాజునకు కుమారకంపనయను పుత్రుడుండెడివాడు. వీరబల్లాళునికీర్తి సాధించుటకై—మధుర లోని మహమ్మదీయుల వెడలగొట్టుటకయి తండ్రిచే నాజ్ఞాపితుడైన వీరుడు. వీడు పాండ్యరాజ్యమునే కాక దాని దిగువ యిప్పటి రామనాథపురపు జమీందారీ ప్రాంతముల సహితము స్వాధీనపఱచుకొనెను. ఈసంగతి కంచి, తిరువణ్ణామలెలోని శిలాశాసనములు ప్రకటించుచున్నవి. పాండ్యాక్రానికల్ (Pandya Chronicle) అను గ్రంథమందును దీని కాధారము కలదు. ఈకుమారకంపన భార్యలలో గంగాదేవి యను విదుషీమణి యొకతె. తన భర్త యొక్క చరిత్రమును సంస్కృతభాషయందు కావ్యముగ రచియించిన ప్రౌఢ. ఈగ్రంథము కొన్నిసంవత్సరములకు ముందు అనంతశయనమున దొరికినది. 'మధుర విజయ' మనియు 'కంపరాయ చరిత' మనియు దీనికి పేరు. మొదట దీనిని చదువువారికి యిది వాల్మీకి రామాయణశైలియా యని తోచును. దానిరచన యంత సౌష్ఠవ

ముగను, సులభముగను నుండుట యాశ్చర్యము. ఈవీరుడు మధురసుల్తానును సంహరించినట్లు లిందు కననగును. సాహాస్మ్మనీయశత్రువుల నిర్జించి పురప్రవేశముచేసి వా దర్బారున మూయబడిన దేవాలయముల గర్భగుళ్లను తెఱచి చూచెనట. ఏండ్లకుముందు వెలిగించి యుండిన యఖండము మండుచుండుటను, విగ్రహముల మెడలయందలి పుష్పహారములు వాడుపోక యపుడే వేసినట్లులుండుటను, నాభరణము లన్నియు నుత్సవకాలములలో వలెనే దేవి నలంకరించియుండుటను కుమారకంపన కనినట్లు లప్పటి వ్రాతలు చెప్పుచున్నవి. మరల శివ, విష్ణు దేవాలయముల దెఱచిచూడ నాగర్భస్థానము లందును నుత్సవకాలములందువలెనే విగ్రహము లలంకరింపబడియుండుట నారాయడు కనుగొనెనట. కండ్లకొత్తికొని, యర్చనల జేయించి వెలగల భూషణములను, గ్రామములను దేవాదాయములుగను, దానములుగను సమర్పించుటయెకాక, యదిమొదలుజరుగవలసిన షడితరదీపారాధనాద్యుత్సవములకు కట్టుదిట్టముల నమరింప నదిమొద లాదేవాలయములందు యథావిధి పూజలు జరుగ మొదలిడె నందురు.

గోపనరాయడు

కుమారకంపనుని విజయధాటివలన సిద్ధించిన దింతియ కాదు. ఆతరుణమున నిప్పటి దక్షిణఆర్కాడుజిల్లాలోని జింజి

కోటప్రాంతములు విజయనగరమునకు సామంతరాజ్యమై వెలసియుండినవి. దీని కధినాధుడు గోపనరాయ డను వాడు; కుమారకంపనున కాప్తసచివుడు. తన నేత, కుమార కంపన మధుర సుల్తానుపై దాడివెడలు సన్నాహమును ముందుగ నెఱిగినవాడై తిరుపతిజేరి యచట దాచియుంచిన శ్రీరంగనాథుని విగ్రహమును, శ్రీదేవి భూదేవి ప్రతిమ లను తన వెంట గొని జింజికేతెంచి, సింగవరపుగ్రామమున నుండుగుహాయందు దాచియుంచెను. ఈ విగ్రహములే మొ దట మధురసుల్తాన్ సైన్యముచే చిక్కియుండినవి. వానిని తురకల చెరనుండి వదలించి సాధించి తెచ్చినది యీగోపన రాయడే. ఈయంశము తిరువాసియను గ్రామముననుండు రంగనాథ దేవాలయపుగోడలో శిలాశాసనముగ చెక్కబడి యున్నది. అక్కడినుండి యీవిగ్రహములు మలయాళము, మైసూరులకు గొనిపోబడి అచటదాచబడి; పిమ్మట గొం తకాలమునకు తిరుపతికి దెచ్చి దాచబడినవె యిపుడు గోపనరాయడు శింగవరపు గుహాయందు నెలకొల్పుట. తన రాయడు(కుమారకంపన) మధురప్రాంతముల మహా మ్మదీయుల జయించుటకై విజయధాటి వెడలిన సంగతి విని, శ్రీరంగపరిసరములందు నెలకొనియున్న మహామ్మ దీయ శత్రుసైన్యముల బలాబలముల నరసి, సరియయిన

తరుణమున దగినంత సైన్యములతోపాటు విగ్రహముల దెచ్చి, శత్రులజయించి యచటదేవాలయమందు వానిని విధ్యుక్తసంప్రోక్షణలతో పునఃప్రతిష్ఠ గావించెను. ఈ విజయధాటియందు కుమారకంపనునికి తోడైన మరియొక వీరుడు సాళువమంగు. ఇంతటితో మధురరాజ్యమున సుల్తానుల యధికార మంతరించెను.

ఇవి యంతయు జరుగుట సుమారు ౧౩౭౭ వ సంవత్సరమున. అటుపిమ్మట పాండ్యరాజభాగమునకు కుమారకంపనుడే రాజై విజయనగర సామ్రాజ్యమునకు లోబడి పాలించుచుండెను. వానిపిమ్మట పట్టమునకువచ్చిన వాడు ఔరసుడగు ఒమ్మనయొడయరు. వీడు ౧౩౭౯వరకు రాజ్యాధికారము వహించియుండెను. ఒమ్మన యొడయరుకు తర్వాత పట్టమునకు వచ్చినవాడు ప్రకాశుడనువాడు ౧౪౦౪ సంవత్సరమువఱకు రాజ్యమేలెను. ఈకాలమంతయు పాండ్యరాజ్యప్రాంతములకు రాజాధిరాజులై ప్రభుత్వమును సల్పినవారు విజయనగర సార్వభౌములేయని రెండవహరిహరుని (Harihara II) కాలపు(౧౩౭౯) శాసనమొకటి వెలయించుచున్నది.

### కేంద్రప్రభుత్వ రచన

విజయనగరసామ్రాజ్య నిర్వహణమందు స్వార్థపరత కానరాదు. ఇందుకు దృష్టాంతముగ కుమారకంపనుని

యాదార్యకార్యము లెక్కగొనదగినది. సుల్తానుల మధుర నుండి వెడలనడచినపిమ్మట ఆప్రాంతముల తానాక్ర మించుకొనక పాండ్యరాజ్యమునకు వెనుకటి వారసుల వెతకి వారిని సింహాసనస్థుల జేయుటయే యిది. అపుడు పట్టమునకు వచ్చినవాడు సోమశేఖరపాండ్యుడు. అది మొదలు వానివంశీయులు విజయనగరమునకు సామంతు లై యనువర్తించుచు వచ్చిరి. కాని కుమారకంపనుని క్షాత్రప్రతిభ కాలక్రమమున క్షీణింప, పాండ్యులు మరల తిరుగబడి సామ్రాజ్యాధికారుల వెడలగొట్టి స్వతంత్రించి వర్తింపసమకట్టి ౧౪౭౫ సంవత్సరమున కాంచీపురము వరకు వ్యాపించిన మునుపటి సామ్రాజ్యభాగము నాక్ర మించినవారయిరి. విజయనగరపుచక్రవర్తులిట్టి దుడుకుల నరికట్టి, సామ్రాజ్యాధికారమును కేంద్రీకరించుటకై తమ బలముల నంపి యాప్రాంతముల మరల రాజధానికి లోబడ జేసికొనుచుండెడివారు.

ఈతరుణముననే రెండవ హరిహరరాయడు సార్వ భౌముడగుట. విరూపాక్షు డితనికొడుకు. ఈవీరుడు తుం డీర-చోళ పాండ్యరాజ్యములజయించి తండ్రికొసగి సామ్రా జ్యమునకు చేర్చినవాడు. సింహళద్వీపమునకు సహితము విజయధాటి వెడలి యచట విజయస్తంభము నాటించినట్టు ప్రకటించుకొని యున్నాడు.

## వైభవోన్నతి

పిమ్మట సింహాసన మెక్కిన సార్వభౌముడు రెండవ దేవరాయుడు. (Devaraya II) ఈ చక్రవర్తికాలమున సామ్రాజ్యము నావహించి యుండిన వైభవోన్నతు లసమానము లయియుండెనని అబ్దుర్ రజాక్ అను పరిషియా దేశపు యాత్రికుడు వ్రాసియుంచిన వ్రాతలవలన కనబడును. వీడుసుమారు ౧౪౩౪ వ సంవత్సరమున విజయనగరమునకు వచ్చి కొన్ని నెలలు నిల్చి రాజ్యస్థితిగతుల సమక్షము చుట్టిచూచినవాడు. నేల యెల్లెడల సారవంతమును, ఫలవంతమునయివానికికన్పట్టెను. మంచిసముద్రపు రేవులు మూడువందలు ఉండినవి. ఏనుగులను చూచినపుడు ఇవి కొండలా, దయ్యములా యను భ్రాంతి కలిగించినవట. అవి యంతగొప్పవై వానికి కన్పట్టెనన్నమాట. సైన్యబలము పదునొకండులక్షలు. భరతఖండమందే యింతటి ప్రతాపవంతుడగు భూపుడు లేడని యీబాటసారికి తోచినది. లోకమందు విజయనగరమంతటి రాజధాని మరియొకటి కని విని యెఱుగనని వ్రాసియున్నాడు. ఒక్కొక వీధికిని మహా ద్వారమును, ఆమహాద్వారముపై సౌధము శిఖరముతో నలంకృతమై యొప్పుచుండెడిది. సార్వభౌముని నగరు విస్తారమై ఉన్నతోన్నతమగు చంద్రప్రస్తర

గోపురముతో నీబాటసారికి కనుల పండువొనర్చినది. వీథుల పొడవటుండ వెడల్పు మిక్కిలియై ఇరువైపుల పూల యంగళ్లు నాపాంథునికంటికి సొంపునాపాదించెను. సువాసన గల పుష్పములు వాడుపోక కోరినన్ని యమ్ముడు పోవు చుండెనఁయు, యానగరపు జనులు పువ్వులు లేనిచో బ్రదుకలేరేమో యనునట్లు తనకు తోచెననియు ఆతడు వ్రాసియున్నాడు. నానావిధములగు శిల్పవస్తువుల, కార్మి కులు వేర్వేరు వీథులందు నెలకొని, పనిచేయుచుండిరట. కళాదులు వజ్రవైడూర్యములవంటి వెలగల రత్నము లను బహిరంగముగ నమ్ముచుండినదియు తాను చూచిన వాడు.

దేశమెల్లెడల ప్రజ యసంఖ్యాకమై వరలుచుండెను. దేహకష్టముచే బ్రతుకువాడు సహితము బంగారు చెవి పోగులు, హారములు, కంకణములు, ఉంగరములు ధరించు చున్నట్లాపాంథుడు వ్రాసియున్నాడు.

మహానవమి యుత్సవవైభవమును గూర్చి యాతడు వ్రాసినసంగతి ఇంకను చిత్రమై యొప్పును. విశాలమైన బహిరంగప్రదేశమునందు అక్కడక్కడ మనోజ్ఞము లగు మంటపముల నంతస్థులంతస్థులుగ తీర్చియుండిరి. పొడుగునను వాని గోడలయందు వన్నెలతో చిత్రించి

యుండిన ఏనుగులు, గుఱ్ఱములు యితర మృగములే కాక దోమ చీమలంతటి చిన్న పురుగులను సహితము సూక్ష్మాంగములతో ప్రదర్శించిన కౌశల మాయభ్యాగతుని కచ్చెరువు గొల్పినటులు వ్రాసి యున్నాడు. ఇంతేకాదు. ఈ మంటపము లోకొక్క కిటికీయు నిలువున తిన్నగ లోపలి నిలువుటెరుసుపై తిరుగుచు నలుప్రక్కల చిత్రముల చూపరులకు ప్రదర్శించునటులు రచియింపబడిన విన్నాణము వానికి మెప్పుతోగూడ నయచ్చెరువు గల్గించెనట.

ఈ దేవరాయని కాలమున (Devaraya II) నయితము పాండ్యరాజ్యమంతయు మొదటివలెనె విజయనగర చక్రవర్తులకు లోనయియుండి వారిపక్షమున లక్కన మాదన లనువారిచే, మధురయే రాజధానిగ పాలింపబడుచుండెను. మధురలోని పాండ్యరాజులు కొన్ని వేళల విజయనగరమునకు లోబడి వర్తించుటయు, సందుదొరకినపుడు స్వతంత్రించి నడువజూచుటయు సంభవించుచుండెడిది. పిమ్మట నూరుసంవత్సరములకు మానభూషణుడను రాజు విజయనగరమునకు సామంతుడై పాలించుచున్నవాడున్నదున్నట్లు విజయనగరమునకు ధిక్కరించి వర్తింపజొచ్చెను. అపుడు విజయనగరమందు చక్రవర్తి విరూపాక్షుడు. వీనికి నరసనాయకుడను వీరుడు సేనాని. ఇత

నికి నరసింహానాయకుడనియు పేరు. మరల పాండ్యరాజ్యముపై దండెత్తి మానభూషుని జయించి వానిని విజయనగరమునకు లొంగి వర్తింపజేసిన దిట్ట. ఆపిమ్మట సామ్రాజ్యసింహాసనము నధిష్ఠించినవాడు సాళువ నరసింహుడు. వీనిని సింహాసనమెక్కించి పట్టముకట్టినవాడు మన కథానాయకుడగు రామరాయల పితామహుడు బుక్కభూపతి యని యింతకుముందే సూచింపబడినది. ఇతనితోనే సాళువవంశ మారంభమగుట. ఈసార్వభౌముని కాలమున సహితము పాండ్యరాజ్యమునేకాక చోళరాజ్య భాగమును సహితము జయించి సామ్రాజ్యమున కిచ్చిన యోధ యీనరసింహానాయకుడె. ఇతడు తుళువ వంశమునకు చేరినవాడు. తనవిజయధాటియం దనేక రాజన్యుల జయించి సామ్రాజ్యవిజయధ్వజమును రామేశ్వరమువరకు గొనిపోయి నాటించిన కార్యశూరుడు. అచటనుండి తిరిగి మైసూరునొద్దనుండు శ్రీరంగపట్టణపువైపున ప్రయాణము కాగ, కావేరినది వెల్లువలతో నడ్డమైదాటుట కలవికాక పోయెను. అపుడేతనసైన్యముచేత వంతెనను కట్టించి దాటి వచ్చిన కార్యదక్షు డీ నరసనాయకుడు. శ్రీరంగపట్టణము చేరి యక్కడి యధిపతిని జయించినవాడు సామ్రాజ్యమునకు సామంతుడై పాలించ నొప్పుకొన్నందున జయించిన

రాజ్యమును వానికే యొప్పజెప్పి రాజధానికి మరలిన యుదారవర్తనుడు. సాళువ నరసింహుని పిమ్మట వాని యౌరసుడు ఇమ్మడి నరసింహునికి పట్టముకట్టించినదియు ఈనరసనాయకుడే. వీనికొడుకు నరసింహుడు ఇమ్మడిని చంపి తాను సింహాసనము నెక్కెను. అపుడే తుళువ వంశ మారంభమగుట. వీనిపిమ్మటనే కృష్ణరాయలు సార్వభౌముడయి విజయనగరసింహాసనము నధివసించెను.

## శ్రీకృష్ణదేవరాయలు

పైచరిత్రాంశముల నొట్టుగవిచారించి చూచినయెడల, రమారమి రెండునూర్ల సంవత్సరములకాలము విజయ నగరచక్రవర్తులు దక్షిణప్రాంతముల తమసార్వభౌమ తను వ్యాపింపజేసి యేలికబలము నొకతట్టు కూర్చుటకు చేసిన యత్నములును, ఆయత్నములు కార్యసిద్ధియందు నిలుకడ లేకపోవుటయు, దృష్టిపథమునకు వచ్చును. కృష్ణ రాయలు ౧౫౧౦ వ సంవత్సరమున సింహాసన మెక్కిన తర్వాతనే యీయుద్యమమునకు కుదిరిక కల్గి తుంగభద్ర మొదలు కన్యాకుమారీ సింహళద్వీపముల వరకు సామ్రా జ్యాధిపత్యము కేంద్రీకరింపబడుట. ఉత్తరమున కటకాధీ శుడగు గజపతిని, ఉదయగిరి, కొండవీడు కొండపల్లె, రాజ

మహేంద్రవరములనుండి తరిమి సింహాచలమునకు మరలి యచటవిజయధ్వజమును స్థాపించెను. అటుపిమ్మటనే కృష్ణ రాయలవిజయధాటి దక్షిణాభిముఖముకాజొచ్చినది.ఆతరు ణమున జింజిరాష్ట్రప్రాంతము మరల పలువిధములు చెదరి వేర్వేరు నాయకులపాలయి యుండెను. వీ రొక్కొక్క రును స్వాతంత్ర్యమును లెక్కగొనక వర్తింపజొచ్చిరి. ఈవిష మస్థితిని సవరించుటకై రాయలు లక్షసైన్యముల ప్రోగు చేసి తగిన సేనానాయకులతో దక్షిణ దిగ్విజయయాత్రకు పంపినవాడాయె. వయ్యప్ప, తుబాకి కృష్ణప్ప, రాఘవ, వెంకట యనువా రీవీరవరులు. వీనికి ప్రధాని వయ్యప్ప. ఇది బయ్యపనామాంతరము. వీరందరు తమదళములతో రాయవేలూరుచేరి దండు విడిసిరి. చుట్టునున్న నాయకు లొక్కొక్కరుగ వయ్యప్ప యొద్దకు విధేయులై వచ్చి నతులొనర్చి స్వాతంత్ర్యమునకు వాడునిర్ణయించిన కప్పముల చెల్లించిరి. అపుడు కాళహస్తి నాయకుడుగ నున్న బొమ్మి రెడ్డి యీవిధేయవర్గమునకు జేరినవాడె. అనంతర మీ జిగీషువులు వేలూరినుండి జింజికోటజేరి యచట తమ శిబి రముల నెలకొల్పినతోడనే చోళరాజ్యపు రాజన్యులు యథావిధి విధేయులై తమతమ కానుకల వయ్యప్ప కర్పించిరి. పాండ్య చేర రాజ్యాధిపతులును నిదేతీరున నను

వర్తులై వచ్చినందున వారివిజయధాటి ఫలవంతమై తూర్పు దిక్కంతయు రాయల యధీనమయ్యెను. అపుడు పోగయిన కానుకల మొత్తము మూడుకోట్లు. ఇక పడమటి ప్రాంతముల పాలించుచుండిన గెరసొప్ప, బరకూరు, కల్లికోట, భట్‌కల్ రాజు లంతకుమునుందే సామంతవర్గమునకు చేరినవారై యథావిధి రాజధానియందు మన్నింపబడుచుండెడివారు. ఈతీరున దక్షిణప్రాంతములంతయు తుంగభద్రమొదలు సింహళమువరకు సామ్రాజ్యమునకు లోనయి విజయనగరప్రభుత్వము కేంద్రీకరింపబడుట కారంభ మయినదియు నపుడే. అది మొదలు పాండ్య చేర చోళరాజ్యములం దంతఃకలహములు తఱచుగ నస్తమించె ననవచ్చును. పుణ్యతీర్థములు, దేవాలయములు మెలమెల్లన ముసల్మానుల దాడినుండి పరిరక్షింపబడుచు వచ్చెను. అంతియకాక క్రొత్తక్రొత్త నిమిత్తముల కల్పించుకొని పుణ్యక్షేత్రముల, దేవాదాయముల హెచ్చించుటకు రాయల యౌదార్యమే మేల్బంతిగ గొని సామంతులు సహితము తమతమ రాష్ట్రభాగమందు గల పుణ్యతీర్థముల నర్థవంతములుగ జేయసాగిరి. ఇదియటుండ నుత్తరమున బ్రబలుచున్న బహామనీసుల్తానులను దక్షిణాపథమునకు దిగిరానీయక పవిత్ర దేశమును రక్షించివీరబల్లాళ

సార్వభౌముడు దిగవిడచి దివికేగిన కార్యదీక్షను సిద్ధిగావింప మొదలిడినవాడు కృష్ణరాయడే. ఈయుద్యమమున రాయలుచేసిన సన్నాహకథ యాయనచరిత్రమందు వచ్చు నధ్యాయమునకు విషయము.

## కృష్ణరాయల నిర్యాణము

ఈపరిస్థితు లిటులుండునపుడే ౧౫౩౦వ సంవత్సరమున కృష్ణరాయ లంతరించుట. అదివరకు చోళరాజ్యమునకు సామంతనాయకుడై యుండిన సెల్లప్ప యాసమయమున విజయనగరమునకు తిరుగబడి వర్తింపమొనసినందున రాజధానినుండి బలములు వెడలి వాని నెదుర్కొని లొంగ జేయవలసివచ్చెను. అప్పుడు వాడు కేరళదేశపు (అనంతశయనము) రాజు మరుగుజొర, నారాజు సెల్లప్ప నూతగగొని యప్పటికి సామ్రాజ్యమునకు లోనై యుండిన తిరునెల్వేలి ప్రాంతములపైబడి యాక్రమించెను. రాయ లస్తమించుటచే నుత్తరముననున్న బహమనీ సుల్తానులు తమకు విపత్తు తప్పెనని యెదకుసీరుతట్టుకొని మరల విజయనగరముపై దాడివెడల లోలోన నువ్విళ్లూరజొచ్చిరి. రాజ్యమం దక్కడక్కడ యనాయకత్వ మేర్పడెను.

---

# నాల్గవ యధ్యాయము

## విశాలోద్యమము

"ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ
ప్రజ్ఞానిధుల్ గావునన్."
—(ధైర్యపద్ధతి, భర్తృహరి.)

కృష్ణరాయ లవసానకాలమం దళియరామరాజును చేర బిలిచి ప్రభుత్వాధికారమును చేత నునిచి అచ్యుతునికి పట్టము కట్టుమని చెప్పిన ట్టిదివరకె సూచింపబడినది. ఆతరుణమున నగరున కోశాధిపతిగ నున్నవాడు సలకము తిమ్మరాజు. వీనికి చిరుపిచ్చి. ఉచ్చుతిమ్మ యనుట వీనికి మరియొక పేరు. రామరాయ లదివరకే మంత్రియై రాజ్య తంత్రమున యనుభవము గడించినవాడు.

### రామరాయని కార్యభారము

ఇక రాజ్యభారమంతయు నాతనిపై బడుట యేమియాశ్చర్యము? రాయల యభీష్టముచొప్పున నచ్యుతునికి పట్టము కట్టెను. అదిమొదలు సామ్రాజ్యచరిత్రమంతయు తఱచుగ రామరాజు జీవితకథయే. అచ్యుతుడు సింహాసన

మెక్కి జీవించిన పన్రెండు సంవత్సరముల కాలము రామ రాజు రాజ్యమున కాపాదించిన దశనుగూర్చి వెనుకటి యధ్యాయమున వివరింపబడినది. ఈవిళంబమునందును, నటుపిమ్మట తాళికోటయుద్ధమున తెగి వీరస్వర్గమునందు వఱకు నీరాజన్యుడు గురియందుంచి మొనసిన కార్య భాగములు మూడు. ఇందు దక్కనీమహమ్మదీయులను తుంగభద్ర దిగి దిగువకు రానీయకుండుట మొదటిది. దక్షిణమందు చోళ పాండ్య చేర కర్ణాటరాష్ట్రములలోని సామంతనాయకులయందు స్వయూధకలహములనివారించి వారినందరినిసామ్రాజ్యమునకు వలయించి విజయనగరమం దలి కేంద్రప్రభుత్వమునకు శక్తి నాపాదించుట రెండవది. జాతీయపరార్థ సంప్రదాయముల కాసన్నమయిన చ్యు తిని సవరించి పునఃప్రతిష్ఠ కావించుట మూడవది. ఈ కార్యపరిమాణ మింతయని తెలియవలెనన్న మధుర సుల్తాన్ జలాలుద్దీన్ వీరబల్లాళులయొక్క వెనుకటి చరి త్రమును మనసునకు తెచ్చుకొన్న చాలును. ఇక సామంతవర్గములలో సామరస్యము నెలకొల్పబడకున్న వీరపాండ్యునివంటివా డెపుడైనను దేశభక్తిని, దైవభక్తిని తుంగలోద్రొక్కి స్వార్థమునే కులదైవముగ భావించి, దూరముననున్న విముఖుల జేరబిలిచి లోపలికి విడిచి,



విజయనగరసామ్రాజ్య శంకుస్థాపనము

తుదకు తాను చెడి దేశమునే యనర్థమునకు పాల్పఱచుట పొసగును. ఇట్టి ప్రమాదముల నాపుటకొరకే సామ్రాజ్యమును కంటిరెప్ప కాచినట్లు కాచి రాజ్యాంగపు నడుమునకు బిగువును సమకూర్చి భద్రముగ నిలబెట్ట బూనిన వాడీ దేశసేవాధురంధరుడు. వీరబల్లాళ విద్యారణ్యుల మనోరథము నీడేర్చుటకై రణరంగమం దసువుల ద్యజించిన గుణోత్తరుడు; మానధనుడు; వీరాగ్రణి.

## హిందూమహమ్మదీయ సామరస్యము

ఈరాజన్యు (అళియరామరాజు) నిట్టి వీరదీక్షకు సమకట్ట పురికొల్పినది మహమ్మదీయ మతద్వేషముగ నగపడదు. సామ్రాజ్యోద్యమమందే ఇట్టి విరసపుగరిమ కెడమే లేదనవచ్చును. హిందూమహమ్మదీయసామరస్యపు గురుతులు పదునేనవశతాబ్దమున దేవరాయ సార్వభౌముని కాలముననే ప్రాచుర్యమం దుండెననుటకు, స్థిరసంకేత మొకటి అనంతపురమండలపు కదిరిపట్టణ పరిసరములందు సమాధిరూపమై యుండుట నేటికిని చూడనగును. ఈసమాధి యొకభాగము హిందూవైఖరిని, మరియొకభాగము మహమ్మదీయ సంప్రదాయమునను నమరియుండుట యతిచిత్రము. దీనినిగూర్చిన మైతిహ్యామిది:

చంద్రవదనయను కన్య యొకానొక రంగానాయని కొమరిత. ఈనాయఁడు దేవరాయ సార్వభౌముని కాలమున యిప్పటికి కదిరికిప్రక్కనుండు పాతరేపల్లెపట్టణమున నెలకొని యాపరిసరముల పాలించుచున్న వీరుడని ఆ యూరి దేవాలయములోని శాసనము వెలయించుచున్నది. నేటికిని ఆయూరు చెరువునకు రంగానాయని చెరువని పేరు. చంద్రవదన పేరునకు తగినట్లు దినదిన ప్రవర్ధమానయై యాపె చక్కదనపుకీర్తి దిక్కులకు వ్యాపించియుండెను. ఈయమ ప్రతిశుక్రవారము కదిరి నృసింహ దేవాలయములోని అమ్మవారిపూజకై తగిన పరివారముతో వచ్చుచుండెడిది. ఆ కాలమున 'మోహియార్'అను తురకవణిజు డొకడు-పారసీకమువాడు కాబోలును - ముత్యములు రత్నములు, నితరములగు వెలగల రాళ్ల వ్యాపారమున దక్షిణ హిందూస్థానమున తిరుగుచు కదిరి చేరినవాడాయె. చంద్రవదన చక్కదనమును గూర్చి విన్నవాడై యాకన్నియను దర్శించుటకొరకు కొంతకాలము కదిరియందు నిల్చియుండెను. ఆనడుమ యొకశుక్రవార మెప్పటివలె యా సుందరి యమ్మవారిని పూజించినపిమ్మట దేవాలయము వెడలి వచ్చుసమయమున కావి దేశవణిజుడు బైరాగి వేషమున గోపురపుముఖద్వారమున నిల్చియుండి.

దానిని కని మోహితుడై సాహసించి చెట్టబట్టుకొనియె. పరివారములోనివారు యీదుడుకు నాపి యాకన్నియ చెరవడలింప సమకట్ట, పోరుజరిగి యందా కపటసన్యాసి హతుడయ్యెను. దేవళపువాకిలి కిట్లడ్డమైపడిన శవమును చుట్టునున్నవారు మోసివేయమొనసినపు డదికదలదాయె. విస్మితులై వా రుపాయాంతర మేమని యోచించుచుండ తన్నునాశవముతో కట్టికొని మోయుపట్ల నది జరుగునని చంద్రవదనయే సూచించె ననెదరు. వారందుల కీయకొని రెండు శరీరములుకట్టి పైకెత్తినపుడు చులకనై మోసికొన పోవ గల్గిరనుటగాథ. ఈ గాథయందలి సత్య మెంతయో చెప్పుటకు కాదుగాని యిప్పటి పాతర్లపట్టణమున రంగా నాయడనువాడు అయిదునూర్ల సంవత్సరములకు ముందున్నవాడనియు, వానికొమరిత చంద్రవదన యనువరకు నిజమనుట కనుమాన ముండదు. కదిరి దేవాలయపు గోపుర ముఖమంటపమును నేటికిని చంద్రవదన మంటపమనెదరు. ఆ రెండుశరీరములు పూడ్వబడినచోటే పై పేర్కొన్న సమాధి. 'చంద్రవదన మోహియార్ గోరి' యనుట దీని కనూచానముగ వచ్చినపేరు. దంపతులకు ప్రణయభంగ మొదవినపుడు దుఃఖితులీసమాధికి మ్రొక్కులు చెల్లింతురనియు, నామూలమున వారి విప్రలంభము సమయు

ననియు, నేటికిని ఈచుట్టుప్రక్కల ప్రతీతియున్నది. ఈవిచిత్రక్షేత్రములోని మట్టిపాట్లములకై కాబూల్ బెలూచిస్థానములనుండి దరఖాస్తులు వచ్చుచుండునట. ఇక్కడిదుమ్ము దంపతుల విరసతను పోగొట్టి సామరస్యమును నెలకొల్పుటకు సిద్ధౌషధమనుట యిక్కడి ప్రజల నమ్మకమైయున్నది.

మరియొకచిత్రము. ఈయూరనే పురాతనపు మశీదొకటి కలదు. మోహరంపండుగ కాలమందు దీనికి సున్నముపూయించుట వాడుక. ఇట్లు సున్నము పూయించుటకై యక్కడి నృసింహస్వామి దేవాలయపు టధికారులు కోవెల బొక్కసమునుండి ఖర్చుపెట్టి, రెండుపోరకలు, కొంతసున్నము, పూతకూలికై కొంత రుసుమును ఈ మశీదున కేటేట పంపుట యనూచానపద్ధతి నైయున్నది. అట్లే మశీదునుండి ఒక్కొక్క ఫాల్గునమాసమందును జరుగు రథోత్సవకాలమున గుడి పూయించుటకై రెండుపోరకలను కొంతసున్నమును, పూతకూలికి కొంత పైకమును యిప్పటికిని పంపబడుచుండును. ఇప్పటికి సుమారు ముప్పది నలుబది సంవత్సరములకు ముందువరకు దేవాలయపు రంగనాథస్వామి యుత్సవవిగ్రహము మెరవ

ణితో వీధులవెంబడి యేటేట కొంపోబడుచు నా ప్రాత మశీదు నెదుట నిల్చి కొలువుతీరుచుండె ననియు ప్రతీతి యున్నది.

మధురసుల్తాన్ జలాలుద్దీనయినను అప్పటి హైందవమత సంప్రదాయముల జోలికి బోక యిప్పటి బ్రిటిష్ ప్రభుత్వము వలెనో, హైదరాబాదు నైజాం పద్ధతి ననుసరించియో తటస్థుడై పాలన సల్పియుండిన, వాడు తురకయనుట ప్రజల మనసునకే వచ్చియుండదేమో. తమ కార్యదీక్ష యందు మహమ్మదీయమతము నెడల విరసమున కెడ మీయక విజయనగరపు చక్రవర్తులు మెలగుటయే కాక సామరస్యమును నెలకొల్ప జూచిరనుటకు గుర్తులు మెండు. ఉత్తర హిందూస్థానమందువలె గాక, రాయలసీమ ప్రాంతముల మొహరంపండుగ కాలమున హైందవులు లాడీలుధరించి ఫకీరులగుటయు, పీర్లపంజాలకు బ్రాహ్మణులు సహితము భక్తిపురస్సరముగ జక్కెర చదివించుటయు, తొమ్మిదవ సరగస్తినాడు మతభేదముల నెంచక నుభయజాతులవారు కలసిమెలసి యలావాడి వినోదములు సల్పుటయు, హైందవసామ్రాజ్యపు టుదారధర్మ ప్రతిభ యనుట విచారపరులకు పొడగట్టకమానదు. విజయనగరపు చక్రవర్తులకు దక్కని సుల్తానులపై నొకక న్నెడ

తెగకయుండుచువచ్చినను, నొకొక్క సుల్తానుడు తన స్వార్థమునకై పొరుగు సుల్తాను నెదుర్చుటయందో, లేక తన్నెదుర్చు మరియొకసుల్తానుదాడినుండి తప్పించుకొనుట కో, విజయనగరపుచక్రవర్తులసహాయముకోరి సఖ్యతనులు సల్పినసమయములు పెక్కులు. తాళికోటయుద్ధకాలము వఱకును దక్కని సుల్తానులలో నెవఁడో యొకఁడైనను నెడ తీయక విజయనగరముతో నెయ్యముగల్గి వర్తించుచుం డెను. ఇట్టి పరిస్థితియందు మతభేదభావముల కెడమిచ్చుట రాజనీతికాదని విజయనగరచక్రవర్తులవంటి యుదారులకు దెలియకపోయె ననుట యెట్లు? ఈ తీరున చెలిమిసాగించ వలసిన తరుణములందును పరస్పరసంభాషణ సంపర్కము లందును, నాతిథ్య మొనర్చుటయందును మతభేదభావ ములు పొడకట్టినను, వానిని మర్యాదకైనను మఱుగు పఱచి వర్తించవలసిన యవసరములచే నట్టిభేదజ్ఞానము సమసిపోయెననుట యేమియాశ్చర్యము? ఇంతమాత్రమే కాదు. మహమ్మదీయ మతసంస్థల విజయనగరచక్రవ ర్తులు కేవల ముపచారమునకే కాక త్రికరణ పురస్సర ముగ గౌరవించుచువచ్చి రనుటకు పెనుగొండలో నుండు బాబయ్యదర్గా ప్రబలమైన సాక్ష్యము. 'బాబయ్య' యనునది బాబా ఫకురోద్దీనుకు నామాంతరము. ఈ

మహమ్మదీయ సాధువు ౨౦౦ సంవత్సరములకు ముందు వెలసిన బ్రహ్మజిజ్ఞాసువు. ఈయనసమాధియే పెనుగొండ బాబయ్యదర్గాయందుండు పూజ్యస్థానము. దీనిపూజాదీపారాధనలకును,నాయవధూతస్మృతిని,ఏటేటజరుగు నురుసు వెచ్చములకును తొమ్మిదిగ్రామముల నినాముగ నొసగిన వారు విజయనగరపు ప్రభువులు. ఉరుసుకాలములందు చుట్టుపట్లపల్లెటూళ్ల హైందవ-కాపు-వర్గము నేటికిని కొమ్ము తప్పెటమేళముతో నన్నమును బండ్లుబండ్లుగా తెచ్చి తురకలనక, హిందువులనక యాత్రికులకు వడ్డించుట చూచినపుడు హిందూమహమ్మదీయ సామరస్యము నాట్యమాడుచు నున్నదో యనునట్లు చూపట్టును. ఈ బాబా ఫకృద్దీన్ గురుపరంపరకు చేరినవారి సమాధులు ఇప్పటికిని తంజావూరుజిల్లా నాగూరు నాగపట్టణములందు చిరకాలముగ నెలకొనియున్నవి. విజయనగరపు చక్రవర్తులును, వారి యనుచరులును చోళరాజ్యముపై దాడివెడలిన సమయము లెన్నియో యైనను నొకవేళనైనను నామహమ్మదీయ సంస్థల నుదాసీనముతో తిరస్కరించినట్లగుపడదు. అట్లుండినట్టయిన నాసమాధులు భగ్నములై శిథిలస్థితి నుండియుండవలెను. ఇంతెల; శ్రీరంగక్షేత్రమందలి శ్రీరంగనాథుని

సతీవర్గమున శ్రీదేవి భూదేవులతోపాటు, తురకబూబూ. బీబీనాంచారును దేవేరిగ మన్నించుచు పూజించుచు వచ్చిన యుదారవర్తనులు విజయనగర చక్రవర్తులు. ఈ దేవికై తిరుచునాపల్లెయొద్దనుండు ఒరయూరున దేవాలయము ప్రత్యేకముగ నొకటియున్నది. ఇది శ్రీరంగము. నకు నాల్గుమైళ్లు. సామ్రాజ్యమునకు చోళ రాజ్యమున వెలసియుండిన యుపరాజధాని. ఈ దేవాలయమును కట్టించి, దేవిని ప్రతిష్ఠించి పూజలు సల్ప నియమించిన ప్రభువు విశ్వనాథ నాయకుఁడు. ఈ రాజన్యుడు విజయ నగరమునకు సామంతుడై ౧౫౬౧ వరకును సుమారు 30. సంవత్సరములు మధురయె రాజధానిగ పాండ్య చోళ రాజ్యముల నేలిన నేత. ఒరయూరు నధివసించిన చక్ర వర్తుల ప్రతినిధులు ఈదేవి సన్నధిని స్వయముగ కైంక ర్యముల చేయుచుండెడివారు. ఇదేవ్యక్తియే తిరుపతి యందును మేలుకోటయందును నెలకొని పూజలనందు చుండిన సంగతి యాత్రికు లెఱిగినది. శ్రీరంగ దేవాలయ ముయొక్క లోపలి ప్రాకారపుగోడయందు

"లాఇలాహాఇల్లల్లాహు
మొహమ్మదర్ రసూలుల్లాహి"



చంద్రవదన మంటపము (౮3 పుట.)



చంద్రవదన మంటపము (౮3 పుట.)

“కదిరి దేవాలయపు గోపుర ముఖమంటపమును చంద్రవదనమంటప మనెదరు.”



చంద్రవదనమోహియార్ గోరీ

(౮౩ పుట.)

అను అరాబిక్ మంత్రము, చదరపు రాతిపలకపై యుబ్బు
వ్రాతతో నమర్చబడియున్నది. బ్రాహ్మణులకు గాయత్రి
యెట్లో తురకలకీ వాక్య మట్టిది. ‘ఏదేవుడు మహమ్మ
దును నీ లోకమున నవతరింప చేసెనో ఆ దేవు డొక్కడే!’
యనుట యిందలి తాత్పర్యము. ఈ పవిత్రక్షేత్రమందు
ఈ మహామంత్రపు రాతివ్రాలు నేటికిని వైష్ణవపూజారు
లచే ధూపదీపములతో నర్చింపబడుట కననగును. మును
పటి శ్రీ రంగమును జీర్ణోద్ధారముచేసి సవరించిన వాడు
విశ్వనాథనాయకుడు. ఈ అరాబిక్ మంత్రను శ్రీ రంగము
వంటి పవిత్రక్షేత్రమున బహిరంగస్థలమం దమర్చి దానికి
పూజల విధించిన సాహసకీర్తి ఈ విశ్వనాథునిదై యుండ
వలెను. ఈ విశేషముల సమగ్రముగ నాలోచించినట్లయిన
విజయనగరపు చక్రవర్తులు భారతదేశీయజాతీయైక్య
మును, రచించి హిందూమహమ్మదీయ సామరస్యమును
వివాహసంస్థల మూలమున స్థిరముగ సమర్థింప నెంచియే
బీబీనాంచారునకు గుడి కట్టించిరేమో యనవలసియున్నది.
ఉత్తరహిందూస్థానమున నటుపిమ్మట అక్బర్ చక్రవర్తి
రసపుత్రకన్యను వివాహమై యుభయజాతుల సమ్మేళనము
నకు దోడరుట విజయనగర మదివర కాపాదించుచున్న
సామరస్యపుప్రభావ మనుట యసంభావ్యము కాదేమో.

ఈ మహోదారాశయముయొక్క పరమార్థమును మాలిక్ కాఫర్ నాటి మహమ్మదీయసుల్తానులు గ్రహించునంతటి చిత్తసంస్కారము చాలక విముఖులైయున్న కారణమున నీఘనయత్న మప్పుడు ప్రాచుర్యమునకు రాలేక పోయెనని యూహించుట యొప్పును. పిమ్మట కొంతకాలమునకు గోలకొండ సుల్తాన్ తానీషా యీ నవీనాదర్శమును చవి గొన గల్గి సామరస్యము ననుభవించిన వాడనుట రామదాసు చరిత్రమును చదివిన వారెల్ల రెరుగుదురు. ఈ యనుభవపు ప్రతిభయె యది మొదలు పరంపరగవచ్చి యిప్పటి నైజాం, భద్రాచల తీర్థస్థానమునకు కైంకర్యముల జేయుచున్న వాడనుట సంభావ్యము. పదునెనిమిదవ శతాబ్దమున నయిత మిప్పటి కడప ప్రాంతముల నేలుచున్న మహమ్మదీయాధికారులు హైందవసంస్థలకు దానము నిచ్చుచుండిరనుట కాధారము లేకపోలేదు. దువ్వూరు పరగణాయందు శంకరపురమును కట్టించి, యచట వేదశాస్త్ర పాఠశాల నెలకొల్పుటకై మహమ్మద్ సాబ్ ౧౭౫౨ సంవత్సరమున దానపత్రమును వ్రాయించి యున్నాడు. ఇప్పటి మైసూరు మహారాజు శ్రీకృష్ణరాజేంద్ర ఉడయర్ ఊరేగింపులందు పట్టపుటేనుగుపై తమ వెనుక మహమ్మదీయమంత్రిని

కూర్చుండబెట్టుకొని మెరవణియగుట ప్రజలకీ పాతనాటి పెద్దల సామరస్యధర్మమును ప్రకటించుటకే.

మన రామరాజే తన కుమారుడు మృతుడయి దుఃఖించుచున్న సమయమున గోలకొండ సుల్తాన్ అడిల్షా దుఃఖోపశమనము చేయబోయి తన్ను చనిపోయిన కుమారునికి మారు కొడుకగ భావించి యోదార్పు చెందుమని వేడుకొనెనట. ఈ వేడికోలు కేవల ముపచారమై సమసినట్టగుపడదు. రామరాజు సతీమణి యీయనునయవాక్యమును కార్యతః గ్రహించి యామహమ్మదీయ రాజయువకుని పుత్రునివలె భావించి రాణివాసమున నుంచుకొని వానియెడల నిజమైన వాత్సల్యమునే పెంచియుండెను.

సామ్రాజ్యమునకు సామంతుడై మధుర నేలుచున్న విశ్వనాథ నాయకుడు ముల్లాఫిరోజ్ అను మహమ్మదీయ పురోహితుని పేర మసీదున నమాజు చదివించుటకై కొంత క్షేత్రము నినాముగ నొసగినసంగతి యప్పటి తామ్రశాసనమున వ్రాయబడి యుండుట మదరాసు మ్యూజియమున గననగును. చోళరాజ్యమున కధినాథుడై పాలించిన సేవప్పనాయకుడు మన యళియరామరాజు తమ్ముడగు తిరుమలునికి షడ్డకుడు. తురకఫకీరుల మనువృత్తికై

యీరాజన్యుడు కొంతభూమిని ఇనాముగ నిచ్చెననుటయు తంజావూరు సామసారుమసీదులోని శాసనపువ్రాత తెలుపుచున్నది. ఈ చరిత్రాంశముల విశాల దృష్టితో తిలకించితిమేని యప్పటి చక్రవర్తులు "యథా రాజా తథాప్రజా"యను ధర్మమున ప్రజలును హిందూ మహమ్మదీయసామరస్యమును జీవితదీక్షగా ననుష్ఠించుచుండిరనుట ఊహింపనగును. మన దేశమునకు స్వారాజ్యక్రమము లభించినపుడు, ప్రకృతము క్లిష్టమై తోచుచుండు నీమతభేదసమస్యను, విజయనగరకాలమునాటి తీరున సమర్థించుకొనుట కుపాయ మిదియే యని వేరు చెప్ప నేల? అహమ్మద్ నగరమున రామరాజు అక్కడి మహమ్మదీయసంస్థల కొకానొకపుడు చేటు నాపాదించినది నిజమే యయినను, దానికి మూలము శాత్రవప్రతిష్ఠయే కాని మహమ్మదీయమతవిద్వేష మైయుండదు.



# అ యి ద వ య ధ్యా యము

---

## విశ్వనాథనాయకుడు

చ. అతనికి వార్ధి కుల్యయగు, నగ్ని జలంబగు, మేరుశైలమం
చితశిలలీల నుండు, మదసింహము జింకతెఱంగు దాల్చు, గో
పితఫణి పూలదండయగు, భీష్మవిషంబు సుధారసం బగుఁ
క్షితి జనసమ్మతంబగు సుశీలము దెవ్వనియందు శోభిలుఁ.

(భర్తృహరి ధైర్యపద్ధతి)

కృష్ణరాయల దిగ్విజయయాత్ర ఫలవంతమై చోళ, చేర, కర్ణాట రాజ్యభాగము లన్నియు సామ్రాజ్యమునకు వలయింపబడినవి కాని, ఈ రాజ్య విస్తారమునకు దగినట్లు రాజ్యాంగమును బిగించి దిట్టపరచుపని సంపూర్ణముగ ముగియకముందే యారాయడు పరమపదించుటచే నాతరుణమున నయ్యది యత్యావశ్యకమై మిగిలినభాగము. ఈ కార్యభారముల వహించి యచ్యుతుని వెనుక నిల్చి సూత్రధారియై సాధించిన యవిక్రతను డళియరామరాజనుట మరి చెప్ప నవసరముండదు. ఈ విశాలోద్యమమందీరాజన్యుని కుడిచేయియైనాయన, దక్షిణమున మధురలో

సామంతుడై నెలకొని తోడయి సంకల్పముల నెరవేర్చుచు వచ్చినవాడు విశ్వనాథనాయకుడు. ఇతడు వీరబల్లాళుని దీక్షను గురియందుంచి మహమ్మదీయవిముఖుల కడ్డమై నిల్చి శిథిలమైన యప్పటి పరార్థసంప్రదాయముల మరల నవరించుటయె కాక యానంస్థల విస్తరించి వానికి నూతన తేజోవైభవముల నాపాదించి యుద్ధరించిన సామ్రాజ్య సేవాధురంధరుడు, స్వామికార్యదీక్షాపరతుడు. ఈ మహా మహుని యుదంత మీయుచ్ఛ్వాసమందు కానరాదేని యీ చిత్రఫలకమందలి యళియరాముని యాకృతి యొంటి కంటిదైయుంట బోలునేమొ.

## అచ్యుతుని దక్షిణదిగ్విజయము

కృష్ణరాయ లంతరించునప్పటికె యరవదేశమందు నాయకుడై యేలుచుండిన సెల్లప్ప విప్లవకారియై విజయనగరముపై తిరుగబడి వర్తింపజొచ్చెను. వీనిది చోళరాజ్యము. రాజధాని తంజావూరు. ఆసమయమున వీని నెదిరించి యణచుటకై యచ్యుతసార్వభౌముని దండు వెడలి సంగరమున నోడించినది. సెల్లప్ప తిరువాన్కూరు రాజ్యమునకు పారి యారాజు శరణుజొచ్చెను. వా డది సమయమని వాని తోడుగొని తానును విజయనగరమును ధిక్కరింప నడుకట్టి పాండ్యరాజ్యముపై దాడివెడలి, తనపిత్రవ్య

మునుండి వానిని వెడలనడచుటయే కాక సామ్రాజ్యమునకు జేరియుండిన యిప్పటి తిరునల్వేలి మండలప్రాంతమంతయు నాక్రమించుకొనియె. ఈభాగము వెనుక తిరువాన్కూరు (అనంతశయనము)నకు చేరియుండెననుటయు, తాను దానిని మరల సాధించుకొనవలెననుటయు నీదుర్ణయమునకు నెపము. ఈతిరువాన్కూరు రాజుపేరు భూతల శ్రీమార్తాండవర్మ. ఈదుడుకుసంగతి అచ్యుతసార్వభౌముడెరిగి స్వయముగ నెల్లప్పై విజయధాటివెడల సమకట్టి సైన్యములకూర్చి సిద్ధమగునట్లు తన బావ సలకము తిమ్మరాజున కాజ్ఞనొసగివాడాయె. వాడట్లుచేయ నచ్యుతుడు రాజధాని బయలుదేరి మొదటదండు విడియుట చంద్రగిరియందు. అచ్యుతుడు సమీపముననున్న తిరుపతిక్షేత్రమందలి వేంకటేశుని సేవించుటకై కొండయెక్కి యచట స్వామికైంకర్యమందు కొన్నాళ్లుగడపి వెలగల రాళ్లపొదిగించిన కుండలములజత, కిరీటము మున్నగు నాభరణముల స్వామికర్పించుట యాతరుణమందే. అవి యిప్పటికిని తిరుపతికొండయందున్నవేమొ. అప్పటినుండి కాళహస్తి, కంచి, తిరువణ్ణామలై, మొదలగు పుణ్యతీర్థముల దర్శించుచు తుదకు శ్రీరంగముచేరి యచట తాను నిలిచి సేనాని సలకము తిమ్మరాజును సైన్యములతో నెల్లప్పై

పడుపబంపెను. తిమ్మరాజు తామ్రపర్ణినదియొద్ద చేరునం
తలో సెల్లప్పకు శరణమొసగిన తిరువాన్కూరురాజుమా
ర్తాండవర్మ బలయుతుడై యెదుర్కొనినపుడు తిమ్మనిసైన్య
ము లాశత్రునితాకి యోడించినవి. మార్తాండవర్మ విధే
యుడై సెల్లప్పను తిమ్మని కొప్పగించెను. అతడు పరాజితు
డైన మార్తాండవర్మను వెంటగొని విజయధ్వానములతో
ననంతశయనము వెళ్లి పద్మనాభస్వామిని సేవించి శ్రీరంగ
మునకు మరలి చెరగొని పట్టితెచ్చిన సెల్లప్పను ముందిడి
తన విజయోదంతమును నివేదింప సార్వభౌముడు సంతుష్ట
చిత్తుడై బాధితుడైన పాండ్యరాజు రాజ్యమును వాని
కిప్పించిన దేకాక వాడనంతశయనమునుసహితము తానే
పాలించునదిగ నాజ్ఞాపించినవాడాయె. పాండ్యు డిది
మహోపకారమని తలచి యచ్యుతునికి తనకొమార్తెనిచ్చి
వివాహము సల్పిన దపుడే. ఈవిజయయాత్రయందంతయు
నచ్యుతుని సైన్యమున తన శౌర్యపరాక్రమముచే తోడు
పడి యచ్యుతునికి విజయము నాపాదించిన వీరుడీవిశ్వనాథ
నాయకుడు.

### విశ్వనాథుని బాల్యము

విశ్వనాథుని తండ్రి పేరు నాగమనాయకుడు. అచ్యు
తుని దిగ్విజయయాత్రయందు కంచిలో సామంతుడై



బాబయ్య దర్గా

"ఈయనసమాధియే పెనుగొండ బాబయ్యదర్గాయందుండు పూజ్యస్థానము"

(౮౩ పుటం)



“బాబయ్యా ఉరుసుసమారాధన
యాత్రికులకు వడ్డించుట। చూచినపుడు” (౮౭ పుట.)

యేలుచుండినవాడు. విజయనగరపు వీరులలో నప్పటికే పేరుగని యుండెను. ఇతనిది కశ్యపగోత్రము. జన్మస్థానము కంచి. సంతతికై కాశీయాత్ర చేసిన పిమ్మటనే విశ్వనాథుని గనుట. సాళ్వనరసింహ సార్వభౌమునికి ఆప్తభృత్యుడని యితనికి పేరు. కొడుకు విశ్వనాథుడు శౌర్యశీలముల ప్రబవర్ధిల్లి కృష్ణరాయల యనుచరుడై పదునారవయేటనే యామహామహుని మెప్పువడసెనట. ఒకానొకపుడా రాయని వెంట మృగయావినోదమున విహరించుచున్న పుడు కారెను మొకటి తన నాథుని తరుముకొనివచ్చుట పొసగినది. అపుడావీరకిశోరము తన కరవాలముతో దానిని ఖండించి సార్వభౌముని యాపదనుండి రక్షించెనను గాథ యొకటి యున్నది. వయసువచ్చిన పిమ్మట నారాజు నాజ్ఞగొని శత్రురాజుల సేనల జయించి, పరాజితులైన వారిని చెరగొని తెచ్చి ముందిడి రాయల మెప్పువడయు చుండెను. తన విజయధాటియందు శత్రుసైన్యముల నోడించి వానినుండి పట్టితెచ్చిన ఏనుగులు, గుఱ్ఱములు, తక్కిన యుద్ధపరికరములు దొరకిన వానిని రాయల ముం దర కానుకగా నిడి యాయనను రంజింప జేయుచుండెడి వాడు. ఇతడు లోకైకవీరవర్గమం దొకడని వెంకటాద్రి కుణి, మూరున చెక్కించిన తామ్రశాసనము ప్రకటించుచున్నది.

## అ ధి కా ర ప ద వి

ఇతడు అచ్యుతుని కాలమున మధుర రాజ్యమునకు నేతయై వరలి యక్కడి నాయకవంశపరంపరకు మూలపురుషుడన ప్రభవిల్లెను. ఈవీరుడు మధుర సింహాసన మెక్కిన కథ మిక్కిలి హృద్యము. ఒకానొకపు డేకారణముననో మధుర యందలి విశ్వనాథునికి ఆధిపత్యము వదలుట పొసగి నది. ఆ తరుణమెరిగి యపుడు తంజావూరు నేలుచుండిన వీరశేఖరచోళుడు పాండ్యరాజుగ నున్న చంద్రశేఖరు నిపై దండెత్తి విజయనగరమును లెక్కింపక వాని రాజ్య ము నాక్రమించెను. ఇట్లు పరిభూతుడైన పాండ్యుడు తన కుమారుని వెంటబెట్టుకొని, రాజధానికి వెళ్లి, యచ్యుత సార్వభౌముని శరణుజెంది మొరబెట్టుకొనియె. ఆ మొరను విని యచ్యుతుడు తనయొద్ద నప్పటికి సేనానియై యుండిన నాగప్పను పిలిచి, చోళరాజుపై దండెత్తి వానిని జయించి రాజ్యము పాండ్యుని కిప్పించునదిగ నాజ్ఞాపించ నాగమ నాయడు చోళరాజు నెదుర్కొని తంజావూరు సమర మందు వానిని పరిమార్చి మధురకు వెడలి యచట వాడు నిల్పియున్న రాణువను తరుమగొట్టి రాజ్యమును వీర శేఖరపాండ్యునికి సార్వభౌముని యాజ్ఞచొప్పున నొసగెను. అప్పటికి రాజ్యమున కట్టుదిట్టములకుదిరిక చాలకయున్నం

డునను, నాపాండ్యునికి రాజ్యభారము వహించను ప్రాణ చాలకపోయినందునను తనకు రాజ్య మక్కరలేదనియు జీవనాంశము నిచ్చిన జాలుననియు విన్నవించెను. నాగమ నాయ డందుల కియ్యకొని వానిపదవికి తగినట్లు భృతి నొసగి రాజ్యభారమును తానే వహించినవాడాయె. కొంత కాలమునకే యాపాండ్యుడు తనకొసగిన భృతితో దృప్తిజెందక మరల విజయనగరమున కేగి యచ్యుతుని దర్శించి నాగమనాయనిపై కొండెములుచెప్ప నూహించెను. చోళరాజును పరిమార్చినపిదప మధురరాజ్యమును రాజాజ్ఞచొప్పున తన కొప్పచెప్పుటకు మారుగ నాగమ నాయడు తానే యాక్రమించుకొన్నాడనుటవాని ఫిర్యాదు. ఈమొరవిని యచ్యుతు డాగ్రహించి తనయాజ్ఞోలంఘ నముచేసినందుకై చీవాట్లతో నాజ్ఞాపత్రమును వ్రాసి యదేపాండ్యుని చేతికొసగి నాగమనాయనికి గొనిపోయి యిమ్మని సెలవొసగ నాపాండ్యుడు తనదేశపుదిక్కు మొగమై యేగెను. ఈనడుమ నాగమనాయడు తనస్వాధీ నమైన పాండ్యచోళరాజ్యభాగములందు చిరకాలము శిక్ష ణముతప్పి వర్తించుచువచ్చిన యుద్వృత్తుల నణచి యా ప్రదేశముల కుదురుబాటునకు తెచ్చి సవరించుచుండె. ఇంతలో పాండ్యుడు విజయనగరమునుండి తెచ్చిన యాజ్ఞా

పత్రము చేతికందిన తోడనే వాడు తనకు రాజ్యమెల్ల నని చెప్పినది మొదలు జరిగిన యుదంతమంతయు వివరించుచు నభ్యర్థి పాండ్యునియొక్క పితామహుని దాసీపుత్రు లయిదుగురు పంచపాండవులను పేరితో రాష్ట్రమంతయు వ్యాపించి దేశోపద్రవమును కలిగించుచున్న సంగతియు వారినెదిర్చి కార్యభారముల నిర్వహించుటకు పాండ్యునికి సమర్థత చాలదనియు విషమపరిస్థితుల నవరించి యాదేశ భాగమున నెమ్మది యలవడుటకై యదివరకే రాజ్యపు బొక్కసమునుండియే కాక తన స్వంతద్రవ్యమును సహితము వెచ్చపెట్టినట్లును వివరించి యచ్యుతునికి నివేదికనంపెను.

## విశ్వనాథుని రాజభక్తి

సార్వభౌముడు దానిని చదివి తనయాజ్ఞ చెల్లలేదను నాగ్రహము ద్విగుణమై పైకొన తనమంత్రులను, సేనాధిపతులను గొలువునకు రావించి, వారిలో నెవ్వరు నాగమ నాయని శిరస్సును తనముందు తెచ్చిపెట్ట నోపుదురని ప్రశ్నింప సభ్యులు మిన్నకుండిరి. విశ్వనాథుడు మొనసి "దేవరవారు సెలవొసంగుదురేని నేను సిద్ధమై యున్నా" ననెను.

"నీవు నీతండ్రితో జేరిపోవుటకా"యని సార్వభౌముడు మేలమాడినందుకు " నాభుక్తి దేవరవారిది. శ్రీవారి సేవయే నాకర్తవ్యము. దానిముందు తండ్రియన నెంత? దేవరవారి యాజ్ఞానువర్తినయి మెలగువాడనుగాని తదితరముకా"దని వినయపురస్సరముగ విన్నవించుకొనన నచ్యుతుడు మరల విశ్వనాథుని యార్జవమున కలరి వాని రాజభక్తికి మెచ్చి సెలవొసగినవాడాయె.

విశ్వనాథుని కార్యసిద్ధి

అప్పుడు తనయధీనమందున్న రెండువేలగుఱ్ఱపు రౌతులును, యారువేల పదాతులును కలసినబలముతో తండ్రిపై వెడలి చోళరాజ్యపు పరిసరముల దండువిడిసి, 'వెంటనే పాండ్యరాజును సింహాసనస్థుని చేయడేని రాజాజ్ఞ గాని తన్నునంపుటకు బలముతో యుద్ధమునకు సిద్ధముగా నున్నా'నని తండ్రికి హెచ్చరిక నంపెను. ఈ సందేశము చేరినతోడనే అతడు కొడుకును చేరి ముఖాముఖి మాటలాడినపుడు రాజశాసనమును చెల్లింప నిద్దరును సమ్మతించిరి. తోడనే విశ్వనాథుడు మధురకు ప్రయాణమై పాండ్యుని తన పెద్దలసింహాసనమం దునిచి మరల పట్టము కట్టెను. అపు డా పాండ్యుడు విశ్వనాథునితో నిట్లనెను:

"నీతండ్రి నాకై చోళరాజు నెదిర్చి యోడించి మాకు శాంతి నొడగూర్చెను. ఆయన కొడుకవు నీవు నీతండ్రినే యెదిర్చి నారాజ్యము నా కిప్పించితివి. ఇందుకు ప్రత్యుపకారము నే నేమిచేయగలను? నావంశము సమసిపోయినది. సంతానమూ లేదు. నేనంతరించితినా నారాజ్యమును చోళరా జాక్రమించును. నీవే నాకు దత్తుకొడుకవు. నాయనంతరము రాజ్యము నీయది." ఈసంకల్పము ననుసరించి పాండ్యుడు తోడనే విశ్వనాథుని మధురమీనాక్షి దేవాలయమునకు పిలుచుకొనివచ్చి, యాదేవి సన్నిధియందు పురోహితునిచే ఖడ్గకిరీటములను, రాజదండమును, ముద్రను, మీనచ్ఛత్రమును నొసగజేసెను. తదనంతరము విశ్వనాథుడు తన తండ్రిని, చంద్రశేఖర పాండ్యుని వెంటబెట్టుకొని రాజధానిచేరి వారిరువురిని సార్వభౌముని ముందిడి జరిగిన యుదంతమును విన్నవించి తండ్రి యపరాధమును క్షమింప వేడ నారాజన్యు డందుల కియ్యకొనియె. అపుడే అచ్యుతుడు విశ్వనాథుని మధురకు రాజప్రతినిధి (Viceroy)గ నియమించి పంపుట.

విశ్వనాథుని యేలుబడి

తోడనే వాడు గొప్పసైన్యముతోను, తగిన పరివారముతోను మధుర చేరి రాజ్యభారము వహించి వెనుక

శిథిలమైన కోట కొత్తళముల సవరింప సమకట్టెను. ఎని మిది ద్వారములు, డెబ్బదిరెండు బురుజులతో మధురకోట యలంకరింపబడుట యపుడే. తిరుచునాపల్లెయందు చుట్టు నగడ్త నిర్మింపబడినదియు నాకాలముననే. కోటలోపల వసతిగృహముల కట్టించుటయేకాక స్వామి తెప్పయుత్సవ ములకై ఇప్పుడుండు విశాలసరోవర మపుడు త్రవ్వబడి నదే. కావేరి యిరువైపుల వ్యాపించియుండిన యడవుల కొట్టించి రాజాంతఃపురముల నిర్మించెను. పెరచోట్లనుండి క్రొత్తగ సేద్యపు కాపుల రప్పించి పరిసరక్షేత్రములందు వ్యవసాయపరిశ్రమమును పెంపొందించుటయు నపుడే. మధురయందు మీనాక్షి సుందరేశ్వర దేవాలయముల జీర్ణోద్ధారముల గావించి విస్తరించెను. పాండ్యరాజుల నాటి పాతకోటగోడను పడగొట్టించి రెండుప్రాకారము లతో క్రొత్తగదానిని నిర్మించినవాడు విశ్వనాథుడు. ఇతనికి ప్రధానమంత్రి యరియనాథ మొదలియార్. సేనాని పేరు కేశవప్పనాయడు. పైకార్యదీక్షలయందు నిద్దరును విశ్వ నాథునికి తోడ్పడినవారు. ఈ రాజన్యుడు మధురను పాలింప మొదలిడిన కొన్ని నెలలకే వృద్ధుడైన చంద్రశేఖర పాండ్యుడంతరించుట తటస్థించినది. అచ్యుతు డాసమయ మున విశ్వనాథుని విజయనగరమునకు రప్పించి వానిని

సామ్రాజ్యపుదక్షిణభాగమునకు మధురయే ప్రధానపట్టణ ముగ, అధిపతిగ నియమించినపు డాడినమాట లివి:

"నీ వెరిగినట్లు దక్షిణరాజ్యమంతయు నీతండ్రి యధీనమున నుండెను. పాండ్యరాజవంశము సంతానము లేక క్షీణించినది. ఇక పట్టమునకు రాదగినవా డెవ్వడు లేడు. కారెనుమును తెగటార్చి దుర్గకు బలిగా నొసగి దేశోపద్రవము నరికట్టితివి. ఉత్తరదిశను సామంత రాజులు కప్పములు చెల్లించక ధిక్కరించినవారిని జయించి వారి దేశముల సామ్రాజ్యమునకు గడించిపెట్టితివి. నీతండ్రి రాజాజ్ఞ నుల్లఘించి వర్తించినపుడు తండ్రియని లెక్కగొనక వానిని దెచ్చి మాయెదుట నిలబెట్టి తండ్రి కన్న రాజశాసన మధికమని తలచితివి. మాసింహాసనము వంటిసింహాసనము నీకొసగినపుడు దానికి తోడుగ గాల్క్రమమున రాజ్య మొకదానిని నిత్తుమని చెప్పియుంటిమి. పాండ్యరాజు సంతతిలేక నిన్ను దత్తపుత్రునిగ జేసికొని యధికారముద్రలను నీచేతికొసగి చనినందున నా రాజ్యమంతయు నీయదియె. ఇది మొదలు మధుర రాజ్యమునకు నేతవై యేలుము."

ఇది జరుగుట ౧౫౪౩ వ సంవత్సరమున. "మహారాజ మన్నె రాజశ్రీ విశ్వనాథుని అయ్యలుగారు" అనుట అది



బీబీనాంచారు దేవాలయము-ఒరయూరు (౫౮ పుట)



అశోక్ మంత్రము-శ్రీరంగ శిలాలయము

"ఈ అశోక్ మంత్రమును శ్రీరంగమువంటి పవిత్రక్షేత్రమున బహిరంగస్థలమం దమర్చి దానికి పూజలవిధించిన సాహసకీర్తి ఈ విశ్వనాథునిదై యుండవలెను" (౪౯ పుట.)

యాదిగ నారాజన్యుని బిరుదావళి. ఈరాయనిరాణి పేరు నాగమ. ఉత్తరమున ఉరత్తూరు, బలికొండాపురము అను నూర్లును, దక్షిణమున కన్యాకుమారి అగ్రమును, పడమట కోయంబత్తూరు, చిత్తూరు, ఈరోడు, ధారాపురములును, తూర్పున రామేశ్వర సేతువులే యానాయకు డేలిన స్రామ్రాజ్యపు పొలిమేరలు. ఈరాజు ఏటేట సామ్రాజ్యమునకు చెల్లించుచువచ్చిన కప్పము ముప్పదిమొదలు నలువదిలక్షల రూప్యములు. రాజ్యభారమును వహించిన పిమ్మట దేశమునంతయు డెబ్బదిరెండు పాళెములుగ భాగించుట విశ్వనాథుడు తలపెట్టిన కార్యములలో మొదటిది. పూర్వము తనవిజయధాటులందు భక్తితో దన్ను గొల్చుచువచ్చిన యనుచరవర్గమున కీపాళెపు టధికార పదవులు పారితోషికములై యొసగబడెను. పాళెమనగ రాణువభాగము. దీని కధినాథుడైనవాడే పాళెగాడన బడుట. విశ్వనాథుడు తనరాజ్యమునంతయు డెబ్బదిరెండు భాగములుగ విభజించి యొక్కొక్కదాని నొక్కొక్క పాళెగాని వశమం దునిచి ఆయాపాళెముల పరిపాలనము వాని కొప్పగించుటయు, మధురరాజధానియొక్క కోట లోని డెబ్బదిరెండు బురుజులలో నొక్కొక్క డొక్కొక్క దాని రక్షణ కుత్తరవాదిగనుండవలె ననుటయు నీవిధానపు

క్రమము. ఒక్కొక్క పాళెముయొక్క విస్తీర్ణము, గ్రామములసంఖ్య పొలిమేరలతో నిర్ణయింపబడినవి. రాజధానిని శత్రువర్గము తాకుట సంభవించి నపుడొక్కొక్క పాళెగాడును తనసైన్యశకలముతో తనపాలికి వచ్చిన బురుజునొద్ద కేతెంచి కాపాడవలయుట వాని కర్తవ్యము. ఒక్కొక్కడును నేటేట రాజునకు కప్పమును చెల్లించుట మరియొకటి. ఈపాళెములకు తెలుగువారు, అరవవారు కూడ నియమింపబడిరి. రెండుభాషలవారి ప్రభేదముల నంతరింపజేసి వారియందు సామరస్యమును నెలకొల్పవలెననుట ఈవిన్యాసమునకు గురి. దక్షిణాపథమున నీప్రయత్నముమూలమున జాతీయతను నెలకొల్పవలెననుట యప్పటికే సామ్రాజ్యాధికారుల యాదర్శమై వారు దానిని సాధింప మొనయించుచుండి రనుట కిది తార్కాణ మెందుకు కాదు?

### విశ్వనాథుని ధీరోదాత్తత

ఇంతటి యుదారయత్నములు ఫలాభివ్యాప్తియం దధినాయకులలో నీర్ష్యాసూయల కాకరమగుట విషాదకరము. చిన్నపాండ్యరాజులకు సామంతులై వెలసిన వారిలో రాజన్యు లయిదుగురు తెలుగువాడగు విశ్వనాథుని క్రొత్తయాధిపత్యమునకు మనసొగ్గక యొకటియై కప్పములు

చెల్లించక తిరుగబడి మానవుడగువాఁ డెవడేని తమస్వా తంత్ర్యమును జెనకనీయమనుట వారిశపథము. వీరిపుట్టు పూర్వోత్తరముల శోధించిచూడ చన్న పాండ్యవంశము నకు జ్ఞాతివర్గమువారై కాన్పించినది. తిరునెల్వేలి కుల శేఖర పెరుమాళ్ ఈ యయిదుగురి యందు మేటి. పరా క్రమపాండ్యదేవయనియు, కులశేఖరదేవయనియు నితనికి నామాంతరములు. ౧౫౪౩-వ సంవత్సరమున విధ్యు క్తముగ తెఙ్కాసి (దక్షిణకాశి) యను పురమున పట్టాభి షిక్తుడయినవాఁడు. లోకైకవీరుడనియు, చంద్రకులతిలకు డనియు, త్రిభువనాధిపతియనియు మరి మూఁడేండ్లకే చెక్కబడిన సింగోట్టైయను నూరి శాసనమందు వీని బిరుదావళి ప్రకటింపబడియున్నది. వీరైదుగురును చేరి విశ్వనాథుని యాధిపత్యమునకు విముఖులై విప్లవమునకు దొడరుట ౧౫౪౭-వ సంవత్సరమున. వీరిని పరాజితుల జేయను విశ్వనాథునివంటి వీరాగ్రణికి ఆరు సంవత్సర ములు పట్టెను. ఈ సన్నాహకథ పర్యవసానమందు ఉభయపక్షముల ధీరోదాత్తతను వెలయించునట్టిది.

ఈ యైదుగురిని వంచి దేశమునకు శాంతి నాపాదించ వలెననుట విశ్వనాథుని సంకల్పము. దీనిని నెరవేర్ప తన మంత్రియగు నరియనాథ మొదలియారును తగిన బలము

లతో నావిప్లవకారుల నెదుర్కొన బంపెను. అపుడు వారు నెలకొనియున్న కోటపట్టణమునకు కయటత్తూరని పేరు. ఈ రాజన్యపంచకము కోటదాపుననుండి శత్రుసైన్యమును ఘోరముగ ప్రతిఘటించి యోడించెను. అరియనాథుడు తన పాళెగాండ్రచే పరాభవింపబడి వెన్నుచూపి మధురకు మిగిలిన బలముతో మరలవలసి వచ్చెను. అది కని విశ్వనాథుడే స్వయముగ నా సైన్యములతో వారి నెదుర్కొన మొనసి యారునెలల కాలము పోరాడినను నా వీరపంచక మోటువడక నిల్చెను. ఇరువైపుల హతు లగుచున్నవారి సంఖ్య నానాటికి హెచ్చి వారి కుటుంబముల యార్తస్వరము విశ్వనాథుని చెవిసోక తనయొక్కని యభ్యుదయమే గురిగ నంతమంది యోధులు తెగుటయు, నామూలమున వారి కుటుంబ వర్గమంతయు తీవ్రదుఃఖముల పాలగుటయు, పరికించి మిక్కిలి విషణ్ణహృదయుడై యా వీరవరుల కొక్కజాబును వ్రాసి చారులతో పుత్తెంచెను. ఇది యా జాబు:

“ మీ రయిదుగురు; నే నొకడను. మనయుభయుల పోరాటము కారణముగ నిట్టి విషాదములు కల్గుట. ఇది యిట్లు గాదగదు. ఉభయులము నీసమరము నాగి యిరుసేనల నడుమ నొక రాతికంబమును నాటుదము.

ఒడంబడిక నొకదానిని వ్రాసి దానిపై నుంతము. ఆపిమ్మట మీరు నన్నెదుర్కొని పోరాడునది. నేను మిమ్ముల గెల్చితినా, మీరు కట్టుబట్టలతో మీరాజ్యములనువీడి వెళ్ళునది, మీరు నన్ను గెల్చితిరా, నేను నట్లే నారాజ్యమును సర్వస్వమును మీకు వదలువాడను. ఇట్లుభయులును ప్రమాణము చేసికొందము. ఈయొడంబడిక తామ్రశాసనమున జెక్కించి యుభయసేనల నడుమ పాతించు స్తంభముపై నిడి దానియండ పోరాడి తీర్మానించుకొందము."

ఆరాజపంచకము దీనికిచ్చిన ప్రత్యుత్తర మిది: "మే మైదుగురము. ని న్నొక్కనిని తాకుట న్యాయము కానిది. మాలో నొక రెవ్వరైన వచ్చెదము. నీవు వచ్చి యెదుర్కొందువా?"

ఈ యౌదార్యము తన ధీరోదాత్తతను మించబోవుట యొల్లనివాడై విశ్వనాథవీరాగ్రణి యీతీరున బదులు వ్రాసిపంపెను:

"మీ రైదుగురును అయిదు వేర్వేరు ప్రాంతములకు నాథులై యున్నారు. నే నొకడనే మిమ్ము నయిదుగురిని నోడింప తొడరితిని. ఆకారణమున మీ రైదుగురును న న్నొక్కని మార్కొనుట తగవే."

ఇందు కారాజపంచకము సమ్మతించక తమలో యోధుడైనవాని నాయత్తపరచిరి. వాడు యుద్ధకవచము నరించి, ఖడ్గము చేతబూని, యుత్తమాశ్వ మొకదాని నారోహించి పై పేర్కొన్న రణరంగమునకు తోడ్కొని రాబడెను. విశ్వనాథుడును తరలి వచ్చియుండి ప్రతివీరుని తిలకించి "ముందు నీవు తాకుము" అనెను. తన ఖడ్గమును పాండ్యుడు విశ్వనాథునిపై విసరినతోడనే తన కర వాలము నడ్డుపెట్టి తప్పించుకొనియె.

"ఇక నీవు తాకు" మని పాండ్యుడు విశ్వనాథుని హెచ్చరింప నా వీరు డందు కియ్యకొనమికి మున్మారు పాండ్యుడే విశ్వనాథుని తాకియు, గురితప్పి నిల్చెను. ఆ పిమ్మట విశ్వనాథుడు పాండ్యవీరునికి హెచ్చరిక చెప్పి మొనసి తన కరవాలముతో వేయ నాపాండ్యుని శరీరము రెండు తునియలై నేలబడెను. వెంటనే మిగిలిన నలుగు రును తమరాజ్యమును వదలుకొని దేశభ్రిమ్మరులై వెడలి పోయిరి.

ఈసమయమున విశ్వనాథుని జయము తెలుగువారిపై యరవలకు నుద్వేగజనక మగుట గని యా విషమ పరిస్థితిని సమయింప సమకట్టి, మధురనాయకుడు దేశ

భ్రష్టులై వెడలినవారిలో పరాక్రమదేవుని సహోదరుడగు తిరునల్వేలికులశేఖర పెరుమాళునకు అదే తెన్ కాశి యందు పట్టముకట్టి పాండ్యరాజ్యమును వాని కొప్పజెప్పి తనకు సామంతుడై యేలునట్లు నియమించెను. ఇది జరుగుట ౧౫౩౩ వ సంవత్సరమున. మరి పదునొకండేడులకు వీని యనుజుడు పట్టమునకువచ్చినది మొదలు తెన్ కాశి ప్రాంతములకు పాండ్యవంశీయులే యధినాథులై పరగుచువచ్చిరి. తండ్రికొడుకులు క్రమముగ 'వీరవేల్' 'శివలవేల్' అను సామంతబిరుదముల బడసి విజయనగరమున కనువర్తులై క్షాత్రపద్ధతుల చాలించుకొని, వాఙ్మయకావ్యరచనల రమించుచు కాలము గడుపుకొనుచువచ్చిరి.

అరియనాథ మొదలియారు

ఈతీరున నేలుబడిరీతుల సవరించి కుదుర్చుటయందును, నపుడపు డుద్వృత్తులై తన యాధిపత్యమునకు ధిక్కరింప మొనయువారిని వశవర్తులుగ జేసికొనుటయందును ప్రయాసలకోర్చి సాధించిన కార్యదక్షుడు విశ్వనాథుడు. అరియనాథ మొదలియారు ఈ నాయకునికి మంత్రిపుంగవుడై యీ కార్యదీక్షలయందు కుడిభుజమోయన మెలగి మన్ననలందినవాడు. విశ్వనాథునికి ఈ సచివాగ్రణియందు నెలకొన్న చనువులోతును వెలిబుచ్చు దానశాసన మొకటి

కానవచ్చుచున్నది. పండ్రెండు గ్రామముల నేదో ధర్మ సంస్థకు వృత్తిగ నొసగుట యిందలి విషయము. దానకర్త తా నొకడేయయ్యు నరియనాథుని తన పేరుతో జేర్చి యుండుట రాజు వానియందు పెంచిన చెలిమిని ప్రకటించు నట్టిది. దీనికాలము ౧౫౬౦-వ సంవత్సరము. కాంచీ పురమండల మీా మొదలియారు జన్మస్థానము. ఈయన ధీకౌశలమును, దిట్టతనమును మొదట కనుగొన్నవాడు విశ్వనాథుని తండ్రి నాగమనాయడు. ఈనాయడే యరియ నాథుని వెంటబెట్టుకొని విజయనగరమునకు వెళ్ళి యచ్యుత సార్వభౌముని దర్శనమును వానికి సమకూర్చినవాడు. చక్రవర్తి యాజ్ఞను తలమోచి తండ్రి నాగమనాయనిపై విశ్వనాథుడు దండువెడలినపుడు మొదలియారు పరివా రములో నగ్రగణ్యుడై వర్తించిన రాజసేవాధురంధరుడు. అళియరామరాజుకార్యసిద్ధికి విశ్వనాథు డెట్లో విశ్వ నాథునికి నరియనాథు డట్టివాడన్న సత్యమునకు దూరము కాదు.

విఠ్ఠలుడు

విశ్వనాథుడు తనరాష్ట్రమును పైతీరున సవరించి దిట్ట పరచుచున్నట్టే ౧౫౪౧-వ సంవత్సరమున నచ్యుతరాయ డంతరించుటయు, నది సమయమని తిరువాన్కూరు రాజు

మరల కప్పము చెల్లింపక సామ్రాజ్యమునకు తిరుగబడు టయు, పశ్చిమసముద్రతీరమున పోర్చుగీసువారు వికటించి వర్తించుటయు పొసగినది. రామరాజీ విషమపరిస్థితుల పరికించినవాడై యీ కార్యభారమంతయు విశ్వనాథునిపై బడవలయుటగని, విఠ్ఠలు డను మరియొకవీరుని నాప్రాంత ముల కుప-అధినాథునిగ బంపెను. వీడు అళియరామ రాజు జ్ఞాతివర్గములోనివాడై యాతరుణమున పెనుగొండ యం దధికారమును వహించినవాడు. వీడిట్లు సేనానిపదవి నధిష్ఠించి దక్షిణదిగ్విజయమునకు వెడలుట ౧౫౪౩-వ సంవత్సరమున. మొదట దండెత్తుట తిరువాన్కూరుపై. ఈవిజయధాటియందు విఠ్ఠలునితో పాల్గొన్నవాడు వాని తమ్ముడు చిన్నతిమ్మ, విశ్వనాథుడును, వాని కొడుకు కృష్ణ ప్పయునే. తమసైన్యములతో ౧౫౪౩-వ సంవత్సరమున శ్రావణమందు యుద్ధసన్నద్ధులై తిరువాన్కూరు దిక్కున కేగినపు డచట రాజుగ నున్నవాడు ఉన్ని కేరళవర్మ. వీనికి భూతల శ్రీవీర కేరళవర్మయనియు నామాంతరము. పైబడివచ్చుచున్న విశాలబలములగని వానిధాటికి వెరచి యాపరిసరముల నున్న పల్లెటూళ్ల జనులు దిక్కు దిక్కుల పరచుటకు మొదలిడిరి. కేరళవర్మ తన బలము శత్రుసైన్యముల మార్గాన జాలకుండుట యూహించి,

పోర్చుగీసు దేశస్థుడును, క్రైస్తవయోగియు నగు సెంట్ గ్జేవియరు (St. Xavier) ను తన యొద్దకు రప్పించుకొని తన విపత్తును విన్నవించి సహాయమును వేడినట్టును, నందుకు వల్లెయని యా మహామహు డెదిరించి వచ్చుచున్న బలము నెదుట-భారతమున యక్షప్రశ్నల కథయందు యుధిష్ఠిరునికి తాటిచెట్టు పొడవుతో కానవచ్చిన యక్షునివలె— తా నడ్డమై నిల్వ నాశత్రుసైన్యములు ముందు సాగిరాలేక స్తబ్ధములై కట్టుబడి మరలెనట. ఆమీఁద కేరళవర్మ యా క్రైస్తవసాధువు నాలింగనము చేసికొని తన కృతజ్ఞతను తెల్పి, దేశమెల్లెడల నాతని గొప్పతండ్రిగ భావించవలెనని ప్రకటించినట్టు గాథ యొకటి నేటికిని ఈ ప్రాంతముల వినవచ్చుచున్నది. ఇ దెంతవరకు సత్యమో నిర్ణయింపరానిది. అయినను తిరువాన్కూరు రాజ్యభాగమున రోమన్ క్యాథలిక్ (Roman Catholic) శాఖకు చేరిన క్రైస్తవుల సంఖ్యయు, వారి దేవాలయములును, నారాజ్యమున నేటికిని ఆమతసన్న్యాసుల కలవడు పూజ్యతయు, వారి మతమున కాప్రాంతమున గల వ్యాప్తియు పరికించి చూడ వానికి పై నుదహరించిన గాథవంటి కారణ మేదైన నుండునా యను ననుమానమున కెడము కల్గుచున్నది.

విఠ్ఠలుని దిగ్విజయయాత్ర యింతటితో విరమించ లేదు. వాని బలములు తుదకు తిరువాన్కూరు ప్రాంతముల జొరబడి, పశ్చిమతీరమున పోర్చుగీసువారి యాధీనమున నుండు ప్రాంతముల నాక్రమింప తొడరినది. అపుడు కేరళవర్మ వానితో సంధియత్నములు గావింప సమకట్టి యదే సెంట్ గ్జేవియర్ సాహాయ్యముతో రాయబారముల నడపెను. అంతలో ఉన్ని కేరళవర్మ గతించి వాని యారసుడు రామవర్మ పట్టమునకు రా సంభవించినది. ఈసంధి సమకూరుట ౧౫౪౭-వ సంవత్సరమున, తిరునల్వేలియందు. అప్పటి కామూరు తిరువాన్కూరు పాలనయం దుండెడిది. దానిని సామ్రాజ్యమునకు కానుకగ నొసగుట యప్పటి సంధిసమయములలో నొకటి. అదిమొదలు తిరువాన్కూరు విజయనగరమునకు నేటేట కప్పములు చెల్లించుచుండవలె ననుట రెండవది. విఠ్ఠలుని జన్మనక్షత్రమగు రోహిణీ పర్వకాలమున పుణ్యక్షేత్రమగు సుచీంద్రములో విష్ణుదేవాలయమున వానిపేర నర్చనల జరుపవలెననుట మూడవది. ఈ సంగతి యచటి తామ్రశాసన మొకటి వెలయించును. రామరాజు విశ్వనాథునికి తిరుమణిదేశమును, అమరనాయకమణియు పారితోషికముగ నొసగి మన్నించుట యీసంధిసమయమందే. ఇదే విజయధాటియందు పశ్చిమ

సముద్రమందు నెలకొనియున్న పోర్చుగీసువారును నేదో యొకవిధముగ విజయనగరమున కల్పమగు కానుకల చెల్లింప సమ్మతించి యామూలమున సార్వభౌమత నంగీక రించినట్లు తెలియవచ్చుచున్నది.

మరల పది సంవత్సరములకు రామవర్మకు క్రైస్తవ సన్న్యాసులే తోడయినట్లును, వారి పూజాప్రార్థనలచే మాత్రమే విఠ్ఠలుఁడు పరాజితు డైనట్లును గాథ మరియొకటి వినబడుచున్నది. కాని యిది యెంతవరకు సత్యమో నిర్ణ యించరాదు. కాని దక్షిణప్రాంతములందు ౧౫౫౭-వ సం వత్సరమునకు పిమ్మట విఠ్ఠలుని యాధిపత్యము చెల్లుచు వచ్చినట్లు గుర్తులు కానరావు. ౧౫౮౮-వ సంవత్సరమున విశ్వనాథుడును, వాని యనంతరము కొడుకు కృష్ణప్పనా యడును సింహళద్వీపమును చొచ్చి సామ్రాజ్యపు పొలి మేరల నావరకు విస్తరించినట్లును గుర్తులున్నవి.

గుణావర్ణము

విశ్వనాథుడు జీవించియుండగనే ౧౫౬౪-వ సంవత్సర ము జనవరి ౨౫ వ తేది కుమారుడు కృష్ణప్పకు పట్టముకట్టి పిమ్మట కొంతకాలమునకే స్వర్గస్థుడయ్యెను. ఈ రాజ న్యుడు మధురయే రాజధానిగ దక్షిణప్రాంతముల కొడ

యడైయేలిన సుమారు ముప్పదిసంవత్సరముల కాలము కావించిన కార్యసిద్ధి రామరాజు ప్రథమసంకల్పమును - సామ్రాజ్యాధికారమును కేంద్రీకరించుట-ఈడేర్పుటకు తరచుగ తోడైనదనుట పైచరిత్రాంశములు తేటపరచును.

విశ్వనాధుడు రాజ్యతంత్రవేత్త. రాజ్యాంగనిర్మాణము దారాజు తలపెట్టి సాధించిన పాళెగాంద్రపద్ధతి యాకాలపు టాదర్శముల యవధికి మించి ఫలవంతమై వెలసెను. ఏలుబడియందు విషమపరిస్థితులు పొడగట్టినపుడెల్ల వానినపుడపుడే యంతరింపజేసి సామరస్యమును నెలకొల్పు కౌశలమందు దక్షుడు. తిరుచునాపల్లె, మధుర, తిరునల్వేలి మండల ప్రాంతముల ప్రవహించు జీవనదుల నూతగగొని, వ్యవసాయజలాధారముల విస్తరింపజేసి కృషిజీవిక నుద్ధరించిన మహోపకారి. ఈరాజన్యుని కాలములో ప్రజావృద్ధి హెచ్చుచు వచ్చెను. అనేకములగు క్రొత్తగ్రామముల నిర్మించినవాడు. విజయనగరమునుండి దుర్గాదేవి విగ్రహమును మధురకు కొనివచ్చి ప్రతిష్ఠించి యాదేవాలయమును విస్తరించెను. ఇప్పటి శ్రీరంగక్షేత్రములోని రంగనాథస్వామి దేవాలయమును విస్తరించి యభివృద్ధి చేసిన కీర్తి విశ్వనాథునిది. స్వర్ణపూజా పాత్రములు, లక్షల

కొలది వెలచేయు నాభరణములు దేవునికిసమర్పించినవాడు. ఇట్లే మధురలోని సుందరేశ్వర దేవాలయమునకు దానము లెన్నియో చేసెను. తన రాజ్యమందాయా చోట్ల క్రొత్తగ కట్టించిన దేవాలయములు, మండపములు ననేకములు. బ్రాహ్మణుల కగ్రహారములు నిర్మించి యొసగెను. పరమతసహన మీరాజన్యుని సొమ్ము. తాను జీవించి యున్నంతకాలము విజయనగరము ననుసరించి వర్తించిన సామ్రాజ్య సేవాధురంధరుడు. రామరాయునియందు భక్తియు నెయ్యమును తరుగక పెంచిన వినయగుణ సాంద్రుడు.



# ఆరవ యధ్యాయము

## సలకము తిమ్మరాజు

క. విను దుర్వినయాత్మకుఁ డగు
జనుఁ డుజ్జ్వలమైన సిరియు సద్విద్యయుఁ గ
ల్గిన నందు మెలఁగనేరక
చెనఁటి తెఱంగునకుఁ జొచ్చి చెడిపోవుఁ దుదిన్.
—భారతము, అర. షష్ఠాశ్వాసము. ౧౯.

### తిమ్మని చెల్లుబడి

అచ్యుతసార్వభౌముడు ౧౫౪౧-వ సంవత్సరమున పరమపదించినపిమ్మట రాజాంతఃపురమున చిక్కులు ప్రబలజొచ్చెను. పట్టమునకు రాదగిన యారసుడు వేంకటాద్రి యుండెను. కాని యతడు బాలుడు. బయటి పరిస్థితుల నవరింప జూచుటయె గురిగా మెలగుచున్న రామరాజునకు నంతఃపురమున ప్రోగగుచున్న విషమపరిస్థితులు మనసునకు రావాయెనేమొ. సలకము తిమ్మరాజు కోశాధిపతి. వీడు అచ్యుతసార్వభౌముని తోడబుట్టువును పెండ్లాడెను. ఈ రెండు కారణములచే నచ్యుతునికాలమున నె

వీనికి లోపలను బయటను చెల్లుబడియు, నధికారశక్తియు బలియుచువచ్చినవి. ఇంతకు నప్పటికి సింహాసనము నెక్కనున్న వేంకటాద్రి సొంతమేనల్లు డగుట తనప్రతిష్ఠకు మరింత ప్రోది నొసగెను. ఈ బలసంపత్తితో నలకము తిమ్మడు కొంతవరకైనను శమదమాదుల నలవరచియున్న నంతఃపురమున పరిస్థితులు విషమములై పరిణమించి యుండవు. అట్లుకాక వీనికి చిరుపిచ్చి యొకటి యని యింతకు ముందే సూచింపబడినది. రామరాజునకైనను తనయుదారకార్యదీక్షయం దంతఃపురమున నిట్టివ్యక్తిపై కన్నుంచి యుండవలె ననుట తోచదాయెగాబోలు. అట్లొకవేళ తోచి మొనసినను నపుడే భర్తను పోగొట్టుకొన్న యచ్యుతుని వితంతుసతిమనస్సు నొచ్చునేమో యనుసంకోచభయములు సహితము రామరాజును వెనుదీయ జేసియుండనోపు. ఇట్టి వాతావరణమం దశిక్షితుడైన నలకముతిమ్మనియెదలో పిల్లపాము పడగనెత్తనేర్చినట్లు రాజ్యకాంక్ష తలచూపెనన్న నిందాశ్చర్యమేమి? సామ్రాజ్యాధికారమంతయు నిరంకుశముగ చెల్లింపను వీని కవకాశముగల్గుట యనర్థములకు మూలమయ్యెను. రాజ్యకాంక్ష ముదిరి యధికారపు రుచి మరిగినవా డాయెను. బొక్కసపు ధనము నిచ్చవచ్చినట్లు

వెచ్చింపసాగెను. మంత్రివర్గమును, ననుచరులును తిమ్మని కెదురాడిన నేమి ప్రమాదమో యని భయపడ జొచ్చిరి. రాణివాసమున కృష్ణరాయని సతులు వెక్కసమంది యోర్వలేక భావి సార్వభౌముడగు వేంకటాద్రిని తిమ్మని బారినుండి తప్పించి సామ్రాజ్యపు కీర్తి ప్రతిష్ఠల మిగిలించు కొనుటకు లోలోపల నుపాయముల నూహింపసాగిరి. తల్లి వరదాంబికయె బిజాపురపు అదిల్షాకు రాయబారిచేత తనకొడుకును సింహాసన మెక్కించి నిల్పుపట్ల నమిత మైన ద్రవ్యము నిత్తునని సందేశము నంపెను. వాడు విజ యనగరము చేరునంతలో సలకము తిమ్మనిచారు లెదు ర్కొని ఎక్కుడు లంచమిచ్చి లోబరచు కొన్నందున వాడు బిజాపురమున కట్లే మరలినవాడాయెను.

## వేంకటాద్రి పట్టాభిషేకము

వేంకటాద్రి పట్టాభిషేకశుభముహూర్త మాసన్న మాయెను. వానికి పట్టము కట్టిరో, లేదో, కృష్ణరాయల సతులు చిన్నాదేవియు, తిరుమలదేవియు నాతరుణమున సలకము తిమ్మని నిరంకుశత్వమున కడ్డుపెట్టి తమ యల్లు డగు నళియరామరాజును, నతని తమ్ముడగు తిరుమల రాయడును వేంకటునికి మంత్రులుగ నుండి రాజ్య భారము నిర్వహించవలె నని బాహాటముగ పట్టు

బట్టిరి. ఈవిప్లవము తిమ్మరాజు సహింపలేడాయె. ఈ విషమస్థితిచే నంతఃపురమున నిరుకతము లయ్యెను. తిమ్మని ప్రతికక్షికి నాయకులగు రామరాజును, తిరుమలరాజును వానియనుచరులను ఉన్నవారి నున్నట్టు చెరగొనుటకై యీదుశ్శీలుడు పన్నుగడల జేయదొడగె. ఈ సన్న యెరిగి వారు తప్పించుకొని గుత్తి, పెనుగొండల దాపున తలదాచికొన నడచిరి. అనుచరులలో కొందరు వేర్వేరు ప్రదేశములకు వెళ్లి స్వతంత్రించి వర్తింపజొచ్చిరి. ఈవర్గమునకు సామ్రాజ్యమును విప్లవమునకు దేవలెననుట కాదు; వేంకటాద్రిని పదభ్రష్టుని జేయవలెననుటయు కాదు; సలకముతిమ్మని యుపద్రవమును నిరోధించవలెననుటయే వారి గురి.

---

# ఏడవ యధ్యాయము

## వేంకటాద్రి (Venkata I)

సీ. తనయొప్పెదురఁ గన్నఁ దగిలి యెవ్వరి కైన
మలఁగి క్రమ్మఱఁ జూడవలయువాఁడు,
దన వర్తనము విన్న మునిజనంబులకైన
నలవరించికొనంగ వలయువాఁడు,
దన బంటుతన మాజిఁ గనిన మార్తురకైనఁ
బలుమాఱు నగ్గింపవలయువాఁడు,
దన వితరణకేళి వినినఁ గల్పకతరు
వులకైనఁ దల యూఁపవలయువాఁడు,

*    *    *    *

—భారతము, విరాటపర్వము ద్వి ౨౦౮.

### వేంకటుని దిట్టతనము

వేంకటాద్రి పట్టమునకువచ్చినపుడు వాని వయస్సెంతయో నిర్ణయించుట కాధారములు చాలవు. విద్యానికేతమనియు, లోకావనచతురుడనియు, రూపమునపుష్పబాణుడనియు నర్థమిచ్చు పొగడికలు సదాశివుని కాలమునాటి కృష్ణాపురపు శాసనములందు కానవ

చ్చుచున్నవి. పరాక్రమవంతు డనుటకును సూచనలు లేకపోలేదు. తండ్రి యచ్యుతుడు సింహాసన మెక్కినపుడే వాని శీలసంపదయు, కార్యదక్షతయు చూచి మెచ్చి యౌవరాజ్యపట్టాభిషిక్తునిగ జేసినట్లు వరదాంబికాపరిణయమున కననగును. ఈ గ్రంథమును రచించిన విదుషీమణిపేరు తిరుమలాంబ. అచ్యుతుడు దక్షిణదిగ్విజయయాత్ర చేసిన మూడు సంవత్సరములకు సకుటుంబముగ కాంచీపురమునకు విజయముచేసినప్పుడు ఆతనిని, ఆతని రాణిని, వేంకటాద్రిని రక్షింప శ్రీవేంకటేశ్వరుని ప్రార్థించుటయే యీకృతికి చరమపద్యము. అచ్యుతుని రాణిపేరు వరదాంబిక. ఆమె వివాహచరిత్ర మిందు వర్ణించియుండుటచే నీ కృతికి వరదాంబికాపరిణయ మని పేరిడి అచ్యుతరాయల కంకితమొనర్చిన ట్లూహింప దగినది.

### పెనుకొండ బాబయ్య యినాము

పెనుగొండ బాబా ఫక్రుద్దీన్ సమాధి-ఉత్సవ కైంకర్యమునకు తొమ్మిదిగ్రామముల ఇనాముగ నొసగినవారు విజయనగరప్రభువు లని యింతకుముందు చెప్పబడి యున్నది. ఈ దానకర్త సాళ్వ నృసింహ సార్వభౌముడు. ఆనాటిశాసనము నష్టమయినందున సదా

శివుడును నావెనుక అచ్యుతునికొడుకు శ్రీవేంకటాద్రియు నాదానమును స్థిరపరచినట్లు తెలియుచున్నది. దీనికి సంబంధించిన ఇనాముతీ రిజస్టరు ప్రతియొకటి అనంతపురపు కలెక్టరు కచేరియందు చూడనగును. దీని పదునొకండవ కలము దానకర్త పేరును, దానకాలమును గుర్తించు శీర్షిక కలది. ఆకలమున 'వీరవేంకట మహాదేవ లయ్య వారు A. D. 1538' అని వ్రాయబడియుండుట కననగును. అచ్యుతుడు మృతినొందినది ౧౫౪౧-వ సంవత్సరమున. అటుపిమ్మట కొంతకాలమునకే వేంకటాద్రి పట్టాభిషిక్తుడగుట. ఆధునిక చరిత్రకారులు ఈరాజన్యునికి ప్రథమవేంకటుడని (Venkata I) సంకేతనామము నిచ్చియున్నారు. ఈయాధారముల సమగ్రదృష్టితో తిలకించినపుడు పైయినామును స్థిరపరచిన వేంకటదేవుడును, అచ్యుతుని కొడుకు వేంకటాద్రిసార్వభౌముడును నొకడేయనుట స్ఫురించును. ఇది యటుండ ఇనాము గ్రామములిప్పటి పెనుగొండకు సమీపమున నుండునవి. పెనుగొండ యువరాజునకు రాజధానియై చిరకాలము ఖ్యాతి గాంచియుండె ననుట జ్ఞాపక ముంచుకోదగినది. అచ్యుతుడు మృతుడగుట ౧౫౪౧-వ సంవత్సరమంటిని. దానకాలము ౧౫౩౮-వ సంవత్సరము. అనగా దానకాలమున నచ్యు

తుడు సజీవుడైయుండుటయు, దానకర్తయగు వేంకటు డిదివరకే యువరాజుగ పరిగణింప బడుటయు గమనించితి మేని, వేంకటాద్రి దానకాలమున యువరాజై పెనుగొండ యం దాధిపత్యము వహించియుండె ననుట సత్యమునకు దూరమైన యూహ కాదేమొ. వేంకటాద్రి సామ్రాజ్య దండమునే చేతబూని చక్రవర్తియై యేలినట్లు కడచిన సంవత్సరము రెండు శాసనములు దక్షిణ కన్నడపుజిల్లా ఉడిపి తాలూకు హందాడి యను గ్రామమున గాన నయ్యెను. ఈ చరిత్రాంశముల సమష్టిగ నాలోచించి నపుడు పట్టాభిషేకకాలమున వేంకటాద్రి యుక్తవయ స్కుడును వితరణశీలుడును ప్రజారంజకుడును నై విలసిల్లుచుండె ననవలసి యున్నది.



# ఎనిమిఁదవ యధ్యాయము

## సలకము తిమ్మనిచావు

*　　　*　　　*　　　*

వృథా న్యార్థభం, గముగావించెడువార
లెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్

—భర్తృహరి.

### వేంకటునిహత్య

వేంకటాద్రి సింహాసనమెక్కినపిదప దినదినము దిట్టతనమునందును, సౌజన్యమునందును పెంపొందుచువచ్చుట సలకముతిమ్మని రాజ్యాకాంక్షాసిద్ధికి హృదయకంటకమై పొల్చియుండనగును. పట్టమునకు వచ్చి యారునెల లయ్యెనో లేదో, పాపము! వేంకటాద్రి యున్నవా డున్నట్లు లేరోగములేకయే మృతుడగుట సంభవించినది. తిమ్మడే వేంకటాద్రిని గొంతుపిసికి చంపించె నను ఘోరవార్త సామ్రాజ్యమం దెల్లెడఁ వ్యాపించెను. ఆకాలమున సమక్షమునుండి పరిస్థితుల గమనించుచువచ్చిన కొరియ (Corea) యను పోర్చుగీసు దేశస్థుడు ఈహత్యనుగూర్చి వ్రాసియు

న్నాడు. తన్నుమాత్రము మిగిలించుకొని తుళువవంశ మునంతయు నిర్మూలము చేయవలెననుట తిమ్మనిసంకల్ప మై పొడకట్టినది. సదాశివునితండ్రి రంగరాజును సహి తము పరిమార్చెను. సదాశివుడును తిమ్మనిచేత జిక్కి- యంతరించవలసినవా డెట్లో తప్పిబ్రతికెను. ఫెరిష్టా సహితము వేంకటాద్రిని తనమేనమామ సలకముతిమ్మడే గొంతుపిసికి చంపించినట్లు వ్రాసియున్నాడు. కర్నూలు జిల్లా మారకాపురమున చెన్నకేశవస్వామి దేవాలయపు గరుడమంటపముపై శిథిలమైన రాతివ్రాత యున్నది. దానిని శోధించి చదివిన సలకముతిమ్మడు రాజద్రోహి యను ఘోరపుమాట యందు కననగును.

### తిమ్మని దురాశ

ఇట్లు వేంకటాద్రిని పరిమార్చినపిమ్మట సలకము తిమ్మ రాజు సింహాసనము నాక్రమించుకొని చండశాసనుడై లోకకంటకుడన ప్రబలెను. రాజధానియం దున్నరాజ వంశ్యులు చేయునది లేక " అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ " అనుధర్మమున కొంతకాలము సహించుచు వచ్చిరి. కాని తుదకు భరించలేక వానిపై ఫితూరి పన్నుగడలకు మొదలిడిరి. తిమ్మరాజు రహస్య మును తెలిసినవాడై యేదోనెపమును గల్పించి మోస



అరియనాథ మొదలియార్ స్తంభము

"అరియనాథ మొదలియారు ఈనాయకునికి మంత్రిపుంగవుఁడై యీకార్య దీక్షలయందు కుడిభుజమో యన మెలఁగి మన్ననలందినవాఁడు." (౬౧ పు.)




"పెనుగొండ * * కోటల వశపఱచుకొని బలముల ప్రోగుచేసికొనుచుండిరి.'
(౯౦ పుట.)

గించి వారిని తనయెదుటకు రప్పించి కొందరికండ్లను పొడిపించెను. మిగిలినవా రాగ్రహాభయములతో తప్పించి కొని మరలి తిమ్మరాజు క్రౌర్యపద్ధతుల నాప సమకట్టిరి. కృష్ణరాయల రాణు లిరువురు నుత్తరమున నున్న బిజాపురపు సుల్తాన్ అదిల్ఖానసహాయమును వేడి లోకకంటకు డైన యీ తిమ్మరాజు బారినుండి తప్పించుటకు లంచముగ విజయనగరపు సింహాసనమునైనను నాసుల్తానున కొప్ప జెప్ప సాహసించుట విషాదకరము. ఈ పన్నుగడల సలకముతిమ్మ డెరిగి తానే ముందుగ నారులక్షల రొక్కమును, వెలగల పారితోషికములను అదిల్ఖానుకు పంపి తనపక్షము సహాయమునకై వెడలిరా కబురు పంపెను. ఆసుల్తానుని కర్చువెచ్చములకై దినము నొక మూడులక్షలరొక్కము నిచ్చునదిగను, కార్యసిద్ధి గన్న పిదప తాను సుల్తానుకు సామంతుడై వర్తించునట్లును నొడంబడినవాడాయె. సుల్తాన్ అభినవశల్యుడో యన నటించి, తన సేనానియగు అసద్ఖానుని మంత్రాలోచన గైకొని విజయనగరపు మహాద్వారము నిరాటంకముగ చేర, తిమ్మరాజు తనపరివారములతో వాని నెదుర్కొని స్వాగతమొసగి సింహాసనాధిష్ఠితునిగ జేసి తనకు మిగిలిన యాప్తవర్గములతో నేడుదినము లుత్సవముల సాగించెను.

రామరాజు సన్నాహము

ఈనడుమ రాజధానిని విడిచిచన్న అళియరామరాయ తిరుమలరాయలును వారి యనుచరులును పెనుగొండ, ఆదవాని, గుత్తి, గండికోట, కర్నూలు, కోటల వశపర చుకొని బలముల ప్రోగుజేసుకొనుచుండిరి. రాజధాని యందు తిమ్మడు జరిగించిన ఘోరవైపరీత్యముల విని యందరును కలసి లోలోపల వాని మట్టగించ నెంచి తిమ్మ రాజున కొకజాబును వ్రాసి తాముచేసినది మహాపరాధ మనియు, అందుకై పశ్చాత్తప్తులైనట్టును మహామ్మదీయులు సామ్రాజ్యమునకు శత్రువు లైనందున రాజధాని లోపలికి తెచ్చి విడియించుకొనుట యనర్థదాయక మనియు, వారిని వెనుకకు మరలజేసినట్టయిన తాము విధేయులై వచ్చి తన్ను చేరుకొనునట్లును వినయమున విన్నవించుకొనిరి. ప్రతిపక్షులైనవారు తనకు వశులైరని నమ్మియో, లేక వారు సమీపించినతోడనే మోసమున వారిని విద ళించ దలచియో, తిమ్మరాజు వారి విన్నపముల నంగీక రించి సుల్తాన్ అదిల్షాను పరివారములతో బిజాపురము నకు మరల బనిచెను. ఇట్లు సుల్తానుడు మరలు తరుణ మున తిమ్మడు రాజ్యపు బొక్కసమునుండి ఏబదిలక్షల రొక్కమును, పన్రెండు మదపుటేనుగులను, కొన్ని

తురగరాజములను, ఇక నేవేవియో కానుకలుగ నొస
గెను.

## ఆత్మహత్య

అదిల్షా సైన్యముతో విజయనగరమునుండి తిరిగి తిరుగునంతలో రామరాజును, వాని యనుచరులును తా మదివరకు గూర్చుకొన్న బలములతో రాజధాని రభసమున ప్రవేశించి వేంకటాద్రిని పరిమార్చిన ఘోర కృత్యమునకై తిమ్మరాజును తెగటార్చి కసితీర్చుకొనుట కుద్యుక్తు లైరి. ఈ సమయమున నుభయపక్షములవారికి యుద్ధమే జరిగినట్లు రామరాజీయము, నరసభూపాలీయము, స్వరమేళకళానిధి యనుగ్రంథములు సూచించుచున్నవి. కాని, ఫెరిష్టాయైనను, అపు డుండిచూచిన పోర్చుగీసుదేశస్థుడు కొరియా యైనను వ్రాసియుంచిన వ్రాతలం దిరుపక్షములవారికి పోరు జరిగినట్లు లగుపడదు. తిమ్మనియాప్తులకు అళియరామరాజు లంచమిచ్చి వారిని తన పక్షమున త్రిప్పికొని యుండనోపు. మారకాపురపుశాసనమున రామరాజే సలకముతిమ్మరాజును చంపి, రాజధానిని వశపరచుకొన్నట్లు వ్రాయబడియున్నది. అయినను నాకాలమున తిమ్మనిచావును గూర్చి పరిపరివిధముల లోకు లాడికొనిరి. అళియరామ

రాజే యీరాజద్రోహిని చేతులార చంపినట్లు వసుచరిత్ర, నరసభూపాలీయ గ్రంథములు తెలుపును. హాండే అనంతపురపు కథల చదివితిమేని తిమ్మడు పోరి చచ్చినట్లు విశదమగుచున్నది. ఫెరిష్టా వ్రాసియున్నక్రమమున సత్యము హెచ్చుగనుండునేమొ? ఆవ్రాత యిట్లున్నది: తిమ్మరాజు తన్ను ప్రతిపక్షులు మోసగించినసంగతి తెలిసినవాడై నగరున దాచికొని తలుపు బిగించుకొనెను. భయసంత్రాసముల కున్మాదమానసన్నమాయె. నగరునందు గుఱ్ఱములయు, యేనుగులయు కండ్లను పొడిపించి తోకలను కోయించెను. అనూచానముగ రాజాంతఃపురపు బొక్కసమున ప్రోగైయుండిన ముత్యములు, పచ్చలు, కెంపులు, వజ్రములు, ఇతరమాణిక్యములును బరువైన తిరుగండ్ల నడుమ పోసి, పిండిచేసి నేలయంతయు చల్లించెను. తుదకు తనగదియందు స్తంభమునకు ఖడ్గమొకదానిని సంధించి దానిమొన తనవక్షమున తాకి వెనుక వీపున వెడలునంతటి రభసమున పొడుచుకొని శత్రువులు నగరున ప్రవేశించుటకు ముందే యసువులబాసి చన్నవాడయ్యెను. కొరియా వ్రాతయు యీవివరమునకు సరిపోవుచున్నది.

చచ్చినను విజయనగరమున రాజై చావవలె ననుట తిమ్మనిసంకల్పమై యుండెననియు కన్పరచియున్నాడు.

### రామరాజుకార్యసిద్ధి

ఈ శుభవార్త విన్నతోడనే కృష్ణరాయలరాణు లిరువురు రాజధానిని రామరాయ తిరుమలరాయాదుల స్వాధీనపరచవలసినదిగ యనుజ్ఞనొసగ సామ్రాజ్యమునకు మోక్షము నాపాదించిన మహోపకారియని రామరాజునకు స్వాగత మొసగిరి. ఇట్లు దేశద్రోహియగు సలకము తిమ్మని పరిమార్చి కర్ణాటరాజ్యము నుద్ధరించినందుకు స్వర్గమున విద్యాధరులే వీణెలెత్తి శ్రుతిగూర్చి వాయించుచు స్తుతియించినట్లు రెండవ వేంకటపతి (Venkata II) వ్రాయించిన మంగళంపాడు శాసనము ప్రకటించుచున్నది.



# తొమ్మిదవ యధ్యాయము

---

## సదాశివుడు

క. బాలుఁ డకృతాస్త్రుఁ డబలుం
డాలంబు తెఱంగు నెఱుఁగఁ డరుల జయింపన్
జాలునె నిశాటవికటా
ఫీలాకారములఁ జూచి బెగ్గిలకున్నే!

—భాస్కరరామాయణము. బాలకాండము ౧౮౩.

### రామరాయని స్వార్థరాహిత్యము

రామరాజు పూనిన దేశోద్ధరణదీక్షకు సలకముతిమ్మని సంహార మంకురార్పణమాత్ర మనజెల్లును. ఈసమయమున నారాజన్యుడు విజయనగరసింహాసనమును తానే యధిష్ఠింపఁగోరియుండిన,తన బాహుపరాక్రమకీర్తు లటుండ, నంతఃపురమున కృష్ణరాయనిసతులును, తక్కిన బంధువర్గమును నడ్డులేక యీపనికి సమ్మతించియుందురు. ఈ ధీరోదాత్తునిసంకల్పము తుళువవంశమునకు సామ్రాజ్యమును మిగిలించవలెననుటయే కాని స్వార్థము కలనైనను తోఁచినది కాదు. అది కారణముగనే యారాజన్యుడు

తిమ్మనిబారికితప్పి గుత్తికోటయందు తలదాచికొనియున్న సదాశివుని తెచ్చి సింహాసనము నెక్కించుటకై ఖడ్గము చేతబూని బయలువెడలుట. సలకముతిమ్మరాజు వేంకటాద్రినిచంపి సింహాసనమును తా నాక్రమించుకొని తన విరోధివర్గముకండ్లు పెరికించినసమయమున తప్పించుకొని పోయినట్టి రామరాజు పరివారమునం దున్నవారిలో సదాశివుడును, వీనిజ్యేష్ఠుడును తుళువవంశపువారై మిగిలి యుండినవారు. సదాశివునితండ్రిపేరు రంగరాజు. ఇతనికి రంగక్షితీంద్రుడనియు పేరు. కృష్ణరాయలకు సవతితల్లి కొడుకు; అచ్యుతునికి తమ్ముడు. వీనినే సలకముతిమ్మడు వేంకటాద్రితోపాటు పరిమార్చుట. తిమ్మడు విజయనగరమున సింహాసనము నాక్రమించుకొన్నను దానిని సరకుగొనక రామరాయప్రభృతులు సదాశివునికన్న పెద్దవానికి తిరుపతి వేంకటేశ్వరునిసన్నిధియందు బాహాటముగ సామ్రాజ్యపట్టాభిషేకమును గావించిరి. కొంతకాలమునకు వాని కున్మాదము పొడసూప నదేతిరుపతియందు తమ్ముడు సదాశివునికి పదిమూడవయేట పట్టము గట్టబడెను. ఆకాలమున తిమ్మని రాజ్యమునుండి వెడలించు కర్చువెచ్చములకై తిరుపతి వేంకటేశ్వరుని బొక్కసము నుండి నూతనచక్రవర్తి యగు సదాశివునిపేర విశేష

ద్రవ్యము కానుకగ నొసగబడినది. తిరుపతిక్షేత్ర బ్రాహ్మణవర్గము నూరుగంత యెద్దులు మోయునంత బంగారునాణెముల నా సదాశివచక్రవర్తికి సమర్పించి నదియు నపుడే. ఈసాధనసామగ్రితోనే రామరాజు తిమ్మనిపై దాడివెడలుట. తిరుగుమార్గమున సదాశివుని గుత్తికోటలో దిగవిడచి వచ్చినదియు నపుడే. అక్కడ నుండియే రెండవసారి విజయనగరమున పట్టము కట్టుట కొరకు సలకముతిమ్మని తెగటార్చినపిదప సదాశివుని గుత్తి నుండి తేబూనుటకై రామరాయడు ప్రయాణమగుట.

### స దా శి వు ని ప ట్టా భి షే క ము

ఈ రాయని పట్టాభిషేకమహోత్సవము రెండవసారి రామరా జెదుటనిల్చి విజయనగరముననే మహావైభవ ముతో జరిపెంచెను. ఆశుభసమయమున సింహాసనము వెనుక నిల్చి సదాశివుని కిరీటముపై శ్వేతచ్ఛత్రమును చేబూనినవాడా రాజు. ఈయుత్సవమును కనులార గాంచి, తమకృష్ణక్షితీంద్రునివంశమువాడు మరల సింహాసనము నలంకరించుట కారణముగ ప్రజలు నేలరాల్చిన యానంద బాష్పములతో సదాశివునితోపాటు భూదేవికిసహిత మభి షేకమయ్యెనా యనుతీరున నాకాలపుకవులు వర్ణించి యున్నవారు. అప్పటికి సదాశివుడు బాలుడు. కొరియా

వ్రాసిన దానినిబట్టి చూడ వానికి వయస్సు అప్పటికి పదునారేడులు. రామరాజుతమ్ము లిరువురు తిరుమల వేంకటాద్రులును, వేంకటేశ్వరరాజును, నంద్యాల తిమ్మదేవుడును సదాశివుని యమాత్యులై రాజ్యపాలనమునకు దొడఁగిరి. అదిమొదలు సదాశివుడు వీరప్రతాపకరారి సాళువవీరసదాశివరాయ దేవమహారాయ అను బిరుదావళితో విజయనగరసామ్రాజ్యమునకు చక్రవర్తియై క్రమం బెల్లెడల పరిగణింపబడుచువచ్చెను. ఈశుభవార్తను సామ్రాజ్యమునందు దిక్కుదిక్కులనుచాటినట్టు శాసనములు ప్రకటించుచున్నవి. ఇదియంతయు జరుగుట ౧౫౪౨ - వ సంవత్సరపుటుత్తరార్ధమునందు.

## రా జ్యాం గ ర చ న

సదాశివచక్రవర్తి బాల్యావస్థయం దున్నకారణమున రామరాజే ప్రతినిధి (Regent) యయి రాజ్యభారమును వహించెనని వేరుగ చెప్ప నవసర ముండదు. రమారమి ఎనిమిది సంవత్సరములకాలము ఏలుబడినంతయు రామరాజు జరుపుచువచ్చినది సదాశివునిపేర నే. కార్యభారముల విభజించి ఆయాప్రాంతములకు తగినవారిని నియమించుటయందు రామరాయని నేరుపు శ్లాఘ్యమైనది. ఉదయ

గిరికోట యుత్తరమున దక్కను మహమ్మదీయులకు సన్ని హితమై యున్నందుచే నా ప్రాంతములకు తిరుమలరాయ డధిసాధుడుగ నుండ నియమింపబడెను. మరి యొకసోద రుడు వేంకటాద్రి సామ్రాజ్యపు బొక్కసమునకు కర్తయై కర్నూలు తన ప్రధానపట్టణముగ నెలకొని యేలుచుం డెను. సదాశివుడు పట్టమునకు వచ్చిన యచిరకాలము ననే రామరాజు బిజాపురపు సుల్తానుపై దండెత్తసమయ మేర్పడినది.

విప్లవనిరోధము

ఈ తరుణమున ననుచరవర్గములోని రాజన్యులు కొందరు రామరాజు సమయస్ఫూర్తి దిట్టతనముల చండశాసనమని భ్రమించి యోర్వలేనివారై తన యధికారపదవిని పదలుకొనవలసినదనియు, నాస్థానమున మరియొకని నెన్నుకోవలెననియు బాహాటముగ నా రాయని ప్రతిఘటింప తలపెట్టిరి. ఇందుకు రామరాజు సమ్మతి నటించి, వా రందరును మరల ఎన్నికనెప మున నగరు ప్రవేశించినపుడు ఆప్తవర్గముచే తలుపులు మూయించి విప్లవకారులైన కొందరిని తెగటార్చియు, మరికొందరి కాలుచేతులు నరికించియు, ఇక కొందరిని కండ్లు పొడిపించియు తిరుగుబాటు పేరుమాయునట్లు

చేసి తన దిట్టతనమును ప్రకటించెను. విప్లవబీజము నడుగంట జేయుట కీ ప్రతీకారము చాలదని క్రొంబోలు సదాశివునినే చెరయం దునిచినదియు నపుడే. ఇదియం తయు జరుగుట ౧౫౫౦-౫౨ సంవత్సరముల నడుమ. అదిమొదలు ఏలుబడి పనులన్నియు మునుపటివలె సదా శివుని పేర మాత్రమేగాక యుభయులుచేరి నిర్వహించు చుండినట్లు అటుపిమ్మటి శాసనములు ప్రకటించుచున్నవి. సదాశివుని నిర్బంధమున నునిచినను సార్వభౌమపదవి యతనిదే యని ప్రజలకు ప్రకాశింపజేయుటకో యన నేఁటట వారికి సదాశివునిదర్శన మబ్బజేయుచుండెను. ఇట్లుసార్వభౌముఁనే చెరయందుంచినందున దుడుకు తమ్ము లగు తిరుమలవేంకటాద్రులకే వెగటయిత్తోచి అన్న రామరాజుపై తిరుగబడి వర్తింప మొనసిరి.

తమ్ములు ధిక్కరించుట

ఉత్తరమున బిజాపుర-అహమద్‌నగర సుల్తానులకు స్పర్థగలిగి బిజాపురపు సుల్తాను రామరాజుసహాయమును వేడ, రామరాజు తనసైన్యములతో రాజధాని వదలి వెళ్ళవలసిన తరుణ మేర్పడెను. ఆసమయమున నాదవాని రాజ్యభాగ మిద్దరుసహోదరుల పాలనయం దుండ, అన్న విజయనగరమున లేనిది కనుగొని యుద్వృత్తులై యాశర

యాధిపత్యమును ధిక్కరించి వర్తింపమొదలిడిరి. రామరాజు నగరమునకు మరలివచ్చినపు డీ యుదంతము నెరిగి తమ్ముల ననునయించుచు జాబు వ్రాసిపంపెను. దానిని వారు సరకుసేయక ప్రతిఘటనకు మొనసినవారైరి. వేరువిధముగ వాని నణచుట రామరాజున కలవడదాయె. విధిలేక గోలకొండసుల్తానునకు రాయబారుల నంపి సహాయమువేడ ఇబ్రహీం కుతుబ్షా కాబూల్ ఖాన్ అను సేనానితో నారువేల పదాతిబలము నంపెను. ఆసైన్యమాదవానికోటను ముట్టడించి ఆరునెలలు జరుగువేళకు కోటలోని తిరుమల వేంకటాద్రుల ప్రతిబలముల కాహార పదార్థములు తగ్గజొచ్చె. అపుడు తమ్ములిద్దరు రామరాజు శరణువేడి విజయనగరమునకు విధేయవిన్నపముల నంపుకొనిరి. అన్న వారిని మన్నించి చేరదీసెను.

వారియనునయము

కాబూల్ ఖాను డుచితమగు పారితోషికములతో గోలకొండకు మరలి ఇబ్రహింకుతుబ్షా మన్ననల నంది ఐనుల్ ముల్క్ అను బిరుదమును బడసెను. తమ్ముల యీాదుడుకు రామరాజు క్షమించుట యన నాశ్చర్యమే. తన రాజ్యతంత్ర రచనయందు తనపక్షము బలయుతమై యుండవలెననుట మొదటినుండి యీాభూపాలుని సంక

ల్పము. బాహుపరాక్రమమున తనకు భీమార్జునులనుబోలు తమ్ముల వివేకము మాని యెడబాటు చేసుకొన్న యెడల ముందు సామ్రాజ్యోద్ధరణమునకై మిగిలించియుంచుకో వలసిన వారి శక్తిసంపన్నతను గోల్పోవుటయెగాక తన బుద్ధిబాహుబలముల వారి నెదిరించుచుండుట యందే చాలభాగము వెచ్చింపవలెనను దూరాలోచనయు నీస మయస్ఫూర్తి కేకమిచ్చి యుండనోపు. అంతకన్న ప్రమా దమైనకారణము తనతమ్ముల నెదిరించుటకై మహమ్మ దీయుల సాహాయ్యమును వేడి వారిదాక్షిణ్యమునకులోనై యుండవలయుటయు నగునేమొ. తన దూరదృష్టియందు తానే సింహాసనము నెక్కి సామ్రాజ్యదండమును చేత బూని నిర్వహించవలసినదినము సమీపించుచున్న దనుట తన యింగితజ్ఞతచే ముందుగ గుర్తించియున్నట్లును భావి పరిస్థితులు సూచించును. ఈసమయమున వారిని క్షమించి చేరదీసిన కారణముననే వేంకటాద్రి తిరువైయారు ప్రధాన పట్టణముగ చోళరాజ్య ప్రాంతములందును, తిరుమలుడు సామ్రాజ్య మెల్లెడలను, ప్రభుత్వభారమును వహించి అన్నకు విశ్రాంతి గూర్పగల్గిరి. ఇట్లు తన యాప్తబంధు వుల వారివారికి తగిన యధికారముల నొసగి దిట్టపర చుట యపుడే.

## ఏలుబడి వితరణ:

రాజ్యపుటాదాయ భాగములను నిర్ణయించి రాబట్టుకొనుటయందు ప్రజలకు బాధలేక, బరువుకాక, నొప్పినీయని పద్ధతుల,

క. పరుసఁదనము మెయి నరిగొనఁ
జొరఁదిగ పిది పాడుఁగుగోయుచొప్పగు విను పా
ల్గురియించుకొనఁ ఎలంచిన
నరయవలదె గోవుఁ బ్రజయు నట్టిద యధిపా!

ఆ. కోరి తోఁటవాఁడు కుసుమఫలంబులు
గోయునటుల రాజు గొనఁగవలయు
నప్పనములు నఱికి యంగారములు సేయు
భంగినైన భూమి పాడు గాదె.

—భారతము. శాంతిపర్వము, ద్వి. ఆ.

అను ధర్మము ననుసరించి కృష్ణాచ్యుతుల కాలముననే సవరించి దిట్టపరచినవాడు రామరాజు. ఆయన ప్రతాప శక్తుల నెరిగియే ఆయారాష్ట్రముల నాయకులు తమ తమకప్పముల రాజధానికి క్రమముగ చెల్లించుచుండిరి. అది కారణముగ తాను ౧౫౬౨-౬౩ సంవత్సరమున స్వయముగ సింహాసనమెక్కుట తటస్థించినపుడు సామ్రాజ్యపు బొక్కసమందు ద్రవ్యము పుష్కలముగ నుండెను.

## పవిత్రక్షేత్రముల పెంపు

సదాశివుడు పట్టమునకు వచ్చినది మొదలు రాజ్యము లోని దేవాదాయముల సవరించి నెలకొల్పుటయె కాక జీర్ణములై పడియున్న గుళ్లు గోపురముల నుద్ధరించిన కీర్తి రామరాయనిది. నల్ల చెరువులోని భైరవుని దేవాలయము ౧౫౪౪-వ సంవత్సరమున జీర్ణోద్ధారమగుట మచ్చునకొక దృష్టాంతము మారకాపురమున చెన్న కేశవస్వామికి గ్రామ మొకదానిని దేవాదాయముగ నివేదించుటయు నపుడే. తాటిపత్రి తిరువేంగడనాథునికి పెమ్మసామినాయని యూరసుడు చిన్నతిమ్మానాయడు ఎనుములచింతల గ్రామ మును దేవాదాయముగ నొసగినది యిట్టిదానములకు మరియొకమచ్చుగ గైకొనవచ్చును. చక్రవర్తులును, సామంతులును నీభాగమందు ప్రకాశింపజేయుచు వచ్చిన శ్రద్ధాభక్తులు ఆయాప్రాంతముల ప్రజలు మేల్బంతిగా గైకొని చేసినదానధర్మము లెన్నియో. వీని కాధార మైన తామ్రశిలాశాసనము లనేకములు దేశమం దక్క డక్కడ నిప్పటికిని కననగును. దక్షిణమున విశ్వనాథుడు దేవాలయముల వృద్ధిగావించిన వివర మింతకుముందు సూచింపబడినది.

## మంగలుల మన్నన

సదాశివుడు సింహాసనము నధిష్ఠించినకాలమున మంగలివారికి కలిసివచ్చిన యోగము మరేకులమువారును కానరైరి. ఆకాలమున ఈకులమువారిలో మంగలతిమ్మోజ కొండోజ అను పేరుగలవాడు తనకసబునందేత్తినచెయ్యి. రామరాజు గడ్డమును గొరుగుటయందు కౌశల్యమునందినవాడట. కొండోజ వీనిసంక్షిప్త నామాంతరము. వీనిపనితనమందు రామరాయనికి గలమెప్పు సదాశివసార్వభౌముని సమాగమమే వానికి లభించుటకు మూలమై కులముకులమే యారాయని యభిమానము గడించుటకు పొసగెనందురు. ఇదికారణముగ నంతవర కాకులమువారు రాజ్యమెల్లెడల చెల్లించుచువచ్చిన పన్నులన్నియు నొక్కసారిగ రాజశాసనముచే ౧౫౫౪-వ సంవత్సరమున నివర్తింపబడెను. మైసూరు చిత్రదుర్గమండలమందు రామరాయ డిట్టిశాసనము నొక్కదానిని ౧౫౪౬-వ సంవత్సరమున రాతివ్రాతగ చెక్కించి యుండుట నేటికిని కననగును. ఇట్టి రాజశాసనముల ప్రతిభచే సామ్రాజ్యమున దిక్కుదిక్కుల నుండు సామంతనాయకు లనేకులు మంగలుల మానితుల చేయుచుండిరి.

రాజ్యాంగ ప్రతిభ

దేశకంటకుడైన సలకము తిమ్మని తెగటార్చిన యుదం తము దశదిశలు ప్రాకి రామరాయని తేజఃప్రతాపము లెల్లెడల పర్వించెను. అంతకుముందే ఒరిస్సారాజు విజ యనగరమునకు లోనై యున్నవాడు. అదివరకు విజయనగర మన్న సంతంత మాత్రముగ కనుగొనుచు కూపకూర్మ ములై స్వతంత్రించివర్తిల్లుచుండిన చిన్నచిన్న భూపతుల ననేకుల రామరాయని కీర్తిప్రతాపము లావరించి వారిని సామ్రాజ్యపరిధియందు వలయించినవి. ఇక పడమ టితట్టు గోవా మొదలు మంగళూరివరకు వ్యాపించిన ప్రాంతములును, కర్ణాటక మనుపేరు గాంచిన యిప్పటి మైసూరురాష్ట్రపరిసరములును అదేతీరున సామ్రాజ్యము నకు వలయించిపెట్టినకీర్తి రామరాయనిది. కెళది వంశపు సదాశివనాయకుడనువీరుని యిప్పటి శివమొగ్గ (Shimoga) ప్రాంతములకంపి యచట చంద్రగుత్తియను నూర నెల కొనియేలుచున్న నిషాదవర్గమును జయింపజేసినది రామ రాజే. ఈకర్ణాటరాజ్యభాగమున కపుడు రాజధానియై పరగిన పట్టణమునకు "అగర" యనిపేరు. ఈ యూరి నీరామరాజు పాలించుచున్నట్టు శాసన మొకటి యిప్ప

టికిని కననగును. సామ్రాజ్యప్రతిభ సింహాళమువరకును వ్యాపింపజేసినవారు విశ్వనాథుడును, వానియారసుడు కృష్ణప్పయు ననుట యింతకుముందే సూచింపబడినది. వారి కార్యసిద్ధికి రామరాజు మూలమనుట మరల చెప్పుట యనవసరము.

---

# పదియవ యధ్యాయము

## విదేశ సంపర్కము

తే. సింధురమహాశ్వముఖ్యము ల్పేర్చు దాల
దీవి వణిజుల కూళ్పసద్గ్రహములు పురిఁ
గొలువుఁ దేజంబు వెల మేలుగలుగఁ బ్రాఁతే
వారిఁగాఁ జేయు నరి నవి చేరకుండ.

—ఆముక్తమాల్యద.

ఇక పోర్చుగీసువారియెడల రామరాజు నల్పుచువచ్చిన వ్యవహారవర్తనలక్రమము దెలుసుకున్న నీయుదంతము కుంటువడును. వారిదేశమున ప్రవేశించి వ్యాపించిన కథ పూర్వార్ధమున కొంత వివరించుట యీ సమయమున యుక్తమై యుండునేమో.

### పోర్చుగీసువారి ప్రవేశము

డాన్ ఫ్రాన్సిస్కో ఆల్మెడా (Don Francisco Almeda) అనువాడు ఈదేశమునకు వచ్చిన గవర్నరులలో మొట్టమొదటివాడు. పశ్చిమసముద్రమున గోవా (Goa) పట్టణము విజయనగరమున కధీనమై యుండి బిజాపురపు

సుల్తాను యూసఫ్ అదిల్షాచే నాక్రమింపబడెను. ఆకాలమున మరల దానిని సాధించుకొనుటకై విజయనగరము నుండి పంపబడిన యోధునిపేరు తిమ్మోజ. వీడు విజయనగరపు యుద్ధనావల కధిపతి. ఈనావలబారొక్కటి యాకాలమున పశ్చిమసముద్రమం దుంపబడియుండెను. వీని బలముగొని గోవాపట్టణమును మరల సామ్రాజ్యమునకు సాధించవలె ననుట వానియప్పటి సంకల్పము. అపుడే అనగా ౧౫౦౭-వ సంవత్సరమున తిమ్మోజ పోర్చుగల్ గవర్నరు ఆల్మెడాకు పరిచయమగుట. ఇట్లుండ ౧౫౧౦-వ సంవత్సరమున బిజాపురపుసుల్తాన్ అదిల్షా మృతుడయ్యెను. వానిపిమ్మట బిజాపురపు గద్దెనెక్కిన ఔరసుడగు అదిల్షాకు బాల్యము. అప్పటికి ఇండియా యందు పోర్చుగీసువారి రాష్ట్రముల కన్నిటికిని రాజప్రతినిధిగ నున్న వాడు ఆల్ఫన్జో డి ఆల్బుకర్కు (Alfunzo De Albu-qurque). తిమ్మోజ వీని నాశ్రయించి గోవాను ముట్టడింప పురికొల్పిన కారణమున నానగరము పోర్చుగీసువారికి లభించుట సంభవించినది. అదిమొదలే విజయనగరమునకు పోర్చుగీసువారి సఖ్యము ఆరంభమగుట.

గుఱ్ఱముల బేరము

గోవా పోర్చుగీసువారి స్వాధీనముకాకముందే వారు విజయనగరమునకు రాయబార మంపియుండిరి. కళ్ళికోట రాజు పోర్చుగీసువారితో సంతకుముందు చేసికొన్న యొడంబడికకు భంగముకావించుకొని యుండెనట. ఆ కారణమున కళ్ళికోటను ముట్టడింప సమకట్టి యందుకై విజయనగరపు సహాయమును వేడుట కయియే ఈరాయబారము వెడలుట. ఆసమయముననే అరేబియా ఓర్మస్ (Ormuss) దేశపు గుఱ్ఱములను చేకూర్చి యిచ్చు చుండవలెనని పోర్చుగీసువారు కృష్ణరాయలతో నొడంబడిరి. మహమ్మదీయులపై విజయనగరమందు యుద్ధమునకు సన్నాహము జరుగుచుండినపుడే ఆగుఱ్ఱములలో నేవిగాని బిజాపురపుసుల్తానుల కంపకూడ దనుట మరి యొక షరతు. ఈ యొడబా టుభయులసఖ్యము బలపడుటకు సహకారియై వెలసెను.

పారితోషికము

కృష్ణరాయడు మహమ్మదీయులతో పోరిన రాయచూరుయుద్ధమందు పోర్చుగీసువారి సైన్యములు రాయని పక్షమున చేరి జయ మాపాదింపజేయుటకీ సఖ్యమే మూల

మనుట వేఱుగ జెప్ప నవసరముండదు. ఈయుపకార
మున కయియే కృష్ణరాయ డిపుడు సాల్ సెట్ అను పేరితో
బరగు ద్వీపప్రదేశముల సంపూర్ణముగ పోర్చుగీసువారికి
పారితోషికముగ నొసగుట. ఈయంశ ముభయులమైత్రిని
ఇంకను బలపరచినది.

## పోర్చుగీసుల దుడుకు

౧౫౨౯-వ సంవత్సరమున కృష్ణరాయ లంతరించిన
పిమ్మట ఈ సఖ్యమునకు చ్యుతి యాసన్నమాయెను.
౧౫౪౪-వ సంవత్సరమున పోర్చుగీసువారు పైయొడంబ
టును లక్ష్యమందుంచక స్వార్థమును పాటింప సమకట్టిరి.
అప్పటి గవర్నరు మార్టిన్ డి సూజ (Martin De Souza)
అనువాడు నలుబదియైదు యుద్ధనావల సైన్యమును, ఇరు
వదియేడు సైన్యాధిపతులను కూర్చి సముద్రతీరమున కం
పెను. అక్కడినుండి దండువెడలి తిరుపతిక్షేత్రముపైబడి
యచట వేంకటేశుని ధనరాసుల కొల్లగొట్టవలెననుట
వానిసంకల్పము. విజయనగరమున నీపన్నుగడ వార్త
తెలియవచ్చెగాబోలు, శత్రువుల నెదిరించి క్షేత్రమును
కాపాడుటకై తగినబలముల నాయత్తము చేయ పోర్చు
గీసుగవర్నరు దానినెరిగి యాసంకల్పము మానుకొని

తుదకు తిరువాన్కూరు ప్రాంతములకు వెళ్ళి యచట దేవాలయముల కొన్నిటిపైబడి దోచుకొనెను.

మరల సంధి

ఇట్లుండగను ౧౫౪౭-వ సంవత్సరమున నుభయపక్షములవారును మరల జతపట్టుకొనిరి. మరుసటియేడు రామరాజునగరునందలి కొందరు రాజన్యుల తోడుగొని గోవాకు రాయబారమును పంపి సంధిసమయముల నిర్ణయింపజేసెను. పోర్చుగీసువారు ఎడతెగక విజయనగరపక్షముననే నిలిచి సమయము దొసగినపుడు బీజాపూరు సుల్తానుపై యుద్ధమునకు సన్నద్ధులై యుండునట్లును, సైన్యమునకు కావలసిన గుఱ్ఱములను పోర్చుగీసువారు విజయనగరమునకు మాత్రమే సేకరించి యిచ్చునట్లును, విజయనగరమునుండి వ్యాపారమునకు యెగుమతి యగు సరకంతయు పోర్చుగీసువారి రేవులకే సాగించవలెననుటయు యీ సంధిసమయములలోనివి. దీనినే మరల ౧౫౫౮-వ సంవత్సరమున ఉభయపక్షములవారును స్థిరపరచుకొనిరి. ఈ పన్నుగడయంతయు రామరాజు దూరదృష్టిని ప్రకటించునట్టిది. దక్కని మహమ్మదీయులతో పోరు తప్పదనుట మున్ముందుగ నెరిగినవాడై యుండె గాబోలు.

## పోర్చుగీసుల వ్యాపకము

ఏసుక్రీస్తుయొక్క పన్నిద్దరు అనుచరులలో నొకడైన థామస్ (St Thomas) మద్రాసు మైలాపురమున కనతి దూరమున ౧౫౨౨-వ సంవత్సరమందు పొడకట్టినట్లు కల్పించుకొని యానెపమున పోర్చుగీసువారు ఆపరిసరపు సముద్రతీరమున సెంతోమ్ (San Thome) అను నూరు నొకదానిని తమవారివసతికై సుందరముగ కట్టుకొన్న వారైరి. ఆపట్టణపుపట్టు రాజ్యపుపొలిమేరలలోనిది. ఆపురమును నిర్మించుట కపుడు వారు ప్రకాశించిన కారణము తమకు పవిత్రక్షేత్ర మనుటతోకూడ తూర్పుసముద్రతీర వాసులగు స్వదేశస్థులతో సంపర్కము తిన్నగ సాగించుటయునిరి. లోపలిసంకల్ప మంతకుమించినదై తమదేశమునకును ఇండియాకును ఓడవర్తకములకై రేవుకు తగినచోటు వెతకికొనుటయేకాక కాలక్రమమున సందుదొరికె నేని యుద్ధపునావలను తెచ్చుకొనుటయు,వారిలోపలిసన్నాహమై యుండి యుండనోపు. ఇప్పటి మైలాపురము నానుకొనియుండు పురభాగమే యా 'సెంతోం.'

## వారిదుడుకు నరికట్టుట

పోర్చుగీసు క్రైస్తవమతాచార్యులు సెంతోమునందే కాక దక్షిణమున తంజావూరుజిల్లా నాగపట్టణమందును

చిరకాలముగ నెలకొనియుండి యనేకములైన హిందూ దేవాలయములు పడగొట్టి వాని స్థానమున తమ గుళ్లను కట్టుచువచ్చిరి. జెసూయిట్సు (Jesuits) అను మరియొక తెగ క్రైస్తవులును అక్కడ మొనసి యాప్రాంతములు మెల్లమెల్లగ వ్యాపింపజొచ్చినదియు నప్పుడే. అక్కడి బ్రాహ్మణవర్గ మీ మతాంతరుల యక్రమసరణినిగూర్చి మొరల నంపుకొనిరిగాని పోర్చుగీసువారియెడల విజయనగరమున నెలకొనియుండిన సఖ్యకారణముతోను, అప్పుడు రాణువకు గుఱ్ఱముల సేకరించుచున్నందున నేమొ, రామరాజు మొదట నాబ్రాహ్మణుల మొరల పాటింపడాయె. మరి కొంతకాలమునకు కావలసిన యుద్ధోపకరణములతో అయిదులక్షలు సైన్యమును ప్రోగుచేసుకొని యాయూరిపై దండు వెడలెను. అప్పటికి సెంతోం సుందరమగు సముద్రపు రేవై బంగాళము, బర్మాదేశములతో ఓడవర్తకముల నల్పుచుండినది. అక్కడి ప్రజలును భాగ్యవంతులై యుండిరి. రామరాజుసైన్యము లాయూరిపై పడుటకుముందే పురజనులలో ప్రముఖులగువారు కూడి వచ్చి రామరాజునకు లక్షవరహాల నిచ్చునదిగ యొప్పుకొని ప్రమాదము నాపుకొనిరి. ఇదియంతయు జరుగుట ౧౫౫౮-వ సంవత్సరమున. అటుపిమ్మట సహితము మునుపటి సంధిసమయములకు భంగములేక యెప్పటివలె నిరుపక్షములవారికి సఖ్యము వెలయుచువచ్చెను.

# పదునొకండవ యధ్యాయము

---

## అళియరామరాజు సింహాసనమెక్కుట

సీ. నపెదవియలు నేసె నగరిపుమాణిక్య
        మకుటముల్ ప్రానిన మనుజపతులఁ
  పగునాజ్ఞ సూయాణముగ నొసరించె మం
        చిగ నేలనాలుగు పెల్లఁగులకును
  శ్రీతార్థిజనుల సచేతనత్యాగ ధ్వ
        జములుగా నన్ని దేశములఁ బఱపె
  దిక్కు లన్నింటను దెలుపారుప్రాంత గా
        వించె నుజ్జ్వలయశోవిభ్రమంబు

*    *    *    *    *    *

ఉ. ఖ్యాతచరిత్రుఁ డీ చిఱుత గద్దియకుం దగఁడే నరేశ్వరా!

—భారతము, విరాటపర్వము. పం. ౩౨౦, ౩౨౧.

చెరలోనున్న సదాశివుడు మృతుడయ్యెనని కల్పిత వార్త యొకటి రాజ్యమున వ్యాపించెను. సామ్రాజ్యరథపు పగ్గములు తుదకు రామభూపాలుడే చేకొనుట సంభవించినది. క్రమముగ వానికి పట్టాభిషేకమే జరిగినట్లు చరిత్రకారులు వ్రాసియున్నారు. తన పేరనే నాణెములు

ముద్రించి చెలావణీయం దొంచెను. ౧౫౬౫-వ సంవత్సరము నాటి గండికోట బంగారు నాణెమున నొక్కవైపున ప్రభావళిలో విష్ణువిగ్రహమును, మరియొకవైపున 'రామరాయ' యనుపేరును ఇప్పటికి నక్కడక్కడ చూడనగు. ఇంతేకాక, సార్వభౌమబిరుదు లన్నియు రామరాజు గైకొన్నట్లు కృష్ణరాజపేటలోని శాసన మొకటి వెలయించుచున్నది. "రాజాధిరాజ పరమేశ్వర వీరప్రతాప మహారాయ రామదేవలయ్యంగారు" అను బిరుదావళియె యీశాసనమందు చెక్కబడియుండుట. అప్పటికే రత్నకూట మను పేరితో తనకు ప్రత్యేకముగ రాజాంతఃపురము నిర్మింపబడియున్నట్లు తనమంత్రి యగు రామయామాత్య తోడరమల్లురచియించిన "స్వరమేళకళానిధి" యందు చెప్పియున్నవాడు. ఆ నగరు వైభవమందు ఇంద్రుని వైజయంతిని మించుచున్నట్లును చుట్టు సువరారామములతోను సాలభంజికలతోను, హంసలతో గూడిన సరోవరములతోను అలంకృతమైనట్లు అందు వర్ణింపబడియున్నది. రాజ్యభారమును తమ్ములచేనునిచి పండితగోష్ఠియందు శాస్త్రవిచారముల జేయుచు వాఙ్మయ లలితకళల నారాజు రమించుచుండెనని డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు శోధించి, ఆధారములకని వ్రాసియున్నవారు. వసు

చరిత్రకర్త యగు భట్టుమూర్తి యీ రాజన్యుని నాశ్ర
యించి మన్ననలందినట్టు

శా. శ్రీరామక్షితిపు న్మహోగ్రము జయశ్రీలోలు నానాకళా
పారీణుఙ్ బహుసంస్కృతాంధ్రకృతులం బల్మారు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహారహయవేదండాగ్రహారాది స
త్కారం బందితి రామభూమిపకవీ, నన్నుండు నీవన్నిటఙ్.

—వసుచరిత్రము, 28 వ పేజీ, 17 వ పద్యము.

అను పద్యము చెప్పెను. రామరాజభూషణుడను బిరుదు వహియుట కదియే కారణము. దీనివలన రామరాయని రసజ్ఞత యొక్క లోతును, పరిధిని కొలువనగును. రామరాజు స్వయముగ వీణను శ్రుతి గూర్చి వాయించి పాడువాడని వేంకటపతిదేవుని (Venkata II) ౧౫౮౬-వ సంవత్సరపు శాసన మొకటి ప్రకటించుచున్నది. శాస్త్ర వ్యాసంగముకొరకే కులగురువగు తాతాచార్యుని వెంట బెట్టుకొని చంద్రగిరికి వెళ్లియుండినట్టు "ప్రపన్నామృత" మను గ్రంథమున కననగును. అదిమొదలు సామ్రాజ్య నిర్వహణచింత వదలి రామభూపాలుడు నెమ్మదిగ సుఖియై కాలము గడుపుచుండెనని యూహింపనగును.

కళంకము

సదాశివునిపట్టాభిషేకకాలమున రామరాజు సింహా సనమునకు వెనుక నిల్చి శ్వేతచ్ఛత్రమును పట్టెనంటిని.

అట్టివాఁడు తానే గాఁ సదాశివుని చెరలోనుంచి ఆ సింహాసనమును తా నెక్కుట ఆతని ధర్మోదాత్తతకు వికళత నాపాదించుచున్నట్టిది. తా నిట్లు సింహాసనాధిష్ఠితుఁడై సార్వభౌముఁ డని ప్రకటించుకొన్నప్పుడు రామరాజు వయస్సు తొంబదిసంవత్సరములకు మించి యుండవలెను. సంగీతసాహిత్యములందును, వేదాంతవిచారమందును రమించుట కలవడిన చిత్తసంస్కారము కలిగినవాఁడు. అచ్యుతుని కాలమందును, పిమ్మట సదాశివుఁడు పట్టమునకు వచ్చిన పదిసంవత్సరముల వరకును మరుగుననుండి సామ్రాజ్యకార్యముల నిర్వహించిన యవికత్థనుఁడు. ఇంతటి త్యాగశీలునికి చరమదశయందు చక్రవర్తి యను పేరితో నసువుల బాయవలెనను దంభము పైకొని యుండునా? కేవలము రాజ్యవైభవమునకే మోహితుఁడై యీ కార్యమునకు పాల్పడవలెనన్న చిరకాలము రాజ్యవైభవమంతయు తనదై యుండెనే. ఈ పురుషవృషభుని జీవిత చిత్రఫలకమున కీకళంకము కనులకు నొప్పిచేయునట్టిది. ఈ విషమసమస్యను సమర్థించు టెట్లు? కృష్ణరాయడు సింహాసన మెక్కుటకు ముందునుండి ఏబదిసంవత్సరముల కాలము సామ్రాజ్యాభ్యుదయమునకై బ్రతుకునే ధారవోసినవాఁడు. వీరబల్లాళుని చరమసంకల్పము కార్యసిద్ధి కావించుటకు

కంకణము కట్టుకొనివర్తించినదిట్టి. కనులకు రెప్పలవలె దేశ
మును కాచి కాపాడుటకై యీరాజు సాధించిన కార్య
జాలము వెనుకటియధ్యాయమున చిత్రింపబడినది. సదాశివు
నికి రాజ్యభారము వహించునంతటి త్రాణ చాలదని తా
నెరిగియుండెను. తుళువవంశమున నింతటిగొప్పకర్తవ్యమును
నెరవేర్పగలిగినవాడు దృష్టిపథమునందు మరెవ్వడును కాన
రాడాయెనేమొ. తన వెనుక తనతమ్ములు తిరుమలవేంక
టాద్రులలో నొకడీరాజ్యభారమును వహించుటకు చాలి
యుండలేదా? అట్టిపరిస్థితి పొసగినప్పటికి తానే సింహాస
నము నెక్కి తన క్షాత్రప్రభను కొంతవరకు దాని కాపా
డించియుండిన తన తమ్ములలో నొకడు దాని నెక్కుటకు
సులభమై యుండెనని తలచెనేమొ. పరిపాలన మంతయు
తాను సింహాసనాధిష్ఠితుడై యుండినట్లే తిరుమలుని
కొప్పజెప్పుట యింపుకై యుండనగునా? "సామ్రాజ్య సింహా
సనమున నుండువాడు సదాశివుడు కాడు, అళియరామ
రాజు" అను ప్రతీతిని వ్యాపింపజేసిన నుత్తరమున మహా
మ్మదీయ శత్రువర్గము కొంత మూగియుండ నేర్చునని తల
చెనా? ఈసమస్యల సమర్థింప మొనసితిమేని దుడుకుగ
నగపడు రామరాజు రాజ్యతంత్రము లోకహితార్థమే
యనుట స్ఫురించునేమొ. చరిత్రకారునిపుణు డగు రెవ
రెండ్ హీరాస్ (Rev. Heras) కూడని త్యాగ మని
యూహించి యీరాజును కొనియాడియున్నవాడు.

# పండ్రెండవ యధ్యాయము

## దండనీతి

క. అనపత్రపంబును జెడిపఁ
జనమును లేకుండఁ బఱఁగి చరియొత్తెడునే
యనుబోలె నొత్తవలయును
మనుజేంద్రుఁడు మార్దవక్రమంబున నధిపా!

క. పెక్కండ్రతోడ నీరస
ముక్కతఁడన కొనక తఱఁగియున్న పగతుతో
నుక్కాడి బంధుభావముఁ
జిక్కటిపగఱయోడ వలయుఁ దా నెఱపంగన్.

—భారతము. శాంతి. తృ. ౨౪, ౨౫ పద్యములు.

మహమ్మదీయులు తుంగభద్ర దిగి దక్షిణాపథము నాక్రమించకుండ చేయవలెననుట రామరాజు సంకల్పించుకొన్న కార్యనీతులలో మొదటిది. కృష్ణరాయ లంతరించినది మొదలు రామరాజు ఇరువదియయిదు సంవత్సరములు నావైరివర్గముతో మెలఁగుటయందు సామదానభేదదండోపాయములఁ నాయాసందర్భములందు ప్రయోగించిన విదగ్ధత దండనీతికి లక్ష్యమన నొప్పును. ఈకాలె

లము ఖండాంతరరాజ్యతంత్రధురీణులు నైపుణ్యమునకు వెనుదీయరేమొ. ఈరాజన్యుఁడు పూర్వవయస్సునందే దండనీతిని శాస్త్రముగ నభ్యసించినట్లును వెనుకటి శాసనములు ప్రకటించుచున్నవి. శాస్త్రము నభ్యసించుటయొకటి, అట్లభ్యసించిన శాస్త్రజ్ఞానము నుచితరీతిని సమయమున కుపయోగించుతీరున వాడుకొనఁగల్గుట మరియొకటి. రామరాజు తెరఁగులకౌశలమును నెరపనదిట్టి. ఈ నైపుణ్యమును తెలిసి మెచ్చవలెనన్న నామహమ్మదీయ వైరివర్గముయొక్క ముందువెనుకల యుదంతమును సూక్ష్మముగ దెల్పుట యవసరము.

### భామినీసుల్తానులు

పదునారవశతాబ్దమున, అనఁగ నన్నూరుసంవత్సరములకుముందు, ఇప్పటి నిజాంరాష్ట్రవిస్తీర్ణము నంతను అహమద్‌నగరము, బిజాపూరు, బీదరు, గోలకొండ యనుపేరుల వెవ్వేరుసంస్థానములై పరగుదానిని వెవ్వేరు మహమ్మదీయ సుల్తానులుస్వతంత్రించిపాలించుచుండిరి. సమయముదొరికిన పుడెల్ల వారిలో నెవరైనను విజయనగరముపై బడుటయు సంభవించుచుండెను. ఈసుల్తానుల రాజ్యములను విజయనగరరాజ్యమునుండి వేరుపరచునది నడుమ తుంగభద్రా

## బీదరు



అమీర్ బరీద్
(1504–1549)
అలీ బరీద్
(1549–1562)
ఇబ్రహీంబరీద్
(1562–1569)
ఖాసింబరీద్
(1569–1572)


## గోలకొండ



సుల్తాన్ కులీ కుతుబ్ షా
(1572–1543)
జంషీద్ కుతుబ్ షా
(1543–1550)
ఇబ్రహీం
(1512–1581)

నది యనుట జ్ఞాపకముంచుకోదగినది. తమలో తా మొక రొకరిపైబడి సుల్తానులు చిక్కినవరకు కొల్లకొనుటయు పొసగుచుండెడిది. కృష్ణదేవరాయలు తనయేలుబడి యందు విజయనగరము జోలికి రానీయక వారి నరికట్టి యుండెను.

ఆరాయని యనంతర మీ కార్యభార మంతయును బడుట యీరామరాజుపైననే. సదాశివుడు సింహాసన మెక్కిన యనంతర మీ వైరివర్గముయొక్క రాపిడి నడ్డుపెట్టుటకై రాముడు విజయనగరము కోటకు మరి యొకబురుజు నెక్కించినదే కాక, సామ్రాజ్యపు పొలి మేరలనుండు కొండలవరుసయం దక్కడక్కడ క్రొత్తగ దుర్గముల కట్టించియుంచెను. కృష్ణరాయలనాటి శిథిల మైనవానిని మరికొన్నిటిని సవరించి ఒకక స్నెపుడును తుంగభద్రపై నిడియుండెను.

బిజాపురపు దుడుకు—సామదానములు

సలకము తిమ్మడు దుర్నయమున వేంకటాద్రిని తెగ టార్చి రాజ్యమునకు కలిగించిన విప్లవము ఉత్తరమున నున్న సుల్తానులనోట నీరూర జేసినది. బిజాపురపు సుల్తా నుడగు ఇబ్రహీంఅదిల్షా 'ఇదిరాసమయ' మని ఆదవా

నిపై దండువెడలి ముట్టడించునదిగ తన సేనాని యసద్ఖా నుని కాజ్ఞనొసగి తనబలము నంతయు నిచ్చి పంపెను. రామరాజీసన్న ముందుగ నెరిగినవాడై తగిన సైన్య ముతో తమ్ముడు వేంకటాద్రిని వానిపై పంప నాఖానుడు కోటమాట యటుంచి వేంకటాద్రిని నెదుర్కొన తొడరినవా డయ్యె. ఆ తీవ్రమైన పోరున తన యోటమి నూహించి వెన్నుచూప వేంకటాద్రి, వానిని, వాని సైన్య ములను వెన్నంటి తఱుమ నుభయసేనలు ఎనిమిది మైళ్ల విలంబమున నారాత్రి నిల్చినవి. మరుసటిదినము మసుకు చీకటియున్నట్లే ఖానుడు నాల్గువేల యశ్వబలముతో నిద్రించుచున్న వేంకటాద్రిసైన్యములపై బడ నవి కకావికలుగ చెదరి పరతెంచెను. ఆతరుణమున వేంకటాద్రి యొక్క యేనుగులును, బొక్కసమును, రాణివాసమును శత్రువులచే చిక్కువడియె. వేంకటాద్రిమాత్ర మెట్లో తప్పి చెదరినబలముల మరల కూర్చుకొని శత్రుని బల ముల నెదిరింప మొనసెనుగాని ఖానుని గెల్చు సంభ్ర మము వానిబలమున కుత్సాహము నాపాదించు నను భయమున గాబోలు నాయత్నము నటుంచి జరిగిన యుదంతమును దెల్పుచు సహాయమును వేడి యన్నకు వార్తనంపెను. రామరాజు జాగుచేయక చాలినంత ద్రవ్య

బలముల నప్పుడే పంపి యుద్ధమును సాంగముగ సాగింపు మని పురికొల్పుచు వ్రాసినవాడు. ఇబ్రహీం అదిల్షా య ల్లుదిరించి వచ్చుటకు కారణ మా ప్రాంతములందలి భూస్వా ముల ప్రోత్సాహమై యుండవలెననియు, తన భృత్యా వర్గములోని యధికారులే కొందరు శత్రువునకు లోబడిన కారణమున నీయోటమి సంభవించి యుండ నగుననియు నూహించి, జాగరూకతతో సామదానోపాయముల నైనను సంధి కొడంబడి యాసమయమున కుటుంబమును మిగిలించుకొని నగరు చేరునటులు హెచ్చరించెను.

వేంకటాద్రి యీ హెచ్చరికను సరకుగొని అసద్ఖాను నికే దానోపాయమున సంధిరాయబారము నంప వా డందు కేయకొని తనప్రభువగు సుల్తాను ననుమతి వడసి వేంకటాద్రికుటుంబము నిచ్చి పుత్తెంచె. వెంటనే వేంక టాద్రియు తనబలపరివారములతో రాజధాని చేరు కొన్నవాడాయె.

బిజాపురపు సుల్తానుని చపలత

ఇంతటితో బిజాపూరుసుల్తానుని చపలత వదలిన ట్లగుపడదు. దానికి తగినట్లు అహమ్మద్నగరపు సుల్తా నును ఎదురుపై దాడివెడలనెంచి ఇబ్రాహీం అదిల్షాతో

నేకమై, తాను బీదరుపై బడునట్లును, అదిల్షా విజయనగర
మును తాక మొనసినపుడు దానికి అహమ్మద్‌నగరపు
సుల్తాన్ బుర్హాన్ నైజాంషా తోడై మెలగునట్లును సమ
యము గావించుకొని దాడివెడలి యున్నదున్నట్లు బీదరు
సంస్థానమునకు చేరిన గాంధారమనుకోట నుభయసేనలు
ముట్టడించినవి. ఆసుల్తానుడు భయకంపితుడై రాజ్యరక్ష
ణకు తగినసైన్యముల నియమించి సహాయము వేడ బిజా
పూరు వాని నాశ్రయించినపుడు వాడు వానిని చెరయం
దుంచెను. అపుడు ఇబ్రహీం అదిల్షా రెండవసారి విజయ
నగరముపై బడి కొంతరాజ్యము నాక్రమించెనని ఫెరిష్టా
వ్రాసియున్నాడు గాని యిది యతిశయోక్తిగ నుండనోపు.
విజయనగరమున కాసమయమున రాజ్యనష్టమైన ట్లాధా
రము లేవియు కానరావు.

## మిత్రభేదము

ఇంతవరకు సైరించి యూరకున్న రామరాజు విజృం
భించి మొనసెను. రెండవసారి బిజాపురపువాడు విజయ
నగరముపై బడుటకు అహమ్మద్‌నగరపు బుర్హాన్‌షాయే
కారకుడని యెరిగి వారిరువురికి మిత్రభేదమును కావింప
పన్నుగడను పన్ని సాధించుటకై తాను, తమ్ముడు తిరు

మలుడును, హండే హనుమప్పనాయడును వేర్వేరు సైన్యములతో, వేరువేరుదోవల నడచి అహమ్మద్‌నగరమునకు చేరిన కళ్యాణికోటపై బడి దానిని ముట్టడించిరి. అచట జరిగినయుద్ధము ఘోరమై యందు మహమ్మదీయు లోటు వడిరి. విజయనగరముపై అదిల్షాను పురిగొల్పిన అహమ్మద్‌నగరపుసుల్తాను బుర్హాన్‌షా హండే హనుమప్ప నాయనిచేత జిక్కి చెరగొనబడెను. విజయనగర సైన్యములు పరచుచున్న శత్రువుల వెంట నంటి అహమ్మద్‌నగరమును ప్రవేశించి సీమారామముల చెరచి రామరాజు నాజ్ఞచే తమకసి దీరునట్లు ఆప్రదేశమున నాముదపు చెట్లను విత్తించిరి. చేతజిక్కిన బుర్హాన్ అదిల్షా సఖ్యమును వదలుకొని వర్తించున ట్లొడంబడినందున వాడు చెర తప్పించుకొనియె. మిత్రభేదము కావింపవలెనని రామరాజు చేసికొన్న సంకల్ప మింతటితో సిద్ధికాంచెను.

ఇది రామరాజు అహమ్మదునగరపు సుల్తాన్ చేసిన దుడుకునకు కావించిన ప్రాయశ్చిత్తము. ఇక బిజాపూరు వానికైన శాస్తిని గూర్చి విచారింతము.

సంధి

అదిమొదలు అహమ్మదునగరపు బుర్హాన్ బిజాపుర అదిల్షాయొక్క సహవాసము చాలించుకొని రామర

కనువర్తియై మెలగుచు వచ్చెను. పిమ్మట నెంతో కాలము జరుగలేదు. ౧౫౬౩-౬౪ వ సంవత్సరము బురాన్‌షా తన యాస్థానమందుండిన "షాతహీర్" (Shat-ahir) అను వానిని గోలకొండసుల్తాన్ జంషిత్ కుతుబ్షాయొద్దికి రాయ బారిగ పుత్తెంచి తా మిద్దరు రామరాజుతో కలిసికొని బిజాపురపుసుల్తాన్ ఇబ్రహీంపై దండెత్తవలసినదిగ సందే శము నంపెను. ఇదియు రామరాజు పన్నుగడయే. ఈ దుడుకుమొనయికకు నెపము బురాన్‌షా అదిల్షాతో సఖ్యముతో నుండినకాలమున తనకు చేరిన మైదు ప్రాం లును వా డాక్రమించుకొనియుండినవానిని మరలరాబట్టు కొనవలెననుట. ఇట్లు ముగ్గురు నొడంబడి రామరాజు దక్షిణముననుండియు, గోలకొండసుల్తాన్ తూర్పుననుండి యు బిజాపురమును తాక సమకట్టిరి. బురాన్ తన సైన్యము లతో వానిరాజ్యముపైబడి కొల్లలాడి యదిల్షా సైన్య ములు ముమ్మారోడించెను. గోలకొండ సుల్తానుడు తూర్పు దిశనుండి మొనసి కాల్నీయనుకోటను తాకుటయె కాక గుల్బర్గావరకు వ్యాపించి, సాగరునొద్ద ఎట్‌గిర్ (Etgir) కోటను పట్టుకొన్నవాడాయె. వేంకటాద్రి తన యన్న రామరాజుపక్షమున దక్షిణముననుండి బిజాపురరాజ్య మును ప్రవేశించి రాయచూరుకోటను ముట్టడించి ఇబ్ర సైన్యముల నోడగొట్టి యచటినుండి తరిమెను.

ఇట్లోటువడిన బిజాపురపుసుల్తాను ఇబ్రహీం అన్యా
చేయునదిలేక యపుడు బెల్గాములో నెలకొనియున్న
రాజ్యతంత్రజ్ఞుడగు అసద్ఖాను డను వీరునొద్దకి మంత్రా
లోచనకై వెళ్లి సంప్రతించినపుడు ఈ పరాభవమునకు
మూలము గోలకొండసుల్తానుడగు జంషద్‌షా యని యను
మానించి మొదటివానిని సరిపెట్టుకొన్నట్లయిన మిగిలిన
భాగము కుదుర్చుట సులభమని తీర్మానించుకొనిరి. వాని
నుండి ముందాక్రమించుకొని యుండిన మైదానజిల్లాలు
మరల వాని కొసగబడెను. దానోపాయమున రామరాజు
సఖ్యమునే చేకూర్చుకొనవలెననుట యసద్ఖానుని రెండవ
మంత్రాలోచన. ఈయిరువైపుల కార్యసరణి సఫలమగు
నేని తన (బిజాపురము)నుండి గోలకొండసుల్తాను గడించు
కొన్న రాజ్యభాగమంతయు మరల రాబట్టుకొనుట
సులభమై యుండుననుట యసద్ఖానుని దృష్టి. ఈ పన్ను
గడ క్రమముగ సాధింపబడియె. అసద్ఖానుడు బలయు
తుడై బిజాపురపుపక్షమున దండువెడలి గోలకొండపై బడి
తాను ముందు సంకల్పించుకొన్నట్లు సుల్తాను నోడించెను.
శత్రువర్గమున మిత్రభేద మాపాదించుటకై రామరా
జెత్తినయెత్తు ఎట్లు ఫలవంత మయ్యెనో దీనిచే దే[illegible]
నగును. ఆరాయ డింతటితో పోనీయక మరల

మ్మదునగరపు బుర్హాన్‌షా నెక్కు-వెట్టి బిజాపూరు రాజ్యమునకు చేరిన గుల్బర్గాపై బడ పురిగొల్ప నొక సుల్తానుడు మరియొకసుల్తాను నోడించి పరచునట్లు చేసెను.

ఈతరుణమున నసద్ఖానుడు మృతుడగుట సంభవించినది. ఈసంగతి నెరిగినవాడై బుర్హాన్‌షా బిజాపురముపై మరియొకసారి దండెత్తుట కది సమయమని యూహించి సాహాయ్యమును వేడి రామరాజునకు తనరాయబారమంప నారాజు-ఇక చెప్పవలెనా-సంతుష్టుడై వారికి విభవసమగ్రములగు పారితోషికముల నొసగి గౌరవించి వారివేడికోలున కియ్యకొనెను. ఈసంగతి బిజాపూరు సుల్తాను డెరిగెనో లేదో. తనయాస్థానమందుండిన విజయనగరపు ప్రతినిధులపై నాగ్రహించి వారిని పరిభవింపమొనసినపుడు వారు చెప్పక బిజాపురము వదలి తమ రాజధాని చేరి బిజాపురమున తడవుచేసియుండిన ఇబ్రహీం తమ్ము పరిమార్చియుండు నను వార్త విన్నవించిరి. ఈయది రామరాజునకు బిజాపూరుపై రగులుచుండిన క్రోధాగ్నిని మరింత ప్రజ్వలింపజేసినది.

## విగ్రహము

'రామరాజు మిత్రమండలిచే ఇంతకుముందు పట్టబడి కల్యాణికోటను మరల బీడరు సుల్తానునకే

యిప్పించియుండెను. ఈనడుమ బీదరుసుల్తాన్ బరీద్‌షా రామరాజు నాశ్రయమును విడనాడి బిజాపురమున కనువర్తియై మెలగుచున్నందున నా కల్యాణికోటపై దండు వెడలి మరల దానిని పట్టుకోవలసినదని రామరాజు అహమ్మద్‌నగరపు బుర్హాన్‌షాకు జాబువ్రాసి పంపినవాడాయె. ఈసన్నాహమున బీదరు బరీద్‌షాయొక్క రక్షణకై బిజాపురపుసుల్తాను వెడలివచ్చుననియు, నాతరుణమున వానిపై కసితీర్చుకొన నవకాశము కల్గుననుటయు నా రాయని యాశయము.

తా మనుకొన్నతీరున బుర్హాన్‌షా తనబలములతో సన్నద్ధుడై రా, రామరాజు తనవైపున తగినబలములతో వేంకటాద్రి నంపెను. వేంకటాద్రి సైన్యములు బుర్హాన్‌షాబలములను కలిసికొనుటకై మార్గమున బిజాపురరాజ్యమును దాటి మొనసినపుడు సుల్తాను దక్షమై తరలివచ్చుచున్న సైన్యము నరికట్ట సాహసించెను. వేంకటాద్రిబలముల నెదుర్కొనినప్పుడుజరిగినపోరునందు ఇప్పేరి సదాశివనాయకుడు, వేంకటాద్రితో నున్నవాడు శత్రుసైన్యముల నోడించి వానియుద్ధోపకరణములను, నాహారసంభారములను కొల్లగొట్టి వశపరచుకొన్నవాడాయె. ఇంతలో రామరాయడే వేంకటాద్రిని కలసికొని బుర్హాన్

షా సైన్యముతో కళ్యాణికోటపై కేగ బిజాపూరుసుల్తాను బరీద్ షాసహాయార్థము బలములతో మరలవచ్చి తాకెను. తీవ్రమైనపోరు జరిగినది. తుదకు విజయనగరపు మిత్రమండలి యోటుపడి శత్రువులతో సంధియత్నములు గావింప నుద్యుక్తులౌసమయమున, తెప్పరించుకొని తెల్లవారకముందే యుభయుల సైన్యము లున్నదున్నట్టు ఇబ్రహీం అదిల్షాబలములపై బడినవి. అప్పుడు వెచ్చగ నుడుకునీళ్ల మజ్జనమునం దుండిన సుల్తాను డీ యుపద్రవమునుండి తప్పితే చాలునని 'బీర్ పరెండా' అను గ్రామములతట్టు పరచెను. వాని సైన్యము చిందరవందరలై గుడారములు, ఫిరంగులు, మందుగుండు సంబారములు నున్నచోటున విడిచి యురికినవి. ఆసామగ్రియంతయు జిగీషువుల చేబడెను. తుదకు కళ్యాణికోట పట్టుబడినది. ఈ జయము రామరాయని ప్రతాపకాంతికి మరియొక కిరణమై వెలసెను. ఇదియంతయు జరుగుట ౧౫౪౧-వ సంవత్సరము.

### శరణాగత రక్షణము

ఈనడుమ రెండేండ్లుగ గోలకొండసుల్తాను జంషద్ కుతుబ్షా రోగార్తుడై యుండి చిత్తవైకల్య మొదవ, క్రౌర్యవృత్తియే విశ్రాంతిగ నొద్దనున్నవారిని నిష్కారణ

ముగ హింసించి ప్రాణముల దీయ మొదలిడెను. ఇది ప్రజల సంత్రాసమున కెడమాయె. అంతఃపురమున నున్న తమ్ము లిద్దరు హైదర్ ఖాన్, ఇబ్రహీం అనువారు భయమంది బీడరున తలదాచుకొనవెళ్లిరి. ఇంతలో జ్యేష్ఠుడగు హైదరుఖానుడు మృతినొందెను. పిమ్మట కొంతకాలమునకు బరీద్‌షా అహమ్మద్‌నగరగోలకొండసుల్తానులతో పోరవలసివచ్చినపుడు తన్ను శరణుజొచ్చి యతిథియై వచ్చియున్న ఇబ్రహీం రాజకుమారుని యేనుగులను, ఇతరపరికరములను నాక్రమించుకొని వినియోగించుకొనజొచ్చె. ఈసన్న యెరిగి ఇబ్రహీం అల్పపరివారముతో విజయనగరమునకేగి రామరాజును శరణువేడ నారాజు మంచిదేయని మిక్కిలి గౌరవాదరములతో నా రాజయువకునికి స్వాగతమొసగి యతనిని రాజధానియందు నిల్పుకొన్నదేగాక యపుడారాయనియొద్ద భృతికై సేవించుచున్న అబిసీనియాదేశపువీరుడగు అంబర్ ఖా ననువానికి నదివరకు వశపరచియున్న క్షేత్రవృత్తులను ఇబ్రహీమునకు నిప్పించెను. ఇట్లుండ కొంతకాలమునకు అంబర్ ఖాన్, ఇబ్రహీం లిరువురు రాజవీథియందు నొకరి నొకరు సంధించుట పొసగెను. తనభృతికి నడ్డము వచ్చిన స్వార్థపరుడని యాఖానుడు ఇబ్రహీము నుపాలంభింప, రాజులా

తమ సొత్తు నిచ్చివచ్చినవారి వశముచేయుట కథకారులని మందలించి ముందు నడువజొచ్చెను. ఖాను డీవర్తనమును తనయెడల నౌదాసీన్యముగ భావించి వీరుడైనట్టియున వెంటనే ముఖాముఖి నిల్చి యుద్ధమున కుపక్రమించునదిగ ఇబ్రహీమును ధిక్కరించి పచ్చిగ దిట్ట నారంభించెను. ఇబ్రహీం తానెక్కియుండిన గుఱ్ఱముపైనుండి వెంటనే దిగి, కరవాలముతో నెదుర్కొన నుభయులకు పోరు పొసగినది. ఇబ్రహీం రాజకుమారుడు తనఖడ్గముచే నా ఖానుని తెగవేసెను. వాడు నేలబడినతోడనే యొద్దనున్న వాని సహోదరుడు ఇబ్రహీముపై మొనసిరా వాడు నదే తీరున సంహరింపబడినవాడాయె. ఈ యుదంతము గోలకొండచరిత్రకారు డొకడు వ్రాసియుంచియున్నదాని నుండి సేకరింపబడినది. ఫెరిష్టాసహితము నీయంశము తన వ్రాతయందు సూచించియున్నవాడు.

రోగార్తుడై యున్న గోలకొండసుల్తానుడు ౧౫౫౦-వ సంవత్సరమున నంతరించెను. వానివితంతుభార్య ఔరసుడుగనున్న సుభాన్‌కులి (Subhan Kuli) అను పదియేండ్ల చిన్నబాలుని గద్దియనెక్కించి వానిపక్షమున సైఫుఖాను ఏనుల్ ముల్కు అనువాడు ప్రతినిధియై రాజ్యమును పాలించునదిగ దిట్టపరచినది. వీడు వెనుకటిసుల్తాన్ బ్రతికియుండ

గనే రాజ్యభ్రష్టుడై యున్న కారణమున మిగిలియున్న రాజ వంశీయులు వానిపారుపత్తెము కూడదని పట్టుపట్టినవారైరి. రాజ్యమునకు మంత్రిగనున్న ముస్తఫఖాన్ విజయనగర మందు రామరాజునాశ్రయమందున్న (చిన్న సుల్తాన్ తమ్ముడగు) ఇబ్రహీముకు సింహాసన మెక్క రమ్మని వార్త నంపెను. తనయాప్తులయొక్కయు, తనహితుడగు రామ రాజుయొక్కయు నాజ్ఞగొని వేంకటాద్రి కొంతసైన్యము లతో వెంబడించిరాగా ఇబ్రహీం బయలుదేరి మార్గమున పానగల్లుచేరు వేళకు ముస్తఫఖాన్ వాని నెదుర్కొని గౌరవాదరములతో రాజధాని గోలకొండకు పిలుచుకొని పోయి సింహాసనస్థునిగ జేసెను. వేంకటాద్రి సైన్యము లపుడే విజయనగరమునకు మరలినవి. ఇబ్రహీం ముస్త ఫఖానునికి 'మీర్ జుమ్లా' యను బిరుదు నొసగి, పదవికి తగిన యుడుగరలను, పారితోషికములను ఇచ్చి మన్నిం చెను. అదివరకు సుభాన్ కులి సేనయం దుండుచువచ్చిన సలబత్ ఖాన్ అను సేనాని తన యధీనమందున్న మూడు వేల గుఱ్ఱపుఫౌజుతో ఇబ్రహీముకొలువున చేరినవా డయ్యె. ముస్తఫఖాన్ జనరంజకుడై పలుకుబడికలవాడై నందున నీయధికారపరివర్తనము సులలితమై నెరవేరెను.

బిజాపురపు సుల్తానుడు ౧౫౪౧-వ సంవత్సరమున నోటువడి పరితపించినవాడు విజయనగరముపై బలము పెంచుచు మరల పైబడ పదరుచుండెను. బురాన్ కల్యాణి కోటను జయించి వాని నోడగొట్టిన పిమ్మట సంవత్సరమునకే యాకోటను మరల సాధించు నెపమున బిజాపురపు సుల్తానుడు యుద్ధమునకు సన్నాహములు చేయసాగెను. ఈసంగతి బురాన్‌షా యెరిగి రామరాజునకు తెలుప రాయచూరు ప్రాంతముల నిద్దరును కలసికొని ముందు జరుగవలసిన కార్యక్రమముల నిర్ణయించుకొనిరి. షోలాపురపు ప్రాంతముల రాయచూరు ముద్గల్ పట్టణముల గెల్చి వానిని రామరాజు వశపరచుకొనునట్లును, ఇందుకు బురాన్‌షా తోడుపడవలయునట్లును నచట జరిగిన యొడంబడిక. విజయనగరమునుండి వేంకటాద్రి తనసైన్యముతో బురాన్‌షాను గలసికొని షోలాపూరును ముట్టడించెను. ఏకారణముననో వేంకటాద్రి విజయనగరమునకు మరలినవాడాయెను. బురాన్‌షా యొకడే షోలాపురమును సాధించుకొనుటకు కాకపోయెను. ఇంతలో బురాన్‌షా మృతుడగుటయు, వానిస్థానమున వాని యౌరసుడు హుసేన్‌నైజాంషా పట్టమునకు వచ్చుటయు సంభవించినది. అపుడు హుసేన్‌నైజాంషా ఇబ్రహీం అదిల్షాతో సంధి గావించుకొన్నవాడాయె.

రామరాజీసన్నాహములందు అహమ్మద్‌నగరపు సుల్తాను బుర్హానును చేపట్టి యుద్ధరించినట్లు సరసభూపాలీయములో చెప్పబడియున్నది. బిజాపురనగరమునకు రామరాజు యసుఫని రామరాజీయమున పేర్కొనబడియున్నాడు. అట్లున్నను కొంతకాలమునకే రామరాజు అదే బిజాపురపుసుల్తానుతో సఖ్యము సలవరచి గోలకొండసుల్తానుపై దండెత్తెను. ఈచిత్రము వివరించఁబడినది.

మరల మిత్రభేదము

ఇదజరుగుట ౧౫౫౫-వ సంవత్సరమున. అహమ్మద్ నగరపు సుల్తాను హుసేన్ నైజాం షాయును, గోలకొండసుల్తాన్ ఇబ్రహీం కుతుబ్షాయును, గుల్బర్గయొద్ద కూడి బిజాపురమునకుచేరిన [illegible]కోటను ముట్టడించి అహమ్మదు నగరమునకు చేర్చుకొనునదిగ తీర్మానించుకొనిరి. కొంతకాలమునకే యుభయసైన్యములు ప్రోగై గుల్బర్గను తాకి నిలిచినవి. గుల్బర్గకోట కొండగాకున్నను నగర్త లోతుగను కోటగోడ ఎత్తుగను నుండబట్టి యభేద్యమై యుండెను. బయటనుండి శత్రువర్గము నెలదినములు లెక్కసేయక పోరినను కోటలోని బిజాపురపుబలము సంధియలేదు. తుదకు వైరులెట్లో రెండుపట్ల దుర్గ

మును భేదించి లోపల జొచ్చుటకు మొనసిరికాని లోపలి సైన్య మెదుర్చ బయటిశత్రువు లోటువడిరి. అట్లయినను పోరు మానలేదు. మరియొకదినము కోటబయటనే రెండు బలములు పోరినవి. తుదకు కోటలోనిబలము వైరివర్గము నెదుర్కొని పోరిపోరి శ్రాంతమై తూగియాడ జొచ్చెను. కంఠగతప్రాణులై చేయునదిలేక వారు సుల్తాన్ అదిల్షాకున్న దున్నట్లు పరిస్థితుల విన్నవించిరి. తనయొకని సైన్యము ఇరువురు శత్రువులబలముల నెదుర్కొని నిలువలేకపోవుట గని చిరకాలము తన కపకార మొనర్చుచువచ్చిన రామ రాజునే సాహాయ్యమును వేడ సాహసించినవాడై యమూల్యమైన పారితోషికములతో విజయనగరమున నారాజు నొద్దికి తనరాయబారుల నంపెను. వెంటనే రామరాజందుల కియ్యకొని యుద్ధసన్నద్ధుడై విశాలబలములతో దాడివెడలి మార్గమున గోలకొండ సుల్తాన్ కుతుబ్షాకొక్క యుత్తరమును వ్రాసినవాడాయెను. ఆయుత్తర మిది:

"బిజాపుర అహమ్మదునగరములవా రనేక సంవత్సరములుగ స్పర్థతో నున్నారనుటయు, ఇరువైపులబలములు సమానములై యుండుచువచ్చిన కారణమున నొకరిపై నొక రెన్నిసార్లు యుద్ధసన్నాహము

కావించినను పర్యవసాన మేర్పడకుండుటయు, శ్రీవా రెరుగదగినది. తమపూర్వు లింతకాలము నీవివాదముల ప్రవేశించకుండ నుండి యిపుడు శ్రీవారు అహమద్ నగరపు హసన్ నైజాంషా సుల్తానుని పక్షము వహించి స్పర్ధకేవిధమగు కారణము లేనిదే తమబలముల బిజాపురపు సుల్తాను అదిల్షాపై త్రిప్పను తీర్మానించితిరి. ఆసుల్తానుడు ఇది కారణముగ మాసహాయసంపత్తిని కోరియున్నవాడు. మాసంస్థానమునకును, శ్రీవారికిని చిరకాలముగ సఖ్యము వెలయుచువచ్చినది. ఇప్పటిదుర్ణయమును వదలుకొని తమరు తమరాజధానికి మరలి యిరుపక్షములవారి మైత్రి తాము గడించుకొన మొనయుటకై యున్న పరిస్థితులను తమకు నివేదింప యుక్తమని తలచితిని. అట్లు మీరు మరలితిరేని వా రుభయులొకరితోనొకరు సంధి గావించుకొని యీమెడ తెగనిపోరు మానుకొందురు."

ఈ యిబ్రహీం కుతుబ్షా రామరాజునకు క్రొత్తవాడుగాడు. గోలకొండసుల్తాను గతించిన జంషద్ షాకు తమ్ముడు. అన్న రోగార్తుడై చిత్తవైకల్యముచే ననుచరవర్గమునే నిష్కారణముగ బాధింప మొనసినపుడు తాను భయమంది పరచి విజయనగరమున శరణువేడినది రామరాజునే. బిజాపురపుసుల్తాను తనసహాయమును వేడి వ్రాసిన

జాబును, రామరాజు వ్రాసినదియు నొకటేసమయమున ఇబ్రహీంచేతి కందపొసగినది. అప్పటికే రామరాజు ననుజ్ఞగొని తిరుమలుడు గుట్టపురాతులతో పానగల్ పరిసరమున ప్రవేశించి నాశనమునకు తొడగియుండెను. ఇదియంతయు నెరిగినవాడయ్యును ఇబ్రహీం కుతుబ్షా రామరాజునకు వెరచి హుసేన్ నైజాంషాతో చేసికొన్న యొడంబడికను నిరసించి రాత్రికి రాత్రి గుల్బర్గాలోని తన శిబిరమును వదలి పరికి చెప్పక తెలింగానాకు వెళ్లెను. తెల్లవారి హుసేన్ నైజాంషా లేచి చూడ, ఇబ్రహీం పలాయితుడయియుండుటగని, యిక నచట నిలుచుట తగవు కాదని తలచి అహమ్మద్నగరము చేరుకొన్న వాడాయి. ఇట్లు రామరాజు బిజాపురపుసుల్తానున కుపకరించుట కిది కడసారి కాదు. అయినుల్ముల్క్ అను వీరుడు బిజాపురమున ఇబ్రహీమునకు అనుచరుడై వర్తించుచున్నవాడు, తిరుగబడినపుడు వాని దేశమునుండి వెడలించి శాంతి నాపాదించుటకై కొంతబలమును వెంకటాద్రితో పంపెనది రామరాజే. ౧౫౫౭-వ సంవత్సరమున నిబ్రహీం మృతుడయ్యెను. కొడుకగు ఆలీ అదిల్షాకు పట్టముగట్టిరి. ఈయువకుడు తండ్రి కోల్పోయిన రాజ్యభాగమునంతయు మరల రాబట్టుకొనదలచి రామరాజుసఖ్యమును సేకరించు

కొనియుండెను. ఇట్లుండగ అలీఅదిల్షా చిన్నవాడగుట యెరిగి అహమ్మదునగరపుసుల్తాను హాసన్‌నైజాంషా యున్నదున్నట్లు విశేషబలములతో బిజాపురముపైబడ, వాని నెదిరించలేక పరచి సూరిగుల్బర్గపురాతు లంగరక్షకులై వెంటరా ఆలీ విజయనగరమే శరణ్యముగ తరలినవాడాయె.

ఆసమయమున రామరాజునకు పుత్రుడొకడు మరణించుటయు, అతడును, రాణియు శోకార్తులై యుండుటయు తటస్థించినది. ఆలీ అదిల్షా వారి ననునయించుచు తన్నే చిన్నకుమారునకు మారుగ గైకొనుడని వేడ, రాణి యందుకు సమ్మతించి మూడుదినము లంయువకునియెడల వాత్సల్యమును బరప పారితోషికములు నొసగెను. రామరాజు విపులబలముతో అహమదునగరముపై దాడివెడలి దానివినాశమును గావింప నాసుల్తాను రామరాజుబలముల నొక్కడే యెదిరించలేక పైథాను (Pithan) కు పరతెంచె. పిమ్మట కొంతకాలమునకే హాసన్‌నిజాంషా కల్యాణికోటను ఆలీ అదిల్షా కిచ్చి సంధిగావించుకొనెను.

ఇట్లు రామరాజును, అదిల్షాయును తమసైన్యములతో నహమ్మదునగరప్రాంతముల విడిచి మరలిరోలేదో, హాసన్‌నైజాంషా తన వెనుకటిచలము రగుల గోలకొండ

సుల్తానునితో నేకమై అంతకుముం దపుడే తాను సంధి కై అదిల్షాకుదానముగ విడిచిపుచ్చియున్న కల్యాణి కోటను వానినుండి మరల సాధించుకొనుటకై తన బలముతో వెడలెను. ఆలీ అదిల్షా యీసంగతి తెలిసి మరల రామ రాజుసహాయమును వేడ, విజయనగరమునకు రాయబా రుల నంపెను. వెంటనే రామరాజు తన బలములతో బిజాపురపు సుల్తానును కలసికొన్నవాడాయె. ఉభయు లును కుతుబ్షాకు జాబువ్రాసి అదివరకు చేసికొన్న యొ డంబడిక ననుసరించి వాడు తమవైపునకు రావలసినదగ సందేశము నంపిరి. ఆరాజయువకుడు హుసేన్ నైజాంషాకు వికటించి వర్తించుట కిష్టములేకున్నను రామరాజుమాట మీరి వర్తించినట్టయిన నేమిప్రమాదము సంభవించునో యని భయమంది చెప్పక వెడలి వారిరువురిని గుల్బర్గా యొద్ద చేరికొనెను. ఇంతలో బీడరుసుల్తాను బరీదుషా సహిత మీతట్టుకే వచ్చి చేరినవాడాయె. విజయనగరపు సైన్యములు దోవలో నడ్డమైన పల్లెలు పట్టణములు కొల్ల లాడి పాడుపరచినవి. హుసేన్ నైజాంషా యీవైరుల విజయధాటి నొంటిగ నెదిరించ లేనివాడై రాజధాని యహమ్మద్ నగరము రక్షణకై చాలినంతమాత్రము సైన్యము నిడి తాను తలదాచుకొనుటకై జునార్ కో

టకు తప్పి వెళ్లెను. ఇబ్రహీంకుతుబ్షా తానువిధిలేక పరప
క్షము చేరవలసి వచ్చెననియు, ఎటులైనను చేసి శత్రువర్గ
మును పోరువదలునట్లుచేసెదననియు,నభయసమాధానము
లనువ్రాసి హసన్ నైజాంషాకు పంపినవాడాయె. అదేతీరున
కుతుబ్షా తనమంత్రి ముస్తఫఖానుని రామరాజునొద్దకంపి
యుద్ధమును చాలించుకొని మరలినట్టయిన తనప్రభువు
కొండపల్లెమండలమును, దానికోటను రామరాజున కొస
గుటకు సంసిద్ధుడై యున్నాడనుట తెలుప నారాయ డం
డుల కీయకొని ఆలీ అదిల్షా బరీద్ షాలతో మరలెను. వారు
వారివారిరాజధానుల జేరికొనిరి.

అహమ్మద్ నగరపరిభవము

కల్యాణికోట నెటులైనను మరల సాధించుకొనవలె
ననునాశ అహమ్మద్ నగరపుసుల్తానునకు వదలలేదు.
ఈకార్యసిద్ధికై హసన్ నైజాంషా క్రొత్తపన్నుగడను వెద
కజొచ్చెను. ఇందుకై తనకొమరితెను కుతుబ్షా కిచ్చి
వివాహము చేయవలసినదిగను, వివాహమహోత్సవమును
కల్యాణి కోటపరిసరమునందే జరుపవలసినదిగను, నిర్ణయిం
చుకొని యుభయులు తమతమ పరివారములతో నాకోట
యొద్దనే విడిసిరి. పెండ్లియుత్సవములు నెలదినములు
మిగులసంభ్రమముతో జరిపి తుదకు కల్యాణికోటను

ముట్టడించిరి. ఈసంగతి తెలిసినవాడై బిజాపురపుసుల్తాను అపుడే విజయనగరమున కేగి రామరాజుసహాయమును వేడ నాతడు తనసైన్యములతో బయలుదేరి త్రోవన సుల్తాను బరీద్ షాను(బీదరుసుల్తాను)తోడు గైకొని యుద్ధరంగమును చేరెను. ఇంతలో పెండ్లివియ్యపువారగు హాసన్ నైజాంషా, ఆలీకుతుబ్షాల ఏడునూర్ల ఫిరంగులును, ఐదువందల ఏనుగులును సమరరంగమునకు సాగివచ్చుచు, కల్యాణికోటకు నాలుగుపరుగులదూరములో నున్నపుడు బోరున వర్షము కురిసినందున నాబరువైనయుద్ధోపకరణము లారేగడబురదలో చిక్కి ముందుకు తరలిరావాయె. ఇది యటుండ రామరాయనితమ్ముడు వేంకటాద్రియు, జగదేవరాయడును, అయినుల్ ముల్కు అనువీరుడును, ముగ్గురును నొకటిగచేరి ఏదునైదువేలగుఱ్ఱపుదళము,ముప్పదివేల పదాతులు తోడరా గోలకొండ దక్షిణప్రాంతముల జొరబడి యాక్రమించ మొనసినా రనువార్త సుల్తానుకుతుబ్షాకు తెలియవచ్చినది. ఈయుపద్రవము నెరిగి వాడు తనమామ యగు హాసన్నిజాంషాతో మంత్రాలోచనచేసి, కల్యాణికోట ముట్టడివదలి తనరాజధానికి మరలెను. ఇంతటితో నచటియుద్ధసన్నాహ మంతరించవలసివచ్చినది. హాసన్ నైజాంషా తనయనుచరులగు కాసింబేగు, మౌలానా

యినాయతుల్లా అనువారిని రామరాయని యొద్దకు సంధి రాయబారమునకై పంపెను. అపుడు కుదిరినసంధి సమయము లివి :

(౧) కల్యాణికోటను తెగుపార ఆలీ అదిల్షాకు వదలి వేయుట. (౨) తనకు (హసన్ నైజాంషాకు) సహాయుడై వచ్చినదురీయా ఇమాదుల్ముల్కు బలమునకు సేనానియై పరపక్షమువారికి తీవ్రమైన యుపద్రవముల నాపాదించిన జహంగీర్ఖానుని చంపుట. (౩) హసన్ నైజాంషా తానే రామరాజుసన్నిధికి వెళ్లి యారాజన్యుని యొక్క యున్నతిని తాను పరిగణించుటకు సంకేతముగ నాయన చేతినుండి తమలపాకు పుచ్చుకొని మరలుట.

తనరాష్ట్రము శత్రులదాడినుండి మిగిలించుకొనుటకై హసన్ నిజాంషాయిట్టి పరిభవసమయములకైనను ఒడంబడవలసి వచ్చినది. తనశిబిరముననున్న జహంగీర్ఖానుని తానె తనకింకరులచేత చంపించెను. అటుపిమ్మట రామరాయని శిబిరమునకు వెళ్ల నారాయుడు లేచివచ్చి కరమిచ్చి లోపలికి పిల్చుకొనిపోయినతోడనే సుల్తాను డాపరాభవమున కోర్వలేక లోపలికంటు పై గొన హైందవుని చేయి తాకుటతో తనకు మైలసోకెనో యన్నట్టు చెంబుతో నీరు తెమ్మని చేతులు కడిగికొనెను. ఇది చూచి

రాయడు పొంగివచ్చు కోపము నణచికొని వీడు తిన కభ్యాగతుడై యుండె తప్పించుకొనెగాని, కాదేని వాని రెండుచేతులు తెగగొట్టించి వానిమెడకు తగిలించియుండు నని పౌరుషమాడె తానును చేతులు కడుగుకొన్నవా డాయె.

కడచిన రెండు సన్నాహములందు విజయనగరపు సేనలు తమ విజయధాటిచే అహమ్మద్నగరమున కాపా దించిన యుపద్రవము లనేకములనిమాత్రము ఫరిష్టా సూచించియున్నవాడు. చిరకాలము పెరుగుచు వచ్చిన కంటుతో నీదుండగములు సల్పినట్టున్నది. ఈసన్నాహ ములందు హైందవులు మసీదుల కూలద్రోచిరనియు, కొన్నిటిని గుఱ్ఱపులాయములుగ నుపయోగించిరనియు, కొరానును లక్ష్యపెట్టలేదనియు, స్త్రీలమానము తీసి పరిభ వించిరనియు, మహమ్మదీయుల పవిత్రస్థానముల జొరబడి యందు తమ విగ్రహముల ప్రతిష్ఠించి పూజలు సల్పిన ట్టును సూచించియున్నాడు గాని యీతుదిభాగమును గమ నించినపుడు నీవివరణమంతయు నతిశయోక్తిగ నుండునని తోచుచున్నది.

బిజాపురమున కుపకృతి

సుమారు ఈదేసమయమున రామరాజు బిజాపురపు సుల్తానునకు మరియొకయుపకృతి గావించుట పొసగినది.

అదిల్‌షాయొక్క తండ్రి జీవించి యధికారమున నున్న పుడు తనతమ్ముఁ డగు అబ్దుల్లాయను రాజన్యుని మొదల ననాదరము చూపుచున్న కారణమున వాడు రాజ్యమును వదలి గోవాకు పోయి యచట నెలకొనియుండెను. వాని యాప్తులు కొందరు వానిలేనసత్తి విజాపురాసింహా సనము నెక్కుమని పురిగొల్ప పోర్చుగీసువారి సహాయముతో కొంతసైన్యముం దీసికొని బిజాపురముపై దండువెడలెను. అపుడు ఆలి అదిల్షా మరియొకసారి రామరాజు సహాయము కోర నందుపై విజయనగరమునుండి పదునైదువేలసైనికులు వచ్చి యబ్దుల్లాను తరుమఁగొట్ట నతఁడు అహమ్మదు నగరమునకు శరణమునకై పఱిగెత్తెను. అక్కడిసుల్తాన్ బురాన్‌షా వాని ననునయించుటకు మారుగ చెరలో నుంచినవాఁడాయె. పిమ్మట కొంతకాలమునకు ముక్తుఁడై తనపూర్వనివాసమగు గోవాకు మరలి యచట కైస్తవుఁడై యంతరించెను.

అహమ్మదునగరపు సుల్తాను హసన్ నైజాంషా ఆతని అల్లుడు గోలకొండ సుల్తాన్ ఇబ్రహింకుతుబ్షా లిద్దరికి రామరాజు వెనుకటి సన్నాహమందు గావించిన పరాభవము హృదయశల్యమై వేధించుచుండె కాబోలు. ఆ తరుణముననే గోలకొండ సంస్థానపు దక్షిణ ప్రాంతములం

దున్న కోటల కొన్నిటిని రాయలబలము లాక్రమించు
కొని యున్నందునను నాసుల్తానుడు రామరాయలపై
నలుక వొడమి విముఖుడై యుండెను. మామ హాసన్
నిజాంషా రామరాయనికి పీరవైరియనుట చెప్ప నవసర
ముండదు.

ఈయధ్యాయమున వివరించిన తీరున తన మొదటి సంకల్పమును సాధించుటకునై రామరాజు సుల్తానుల వర్గమున మిత్రభేదమును కలిగించుచు తాను తటస్థుడైనట్టే యుండి ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కసుల్తానుపక్షము చేరి యెదిరిని మార్కొని పరాక్రమించి నిల్వగల్గుట లోలోపలవారందరికిని యారాయనిపై నుద్వేగమును పుట్టించినది. ఆతనియెదయందు తన విజయసరణి పొగరును పుట్టించియుండినను పుట్టించియుండనోపు. ఈ మూలము సుల్తానులందరు నొకటిగ కూడి సంప్రతించి తమబలములనంతయు పోగుచేసుకొని యెట్లైనను రామరాయని మట్టుబెట్ట సంకల్పించిరి. ఆసంకల్పమే తాళికోటసమరరంగమును రామరాజునకువీర స్వర్గసాధసోపానముగ మార్చినది.

---

# పదుమూడవ యధ్యాయము

---

## వైరివర్గపు మేలుకొల్పు

తే. అఖిలసమ్మతి గావించు మనదియు, బహువి
చారములు దోఁప నం దొక్క సరణి నడపు
నదియు నొఁగానునాఁ జేయునదియు నివ్వి
ధంబు లుత్తమమధ్యమాధమము లండ్రు

—భాస్కరరామాయణము. యు. ౪౯.

ఇంతవరకు దూరపుచూపు లేక స్వార్థపరులై యొకరి పైనొకరు పడి పోరాడుచున్న మహమ్మదీయసుల్తానుల వర్గమునకు రామరాజుచే గల్గినపరాభవమే కలికమై కనులు విప్పఁజొచ్చెను. అందరు కలసి మొనసినగాని రామరాజు నెదిర్చి విజయమరనంద సాధ్యము కాదను తత్త్వము వారికి గోచరమాయె. హసన్ నిజాంషా రామరాజుచేత బడుచువచ్చిన నవమానపుకడగండ్లు వానికి హృదయకంటకములై నడుమ నాటుకొన్న చలమును పెంచి యుండనోపు. రామరాజుసైన్యములు వాని రాజ్యమున ప్రవేశించి కొట్టి కొల్లలాడిన సమయము లెన్నియో.

తక్కినముగ్గురు సుల్తానులతో సంప్రతించి, యొక్కటిగా మొనసి రామరాజును తాకి వాని పొగరు నణచుటకు మొదట మొనసినవాడు అహమ్మద్ నగరపు సుల్తానుడని కౌటో వ్రాసియున్నాడు. ఫెరిష్టా వ్రాతల ప్రకారము బిజాపూరుసుల్తాను డగు ఆలీ అదిల్షాయే దీనికి మూలమని తెలుచున్నది. తండ్రి చచ్చి, తాను సింహాసనస్థుడై యున్నకాలమున నిదే అదిల్షాపైబడి వాని పదభ్రష్టునిచేసి రాజ్యమునుండి వెడలనడచిన యపకారి ఈహూసన్ నిజాంషాయే. ఆవిషాదసమయముననే ఆలీ చేయునది లేక రామరాజునొద్దికి వచ్చి శరణువేడుట. రామరాజు వానిని గౌరవాదరములతో రాజధానియందు నిల్పుకొని పుత్రవాత్సల్యమున మన్నించి చేరదీసినదపుడే. అంతే కాక, హూసన్ నిజాంషాను ప్రతిఘటించి ఆలీని మరల సింహాసన మెక్కించుటకు బలములతో వెంటబోయినవాడు వేంకటాద్రి. ఆలీ పినతండ్రియగు అబ్దుల్లా రాజన్యాయము అసద్ ఖానుని తోడుగా గొని వాని పదభ్రష్టునిచేయ మొనసినపుడు తన్నాదుకొని సింహాసనము మిగిలించి యిచ్చిన యుపకారము రామరాజొనర్చినదే. కల్యాణి కోటను రెండుసార్లు ఆలీ అదిల్షా కిప్పించినవాడును నారాయడే. ఆయనకును ఆయన రాణికిని ఆలీ యందున్న పుత్ర

వాత్సల్యము గాఢమైనది. అట్టుండియు రామరాజును వంచుటకు ఆలీ సమ్మతించినా డనుటయే యాశ్చర్యము. అందరికన్న ముందు తానే యందుకు మొనసినాడన్న నమ్ముటకే కష్టము. చరిత్రయందు మరియొక చోద్యము కానవచ్చుచున్నది. ఇంతటి యుపకారజాలమును మరచుటకియ్యది కారణమైయుండునా? ఒకానొకప్పుడు ఆలీ అదిల్షా రాయబారి యొకడు విజయనగరపు దర్బారునకు వెళ్లియున్నకాలమున రామరాజు వినోదములుసల్పిన దొమ్మరివారికి ఆహారమునకై కొన్నిపందుల నిప్పించినట్లును, అది యానాహేబు చూచి పందులుతినునట్టి హిందువులురోతవారని యౌచిత్యమెరుగక నారాజునెదుట తూలనాడెననియు, అందుకు రాజు వానినపహసించుచు, పందులతినుటయే రోతయైనయెడల వానివిష్ఠములోని గింజలనేరుకొని తినుకోళ్లను మ్రింగువా రెంతటిరోతవారోయని యుపాలంభించి వానియెదుట పరీక్షించి చూపినందుకు వాడు కుపితుడై అదిల్షాయొద్ద కేగి మహమ్మదీయమతమునే రామరాజు తూలనాడెనని మొరబెట్టినట్టును, ఆమూలమున గల్గిన చలముచే నీయుద్వృత్తమునకు ఆలీ మొనసినట్టును గాథ యొకటి యున్నది. అది నిజమైయుండునా? ఎటులైననేమి, రామరాజు రాజ్య

మందు అనువది రేవుపట్టణములు, ఐశ్వర్యవంతములైన జన పదములు కలిగి విశాలములైన బలముల నేకరించియున్నా డనియు తెలిసి నలుగురు సుల్తానులు కూడి యొకటైన్మై మాఱొక్కన్న గాని కార్యము విఫలమగునని హాసన్ నిజా మునకో, అదిల్షాకో మొదట తోఁచియుండవలె నను వరకు నిజము. ఆలీఅదల్‌షా తన సేనానియగు ఇఖ్టార్ ఖానుని సుల్తానునొద్దకి రాయబారము పంపి యడుగ వాఁడీసన్నా హమునకు కలసిరాను సమ్మతించుటయేకాక హాసన్‌నిజాం షాకును, ఆలీఅదిల్షాకును షోలాపుర పువిచారమున చాల కాలమునుండి వచ్చినస్పర్ధలు సవరించి వారిసఖ్యమును బలపరచుటకును మొనసి తనమంత్రియగు ముస్తఫఖా నుని హాసన్‌నిజాంషాయొద్దికి రాయబారము నంప వాఁడుభయులకు సఖ్య మలవరచుటతోఁగూడ బాం ధవ్యము లొనగూర్చుట భద్రమని తలచి యాసుల్తానున కాసందేశము నివేదించెను. ఫెరిష్టావ్రాతప్రకారము ఆసందేశ మిదియే:

"భామనీసుల్తానులకాలమున అందరు కూడి యొక రాజుయొక్క కేంద్రప్రభుత్వమున కనువర్తులై యుంటిరి. అప్పుడు రామరాజు బలములతో సమానములైన బల

ముల నిల్పి నిర్వహించుట మీకు సాధ్యమై యుండెడిది. ఇపుడన్ననో యట్లుగాక నలుగురును వేర్వేరుగ స్వతంత్రించి వర్తించుచున్నారు. అందరికి సామాన్యశత్రుడగు వాని నెదరించవలె నన్న, నలుగురుచేరి యొద్దికతో పని చేయుట యవసరము. కర్ణాటకమున నధిపతుల నందరిని రామరాజు వశవర్తులనుగ జేసికొనియున్నవాడు. మహమ్మదీయరాజ్యములందు ఈరాజుయొక్క ప్రభను సమయించి మసీదులును, పవిత్రస్థానములును నాస్తికులగు హైందవులు చొచ్చి యగౌరవపరచకుండునట్లు చేయుట మనకు ధర్మము. కాదేని సర్వేశ్వరుడు రక్షణకై మన వశము చేసియుండు ప్రజావర్గ మిడుమలపాలు గావలసి వచ్చును.”

ముస్తఫఖాను రాయబారము సంపూర్ణముగ ఫలవంతమై అహమ్మదునగర బిజాపూరు నవాబులసఖ్యమునకు కుదురయ్యెను. వివాహసంబంధము లపుడె నిర్ణయింపబడినవి. హుసేన్ నిజాంషాకుమార్తెను ఆలీ అదిల్షాకు నిచ్చునట్లుగను, షోలాపురము అల్లునికి సరణముగ నొసగునట్లును, ఆలీ అదిల్షాచెల్లెలు ఫాలాంబీబి హద్యాసుల్తానాను హుసేన్ నిజాంషా కుమారున కిచ్చి వివాహము జరుపునది,

గను నిశ్చయమైన దపుడే. ఈవివాహబంధములు రామ రాయని మట్టగించుటకు గీఱబంధములై పరిగణింప బడెను.

ముస్తఫఖాను డచటినుండి బిజాపురమునకు వచ్చి లగ్నపత్రికల వ్రాసి రామరాజును మార్కొనుటయందు కట్టుగదలకుండునదిగ సుల్తానుతో ఘోరప్రమాణము చేయించినవాడాయె. వెంటనే పెండ్లిండ్లును, ఉత్సవము లును, అహమ్మద్‌నగరమునను, బిజాపురమునను, మహో వైభవసంభ్రమములతో వెలయించిరి. ఈముగ్గురి సుల్తా నులతో బీదరుబరీదుషాసహితము కలసికొనెను.

---

# పదునాల్గవ యధ్యాయము

---

## సమరసన్నాహము

క. రెండుబలంబులవారలు
నొండొరులకంటెఁ జాల నుక్కుమిగిలి యొం
డొండె కడంగుచు నుజ్జ్వల
చండస్థితి నొప్పి రపుడు జగతీనాథా!

— భారతము, భీష్మపర్వము.

ఈ యుదంతమంతయు రామరా జెరిగి తనపక్షమున తగినసన్నాహము చేయ సమకట్టి కృష్ణానది దక్షిణతీరము మొదలు సింహళద్వీపమువరకు తన సామంతవర్గముల నుండి బలముల ప్రోగుచేయ మొదలిడెను. అపుడు మధుర నేలుచుండినవాడు విశ్వనాథుని కొడుకు కృష్ణప్పనాయకుడు. కార్యాంతరములచే తాను వెడలివచ్చుటకు కాక తనమంత్రి అరియనాథమొదలియారును తగిన సైన్యముతో పంపెను. ఆపరివారమందు కర్ణాటకదేశాధిపతి యగు బసవరా జనువీరుడును కలసివచ్చినట్లు పాండ్యశాసనములు పుదుక్కోటలో నీవల వెలువడినవి.

ఈనడుమ ఆలీ అదిల్షా రామరాజునొద్దకు తనరాయ బారి నంపి బిజాపురమునుండి అంతకుముందు తానాక్ర మించుకొనియున్న యట్ఘిర్, బాగల్కోట, రాయ చూరు ముద్గల్దుర్గముల తన కొప్పచెప్పవలెనని రాజ్య కారణమునకై సందేశమునంప నారాజా రాయబారిని పరి భవించి నగరునుండి వెడలనడచెను. సుల్తానులనొద్దికలను భద్రపరచి మొనయించుటకిది యాంతరుణమున సన్నిహి తకారణ మాయెను.

పిమ్మట నలుగురు సుల్తానుల సమాగమము బిజాపు రమునొద్ద నయినది. ఆసమయమున ఆతిథ్యమంతయు అదిల్షాదే. ఈఘట్టమందు మహారాష్ట్రులు వ్రాసియుంచిన చరిత్రాంశము భిన్నించుచున్నది. ఆలీ అదిల్షా రామరా జుపై చేయివేయతలచుట కూడదని వికటించినట్లును, నాపై తక్కినముగ్గురును తమసేనలతో తన రాజ్యమును దాటి విజయనగరమున చేరుటకై నను దోవనీయుమని వేడ కాదని నిరసించెననియు యిందలిసారాంశము. ఇందే మాత్రము సత్యమున్నదోగాని తుదకు ఆలీ అదిల్షా మహా మ్మదీయమిత్రమండలితో చేరి రామరాజు నెదిరించుటకు సంసిద్ధుడైనది నిజము.

అందరు సుల్తానులు కలసి తమతమబలములతో కూడుకొన్నవారు ౧౫౬౫ సం. డిసెంబరు ౨౬-వ తేదీన అక్కడినుండి దక్షిణోన్ముఖులై వెడలిరి. ఈమిత్రమండలి సైన్యమున పదివేలగుఱ్ఱపుదళము, మూడువేలకాల్బలము నున్నట్టు అప్పటిపోర్చుగీసువారు వ్రాసియుంచినవ్రాతలు తెల్పుచున్నవి. అశ్వసైనికు లారువేలకు మహారాష్ట్రులు తురకలతో చేరియున్నట్లును కననగును. ఆకాలమున నీస్పర్ధకు మహమ్మదీయమతవైషమ్యము కారణము కాద నుట కిది దృష్టాంత మనజెల్లును. వైరివర్గపుబలము లందలి వీరవరులనుగూర్చి విమర్శింతము. గోలకొండ ముస్తఫఖానుడు మొనగాడని పేరుగాంచినవాడు. తన సుల్తానునకు సచివుడన్నను సేనానియన్నను వీడె. ఆకా లపు తురుష్కవీరలోకమున నగ్రగణ్యుడని లెక్కింపబడిన వాడు. ఇతనిపేరు కమాలుద్దీన్. హుసేన్ ముస్తఫయను నది బిరుదుమాత్రమే. తనదేశమును కాపాడనెంచిన యుపకారజాలమునకై సుల్తానుడు మెచ్చి గౌరవించి యిచ్చిన బిరుదావళి గోలకొండముఖద్వారముపై చిత్రింప బడియుండుట నేటికిని కననగును. మౌలానాఇనాయతుల్లా అహమ్మద్‌నగరమునకును, కిష్వార్ ఖాన్ బిజాపురమున కును సేనాధిపతు లనబరగినవారు. రిఫాయత్ ఖాన్ అను

మరియొకవీరుడు గోలకొండసుల్తానుని భృత్యుడు. దక్షిణ భాగమున కొంతప్రాంతమును తనప్రభువునకు గడించి యిచ్చినట్లు వీనికి ఖ్యాతి. ఈసంయుక్తబలమందు మహారాష్ట్రులారువేలమంది అశ్వసైనికు లుండినట్లు ముందు చెప్పబడియున్నది. యశ్వంతరావు, భోజమల్లునాయకుడు, దేవనాయకుడు, విశ్వాసరావు, కోళేరా వనుట యిందలినాయకుల పేర్లు. రామరాజుబలమున డెబ్బదివేలగుఱ్ఱపుదళము, తొంబదివేలపదాతులు నుండి పోరినట్లు ఫెరిష్టా వ్రాసియున్నాడు. పేరుతెలియని గోలకొండచరిత్రకారు డొకానొకడు వ్రాసియుంచిన వ్రాతను జూడ గుఱ్ఱపురౌతులు లక్ష, కాల్బలము మూడులక్షలునున్నట్లు వ్యక్తమగుచున్నది. 'కౌటో' 'ఫేరియా' యనుపోర్చుగీసు ఐతిహాసికులు, అశ్వదళము లక్షయనియు కాల్బలము ఆరులక్షలనియు లెక్కగొని గుర్తించియున్నారు. స్వయముగ రామరాజును, తమ్ములు తిరుమలవేంకటాద్రులు నీసేనలకు నాయకులై నిల్చి పోరినవీరులు. రామరాజున కపుడు వయసు డెబ్బది యని ఫెరిష్టా వ్రాసియున్నాడు. బురాని మసిర్ (Buran-i-Ma'asir) అను మహమ్మదీయుడు వ్రాసియిచ్చిన కైఫీయతునందు ఎనుబదిసంవత్సరము లని గుర్తింపబడియున్నది. పోర్చుగీసువారు వ్రాసియుంచిన వ్రాతల గంటె

మేని యారాజు వయ స్సపుడు తొంబదియారేడులని యేర్పడును. వీరు పలుమారులు విజయనగరమున రాకపోకలు చేయుచు సమక్షమున పలువిషయములగూర్చి యారాజుతో సంప్రతించుచు నున్నవారైనందున వీరి యూహాసత్యమునకుసన్నిహితతరమైనట్లొప్పుకొనతగినది.

శుద్ధాంతమున వీడ్కోలు

ఈసమరకర్కశుడు యుద్ధమున కుపక్రమించి వెడలుటకు పూర్వము రాణివాసమున నప్పటికి సజీవయై యున్న తల్లిని సతీవర్గమును ననునయించినయుదంతము చెందోర్కర్ అను మహారాష్ట్రచరిత్రకారుడు తాను వ్రాసియుంచిన 'విజయనగరనాశ' మనుగ్రంథమున నిట్లు వివరించియున్నవాడు. రామరాజు పట్టపురాణి పేరు సత్యభామ. వెలగలభూషణముల నొసగి యామెను పరితోషపెట్టెను. దైవచింతామణి రెండవ భార్యపేరు. ఆమెకు నట్లే పారితోషికముల నొసగి రంజింపజేసినపిమ్మట మానమోహిని యను మూడవభార్య శుద్ధాంతమునకు వెళ్లి యామె నదేతీరున ననునయించి వీడ్కోలు నందినవాడాయె. ఉద్యానవనములనుండి వివిధములగు ఫలరాసుల తెప్పించి వారందరి కొసగెను. కడపట తన తల్లి చంద్రశాల యంతఃపురముజేరి దర్శింప నాసాధ్వి,

కొడుకును పుణ్యాహవాచనముల నాశీర్వదించి మంగళ
ముఖులతో దృష్టితీసి పారవైచెను. మహమ్మదీయసుల్తానులు
శత్రువర్గము తన్నెదిరింప సమకట్టుటయు, వారివలన
బ్రాహ్మణులకు కల్గుచుండిన యుపద్రవములును గూర్చి
యు విశదపరచి వారి నిగ్రహమునకై తా నుపక్రమింప
బోవునట్టును తనవిజయమునకు దీవనలనేడ నాసాధ్వీమ
తల్లి, యనుమానించి యెదిరిపక్షము సంధి చేసుకొనుట
యుక్తమైయుండునేమోయని సూచించినది. ఈ ప్రథమాట
రాజున కాసన్నాహసమయమున రుచింపదయ్యె. అంతవి
తుద కామె తనసమ్మతి నొసగి యాశీర్వదించి పుత్తెంచెను.
అటుపిమ్మట విశ్రాంతికై పరుండినపుడు తూగుపట్టిన సమ
యమున తన చెవిపోగుల నెవరో పెరికి సింహాసనమునుండి
బయటికీడ్చినట్లు దుస్స్వప్నములు కనెనట. వెంటనే రాజు
పురోహితులను, జ్యోతిషికులను రప్పించి యడుగ వారు
భయములేదనియు, శత్రువులు నిర్జింపబడుదురనియు చెప్పిరి.
నారికేళఫలములను, ఉంగరలను, పదివేలనిష్కములను
వారికి దక్షిణగా నొసగి యారాజు మన్నించెను.

ఆ య త్త త

తురకలబలము కృష్ణానదిని దాటి దిగి రానీయకుండు
నటుల నదియొక్క కుడిగట్టుపొడుగున సేనల నిల్పి కాయ

వలసినదిగ నాజ్ఞాపించి యిరువదివేలగుఱ్ఱపుదళమును ఐదునూర్ల యేనుగులును, లక్షపదాతులును ఇచ్చి రామరాజు తిరుమలు నంపెను. వానివెంబడి యంతేబలవర్గముతో నన్నమాటగొని వేంకటాద్రియు వెడలినవాడాయె. రాజధానియందు మిగిలిన బలములతో కడసారి రామరాజే స్వయముగ బయలుదేరెను. గుఱ్ఱములు, ఏనుగులు, ఒంటెలు, పశువులు, కల్లంగపులు, వేటపరికరములు, బొక్కసము, ధాన్యరాసులు, ఇతరసంబారములన్నియు నొకేసారి రామరాజు తనశిబిరమునకు సాగించినట్లు లామహారాష్ట్రచరిత్రకారుండే వ్రాసియుంచియున్నవాడు. విజయనగరమున గుఱ్ఱము నుంచుకొన్న యొక్కొక్కపౌరుడును తనసవారితో సేనను కలసికొన నాజ్ఞాపింపబడెను.

తురకల సైన్యము తాళికోటదాటి కృష్ణానదియుత్తరమున విజయనగరరాజ్యపుపొలిమేరల జేరబడి పాడు చేయ నారంభించినది. తిరుమలవేంకటాద్రులు నదికిదక్షిణపుగట్టుపొడవున మోర్గముల నిర్మించి వానిపై శతఘ్నుల నునిచి సాయత్తము చేయుచుండిరి. ఉత్తరమునుండి తురకలసైన్యము దిగివచ్చుచుండ కృష్ణానదిదాటుట కుండినయొకటేరేవును హిందూబలము లాక్రమించియుండుట వారికి కన్పట్టెను. చారులనంపి మరియెక్కడనైనను నదిని

దాటుట కనువైనచోటును వెదకించిరి. కాని యట్టిది దొరకదాయె.

ఉపాయాంతర మేమియని నిర్ణయించుటకు సుల్తాను లందరు సంప్రతించి మంత్రాలోచన చేసుకొన్నవారైరి. దాటుట కొకరేవు వెదకుటకో యన తమసైన్యము లుత్తరపుగట్టువెంబడి నడుచుచుండవలసినదిగను, అట్లు జరుగుచున్నపుడు హిందూసైన్యములు ఎదురుగట్టు దోవన తమ్ము తాకుటకై తమశిబిరము కదలివచ్చుననియు, నాతరుణమున నున్నదున్నట్టు తమబలములు వెనుకకు మరలి రేవు నాక్రమించుకొనవలెననియు నీమంత్రాలోచనమందు తీర్మానమగుట. ఈపన్నుగడ ననుసరించి తురకలసైన్యము తాకోతాకు మూడుదినములు నది యుత్తరపుగట్టున పరచినవి. హైందవసైన్యము వానిని దృష్టియందుంచి నదికి దిగబడుసమయమున మార్కొనుటకై తమ తమ పట్టుల వదలి దక్షిణతీరముపొడుగున చాల దూరము సాగివచ్చుచుండుసంతలో వా రాక్రమించుకొని యుండిన రేవునకు కాపు లేకపోయెను. శత్రుబలము లీతీరున విజయనగరసైన్యముల నేమరించి ముందు నడుచుచున్నవారు గిరుక్కున తిరిగి హిందూసైన్యములు తెప్పరించుకొని మరలుటకుముందే నది రేవును ముట్టడించి దాటి

దక్షిణమునకు జొరబడినవి. ఇట్లు నదిని దాటినవారిలో అహమ్మదునగరపుసుల్తాను హుసేనునిజాంషా మొదటి వాడు. పిమ్మట నిరుసేనలు మార్కొన్నచోటు నదికి కొన్నిమైళ్ల దూరమందుండిన రక్షస్, తంగడిగి యను రెండుగ్రామముల నడుమ బయలు. ఈసమరమున కిది కురుక్షేత్రమో యన చరిత్రయందు 'రక్షస్‌తగ్గి'—రక్షస్ తంగడి యని పేర్కొనబడుట యీకాలముననే. ఇంతలో రామరాజు తనబలములతో రణరంగపరిసరములకు వచ్చిన వాడై రాచవీటియోధవర్గమును ముందుగ నంపి పరి స్థితుల కనుగొని రమ్మనెను. రాచవీడనునది నెల్లూరు జిల్లాలోని యొకగ్రామము. ధైర్యమునకును, భయములేని తనమునకును నాయూరిబంటులు ఉక్కుతునియలన పేరు గన్నట్టివారు. ఈయల్పబలము ముందునడచి సమీక్షించు చుండగనే తురుష్కసైన్యము కొంత యెదురై యుభయ పక్షములకు పోరుజరిగెను. పరస్పరశరప్రయోగమునందు నిరువైపుల విశేషించి యోధులు తెగిరి. తుదకు తురకల సైన్యమే యోటువడి వెనుకకు మరల సాగెను.

తాకు

రామరాజు తనశిబిరమున భుజించుచున్నట్టే శత్రు బలములు "ఇదిగో వచ్చె" ననువార్త విని లేచి చూచి

నపుడు నాసైన్యములు పైకెక్కి వచ్చుచుండుటగని, తన కాశ్చర్యమైనను సమయస్ఫూర్తిని వదలనివాడై భ్రమ వదలి యువకుడో యన యశ్వరాజము నెక్కి తనబలముల సమరాయత్తములజేసి నిల్పెను. తనకుడివైపున తిరుమలుడును, ఎడమవైపున వేంకటాద్రియు తమతమబలములతో చేరి కొలువ రామరాజు నడుమ నిల్చి సుశిక్షితములు, ఆయుధాలంకృతములునైన రెండువేలఏనుగులును, వేయిశతఘ్నులును వరుసగ శత్రుసైన్యముల యెదుట నిలబెట్టి పోరుటకు పురిగొల్ప నారంభించె. హైందవసైనికులు వస్త్రముల మాని, పట్టుకు తప్పించుకొనుటకై ఒంట నూనె చరుముకొని మొనసి నిల్చిన ట్లప్పటిచరిత్రకారుడు వ్రాసియున్నాడు. తక్కినవేళల సైనికులు మనోహరములును, విభవయుక్తములును నగు నుడుపుల ధరించుచుండిరనియు, యుద్ధసమయమున నూనె చరుముకొని పట్టియొడలితో మొనయుచుండిరనియు పీస్ (Paes) అను పోర్చుగీసుఇతిహాసకారుని వ్రాతవల్ల తెలియుచున్నది.

దీనికి తగినట్టు సుల్తానులు తమతమవ్యూహములపన్ని బిజాపురపువాడు వేంకటాద్రిని, గోలకొండ బీడరువారు తిరుమలుని ఎదిర్చి నిల్చిరి. హుసన్ నిజాంషా రామరాజు

నను ముఖాముఖి నెలకొన్నవాడాయె. మూడుగుంపులవా రును చేరి నాలుగు వంతున పంౘెండుకేతనముల పన్నిద్దరు ఇమాముల పేర నక్కడక్కడ నాటించిరి. అహమ్మద్‌నగ రపుసుల్తానుని యనుచరుడగు ఇఖ్లాసాఖానుడు గుఱ్ఱముల నెక్కిన ఖురాసాన్ యోధుల యెట్టయెదుట నడుమ మొనయించి నిల్పెను. ఆర్నూరు శతఘ్నులు అహమద్ నగరపు సుల్తానునెదుట మూడువరుసలుగ బారులు తీర్చి యినుపసంకెళ్లతో వానిచక్రముల నొకదానికొకటి సంధించి నెలకొల్పిరి. కోళ్లపందెములందు పుంజులకాళ్లకు కత్తులకట్టివిడిచినట్లు ఏనుగులకోరలకు కరకైన బాకుల నమర్చి వరుసగ నిలబెట్టిరి. ఈ విన్యాసమునకంతయు కర్త చెలాబిరూమిఖాన్. వీని జన్మస్థానము ఆసియామైనరు. అప్పటికే యీతడు ఐరోపాఖండమందు తురుష్క బలముల యం దధికారము వహించి యనుభవమును గడించినవాడు.

---

## పదునేనవ యధ్యాయము

---

### రక్షస్తగ్గి యుద్ధము

తే. .........భూపాలకోటి మొగ్గరము లెల్లఁ
గలఁగఁ దిరుగుడుపడ నోరగిలఁగఁ జెల్ల
గిల్లఁ దల్లడపడ రణక్రీడ సల్పె.

—భీష్మపర్వము, ప్రథమాశ్వాసము, ౨౬౪.

యుద్ధమున కుపక్రమించుటకుముందు తిరుమల వేంకటాద్రులు సమరక్రమమును తమకు వదలి వెనుక నిల్చునదిగ రామరాజును బతిమాలుకొనిరి. "ఇంతవయస్సయ్యును ఇదివరకు శత్రువులకు వెన్నుచూపి యవమానపడక బ్రతికితిని. ఈచరమదశయందు వెనుకకు మరలి పిరికిపంద యనిపించుకొనుటకు సమ్మతించను." అని వారికి ప్రత్యుత్తరము నిచ్చెను. అది విని సోదరు లిరువురును మూఁడువేల గుఱ్ఱపురౌతులును ప్రాణములు తెగువరకయినను సరే పోరెదమని ప్రమాణములు చేసి నిల్చిరి.

ఇంతలో రామరాజు సింహాసనపుపాలకీనెక్కి మొనయబోవునపు డాప్తు లగు వీరులు పల్లకి నెక్కుటకు

మారుగ గుఱ్ఱము నెక్కి శత్రువుల నెదుర్కొనుట శ్రేయస్కరమని బతిమాలుకొనిరి. కాని ఆయన వినడయ్యె. శత్రుబలము శిశువర్గముతో బోలినదనియు, మొదటి యెడరునకే పటాపంచలై పరచుననియు, పసిపిల్లలయెదుట జాగరూకత యనవసరమనియు నారాజు తూలనాడి మొనసెను.

శత్రుబలముల మొట్టమొదట తాకినవాడు వేంకటాద్రి. ఇతడు పరాక్రమశాలియనియు, తనయన్నకు లక్ష్మణునివంటివాడనియు, సమరమున నభినవార్జునుడనియు పొగడు శాసనము లిప్పటికిని అక్కడక్కడ కనబడుచున్నవి. ఈవీరునియాధిపత్యమున రెండులక్షలపదాతులును, ఇరువదియైదువేల యశ్వదళమును, అయిదువందల యేనుగులును బలమై నెగడినవి. వీనిగొని తురుష్కపరిపంథుల నెదర్చి వారిసైన్యమును తారుమారుచేసి సమయించెను. పరాక్రమించి సుల్తానులందరి నొక్కుమ్మడిగ వేంకటాద్రి యోడించెనని రామరాజీయము తెల్పుచున్నది. ఇది యతిశయోక్తియన్నను ఆలీ అదిల్షా వేంకటాద్రి దెబ్బకు తననెలవువిడిచి పరచె ననుసంగతి బురానిమసిర్ అను మహమ్మదీయేతిహాసమందే కానవచ్చెడిని.

అపుడే తిరుమలుడును, అతనికుమారుడు రఘునాథుడును తమబలములతో హోరాహోరి పోరి గోలకొండ బీడరుసుల్తానుల నిరోధించి నూర్లకొలది తురుష్కసైన్యముల పరిమార్చిరి. గోలకొండసుల్తాను ఉన్నచోటు వదలి వెనుకకు మరలెనని యదే "బురాని మసిర్" వెలయించును. తిరుమలుని కొడుకు రఘునాథుడు తండ్రియంతటివీరుడు. అంతకుముందు జరిగినపోరులో శత్రువులనుత్తరమునకు తరిమి విక్రమించినవాడు. పోరునం దిరువురికి దెబ్బతగిలి మరలవలసి వచ్చినది. తిరుమలునికి కన్నుపోయినందున వెనుదీసినవాడాయెను. రఘునాథుడు తనకు తగిలిన గాయములతో నసువుల బాసెను.

---

# పదునారవ యధ్యాయము

---

## వీరస్వర్గము

కం. ఆరయ వివృతస్వర్గ
ద్వారము రాజులకు నాహవం బందు మహో
దారులు దొల్లియు నరిగిరి
మీ రీమార్గమున నడప మెయికొను టొప్పున్.

కం. ఇంటం దెవులునఁ జచ్చుట
కంటెను బాపంబు లొండు గలవె నృపులకున్
బంటుకలను పొలిగల నది
గంట నిధానంబుఁ గంట గాదే మనకున్.

—భీష్మపర్వము, ప్రథమాశ్వాసము, ౯౮, ౯౯.

ఇది వినిన రామరాజునకు క్రోధాగ్ని ప్రజ్వరిల్లె. ఇంత యగునని తా నెంచియుండలేదు. శత్రువర్గమును శిశువులని చులకనగ నాడినవాడు తనసేనను వారిపై పురిగొల్పుటకు పల్లకి దిగి గుఱ్ఱము నెక్కి, "గరుడా, గరుడా" యని కేకలు వేయుచువారిపైబడితాకెను. ఆవృద్ధవీరుని తేజఃప్రతాపములకు నెదుట నిల్వజాలక గోలకొండబిజాపురముబీదరు సుల్తానులును, వారి సైన్యములును కకావికలై దిక్కు-

దిక్కులకు పరచిరి. రాచవీటి యోధులపుడు ప్రదర్శించిన శౌర్యపరాక్రమము లమోఘములు. ఆపిమ్మట హైందవ సైన్యములు, నడుమపదివేలగుఱ్ఱపుదళముతో వచ్చుచున్న అహామదనగరపు సుల్తాను నిజాంషానుమార్కొనినపుడు, వాని రెండువేలసైనికులు హతులై మిగిలినవారు వీపు చూపి అరమైలు పరువెత్తిరి. ఇది రాచవీటివారి దెబ్బ. తమ ప్రభువు శత్రువులతో స్వయముగ పోరుచుండుట గని యాబంటులు తమతమ గుఱ్ఱముల నెక్కి ఖడ్గముల చేకొని వైరులన నేకుల పరిమార్చిరి.

ఇంతైనను వైరిబల మాగినదికాదు. రామరాజునెదిర్చి యరికట్టుటకు బిజాపూరుసుల్తాను ఆలీ అదిల్షా చెదరిన తనసైన్యముల ప్రోగుచేసికొని మరల మొనసి నిల్చెను. వీరిద్దరిపోరు తుదగాంచునంతలో అహమ్మద్ నగరపు సుల్తాను ఆలీని కలసికొని పోరుసాగించిన వాడాయె. ఇట్లాస్‌ఖాను ఆధిపత్యమున రెండువేలమంది ఇరాగి ఖురాసాన్ విలుకాండ్రెదిరించి పోరుచున్నట్టే హిందూ సైనికులు ముందుకు కదలిరి. ఆవిలుకాండ్ర వెనుక దాగియున్న ఫిరంగులవరుస యున్నదున్నట్టు గురిపెట్టి కొట్ట, రామరాజుబలము సమసి చెదరి పరతెంచెను. ఈవ్యూహమును పన్నిన ఇట్లాస్‌ఖాన్ రూమిఖాను

డానాటియుద్ధమున జయముగొని విక్రమించినవాడు. హాసర్ నిజాంషా యీవిజయమున కలరి తనయనుచరుల జేరబిలిచి శత్రుసైన్యము నెదుట తనశిబిరమును నిర్మింపవలెనని యాజ్ఞనొసగెను. శత్రువుల నోడించువరకు నెక్కినగుఱ్ఱమునుండి దిగ ననుశపథము చేసికొన్నవాడాయె. ఈసాహస మపాయపూరితము. ఇది కని రామరాజు రోషావేశము పైకొన, తనకు నొకసింహాసనమును నిజామునకెదుట వెంటనే రచించి నిల్పునదిగ పరివారమున కాజ్ఞపెట్ట వారు నట్లే చేసిరి. మంచిముత్తెపు జాలర్లు చుట్టును వ్రేలగట్టి బంగారునగిషీతో నలంకరింపబడిన వెల్ వెట్ వితానపుమంటపముక్రింద నవరత్నాలంకృతమైన గద్దియ నమర్చిరి. ఆరాజన్యుడు గుఱ్ఱముదిగి దాని నధివసించి తన చేతికందునటులు బంగారువరహాల రాసులను, స్వర్ణభూషణములను తెచ్చిపెట్టునదిగ నాజ్ఞాపించినవాడాయె. ఈసమరమందు వైరుల తాకి విక్రమించిన యోధులకప్పుడప్పుడే పారితోషికములనొసగుటకై యీరచనావిన్యాసము. ఈవైభవమును పరచుచున్నసైన్యములు కనులార జూచినపుడు తిరిగివచ్చిసాహసమున పోరుసాగింపమొనసి శత్రుసైన్యముల నోడించినవి. బిజాపురము గోలకొండసుల్తానులిక తమకు జయములేదను నిరాశతో

వెన్నుచూప మొదలిడిరి. వెనుకకు మరలిరని ఫెరిష్టాయే వ్రాసియున్నాడు. ముందు పేర్కొన్న మహమ్మదీయేతిహాసమునసయితే మోటమి తప్పదని సూచింపబడినది. పోర్చుగీసు దేశస్థుడగు పైరియాసూజా యనువాడు రామరాజుతురకల నట్టే యోడించెనని వ్రాసియున్నాడు. బసాతీన్ - అస్ - సలాతీన్ (Basatin-us-Salatin) అను మహమ్మదీయులు వ్రాసియుంచిన గ్రంథమందు సహితము హతులైన తురకలశవములు రాసులై పొడగట్టెననియు, తురుష్కులసైన్యమునకు శరదృతు వాసన్నమైనట్టును, నాస్తికులు (హిందువులు) తమశౌర్యాధిక్యముల నపుడు ప్రదర్శించిరనియు గలదు.

అహమ్మద్‌నగరపుసుల్తానుడు తన శృంగారమంటపమునే తనబలములకు కేంద్రస్థానముగజేసికొనినవాడాయె. హైందవశత్రువులు ముందున్న ఫిరంగివరుసల సమీపింతురేని వారిని గాల్చుట కాఫిరంగులను రాగి నాణెములచే నించి రూమీఖాను సిద్ధముచేసి యుంచెను. ఈనాణెములు ఫిరంగులనుండి పరపించినపుడు వానిమూతులయొద్ద నున్నవారు ఐదువేలమంది మడిసిరి. విజయనగరపు సైన్యములు చెదరినవి. ఇంతలో కిష్వార్‌ఖాన్‌లేరీ అను

బిజాపురపుదళవాయి ఐదువేలగుఱ్ఱపురౌతులతో మిగిలిన బలమునడుమ జొరబడినపు డవి నలుదిక్కుల పరచెను.

## సుల్తానుల భేదతంత్రము

ఈసమరమునకు పర్యవసానముగ నాకకావికలందు విశేషమొకటి పొసగినది. విజయనగరపక్షమున నిల్చి పోరుచువచ్చినట్టి యిద్దరుమహమ్మదీయనాయకు లున్నదున్నట్టు తామునడుపుచున్న సైన్యములతో పరపక్షమునకు తిరిగిపోయిరి. ఈవంచననుగూర్చి మహమ్మదీయైతిహాసికు డెవడును సూచించియుండలేదు. ఇది సంభవించిన సంవత్సరమునకు విజయనగరపువీథిని పోవుచుండి వినినసంగతి సీసర్ ఫ్రెడరిక్ అనుపోర్చుగీసుపాంథుడు వ్రాసియున్నాడు. ఆవ్రాత యిది:

“ఈనలుగురుసుల్తానులు మోసముచే దప్ప విజయనగరపుచక్రవర్తిని గెలువరైరి. ఈరాజు హైందవుడు. తన సేనానివర్గమందు మహమ్మదీయవీరు లిద్దరుండిరి.లోలోపల వీరొక్కొక్కరును తొంబదివేలసైన్యమును నడుపుచుండినవారు. తమరాజుపైననే యవితిరుగబడునట్లు ఫితూరిచేయుటకు మొదలుపెట్టినట్టున్నది. విజయనగరపురాజు శత్రుసైన్యమును సరకుగొన్నవాడు కాడు. బాహాటముగ యుద్ధ

రంగమున నుభయసేనలు కలియబడినది నాల్గుగంటల సేపే. వీరిద్దరు క్షోభనుపుట్టించి కళవళ మందినటుల నటించి యందరు చూచునట్లు పరువెత్తసాగిరి." అన్క్వే టిల్ డూ పెరన్ (Anquetil Du Perron) అను మఱియొక పోర్చుగీసుచరిత్రకారుడు సహితము యుద్ధమధ్యమున నిద్దరు సేనాధిపతులు తిరిగి పోయినందుచే రాజునకు ఓటమి యాసన్నమాయెనని చెప్పియున్నాడు.

మహమ్మదీయవీరులు విజయనగరపు హైందవసేనలో నధికారపదవి నెట్లువహించిరనుట యాశ్చర్యము. రామ రా జింతటి యింగితజ్ఞుడయ్యు వీరిని కొలువునందు నిల్పు టకు కారణ మేమైయుండెనా యనుట శోధించ తగినది. ఈయిద్ద రెవరో, వార్ల పేర్లెవ్వియో జాడలు లేవు. రామ రాజు అయినుల్ముల్క అను మహమ్మదీయానుచరు నొక్కని 'అన్నా'(భాయీ)యని పిల్చుచుండినట్లు ఫెరిస్టా వ్రాతలవల్ల తెలియుచున్నది. ఆయిద్దరిలో వీ డొకడయి యుండవచ్చునా యని చరిత్రకళానిపుణు డగు రెవరెండు హీరాస్ అనుమానించుచున్నాడు. వీనితండ్రి నానామా లూకా యనువాడు బిజాపురసంస్థానమున నధికార పదవి నందియున్నపుడు బేవినహళ్లిగ్రామమును బ్రాహ్మణుల కినాముగ నిప్పించినట్లు శాసన మొకటి బయల్పడియున్నది.

వీడే ౧౫౩౩-వ సంవత్సరమున బిజాపురపు సుల్తానుడైన ఇబ్రహీం అదిల్షాచే రాజద్రోహమునకు దేశమునుండి తొలగగొట్టబడినవాడు. వాని కొడుకు అయినుల్ముల్కు తనతండ్రికైన ఘోరపరాభవమును సహించలేక బిజాపురమువదలి రామరాజుకొలువున జేరియుండెను. ఆకారణమున రామరాజునకు ద్రోహమొనర్చినవారిలో నొకడు మరియొక రాజద్రోహిపుత్రుడై యుండవచ్చుననుట సంభావ్యము కానగు.

ఈద్రోహవర్తనముచే రామరాజు సైన్యములు కట్టుతప్పి చిందరవందరలు కాజొచ్చెను. అపుడే యావీరునికి గాయమొకటి తగులుట పొసగి శ్రాంతుడై పల్లకినెక్కి శిబిరమునకు మరలుచుండిన సమయమున అహమ్మద్నగరపు బలముల యేనుగొకటి రభసముతో సమీపించినది. వాహకులు వెరచి పల్లకిని దిగవిడిచి పరచిరి. పల్లకి దిగినడచిపోవ యత్నించినపుడు రాజు శత్రువులచే జిక్కెను. వారు నాతని వెంటనేచెలాబిరూమిఖాను నొద్దికి కొనిపోయిరి.ఆతురుష్కుడుచిక్కిన రాజునుఖడ్గముతో తెగవేయమొనసెను. ఆతరుణమున విజయనగరపు సేనాధిపతి దళపతిరాయ్ అనువాడుచూచి చంపవద్దని వారించి దివాణ్ బరీదునొద్దకు కొనిపొమ్మనుచు నదిగ సూచించెను. ఇంతలో

హసన్ నిజాంషాకు ఈసంగతి తెలిసి యాతని యెదుటకు రాజు కొనిపోబడినపుడు శిరశ్ఛేదనమునకు నాజ్ఞనొసగిన వాడాయె. పోర్చుగీసుచరిత్రకారుడు కౌటో వ్రాసిన చొప్పున హసన్ నిజాంషా తన చేతులార ఖడ్గముతో రామరాజు శిరస్సును తెగవేసి "నా కసి తీరినది. దేవుడు న న్నేమి చేసినను చేయనిమ్ము" అని విరమించె నట. ఈవిషాదాంతము నొక్కొక్క చరిత్రకారు డొక్కొక్కవిధముగ వివరించియున్నాడు. "ఈఖలునితల శరీరము నుండి వేరుచేయబడి సుల్తానుగుఱ్ఱపుకాళ్లక్రిందికి దొర్లించబడిన" దని ఆలీ ఇబన్ అజీజ్ వ్రాత చూపుచున్నది. తలను గడ్డితో నింపియుంచినట్లు మరియొకచోట కనబడును. విజయనగరబలముల కీతనిచావునుచాటుటకునై పొడుగగు బల్లెమున కాతలను గ్రుచ్చి చూపునట్లు అహమ్మద్ నగరపుసుల్తాను డాజ్ఞాపించెనని ఫెరిష్టా వ్రాసియున్నాడు. రాజు పట్టుబడినతోడనే ప్రాణ మెక్కడ తీయనున్నారో యని భయమంది ఆలీఅదిల్షా నిజాంహసన్‌షాయొద్దికి పరుగెత్తుకొనివచ్చి వారించునంతలో రాజుతలను తెగవ్రేసియుండిరనియు, ఇదిగని యాసుల్తానుడు మిక్కిలిదుఃఖించెననియు, కౌటోవ్రాత వెలయించుచున్నది. హైందవవైతిహాసికులు వ్రాసియున్నప్రకార మారాజు చెరనుంచబడు

నవమానము మిగిలించి యుపకారము కట్టుకొనఁదలచి ఆలీ తానే ఖడ్గముతో పోరాడుసమయమున తలతెగ వ్రేసినందున రామరాజు అస్తమించెనని యటుపిమ్మట పుట్టినశాసనములు ప్రకటించుచున్నవి. రాజుశిరస్సును కాశికి పంపినట్లు మహారాష్ట్ర చరిత్రకారుఁడు ఛందోర్కర్ వ్రాసిపెట్టియున్నాడు. ఆతలకు నూనెతో కలిపిన సిందురమును పట్టించి భద్రపరచి యేటేట ఇన్నూట యేబదినాలుగుసంవత్సరములు మహమ్మదీయభక్తవర్గమునకు చూపబడుచువచ్చెనని మరియొకయైతిహాసికుని వ్రాత తెలుపును. హుసేనిజాంషాయాజ్ఞచొప్పున రాజు తలను తెగనరికినవెంటనే బల్లెమునకు గ్రుచ్చి రాజు చచ్చెనని చాటించినపుడు హైందవసైన్యములు చిందరవందరలై విజయనగరముతట్టు పరచినవని ఫెరిష్టా వ్రాసియున్నాడు. అట్లు పారిపోవువారిని నిజాంషా వెంబడించి ఖడ్గమున నరికెననియు, పడినపీనుగులు బయలంతయు పర్వియుండెననియు బురాని మసిర్ చెప్పుచున్నది. ఈహత్యచే ప్రవహించినరక్త మేటినీటినే యెఱ్ఱజేసెనని ఫెరిష్టా వ్రాత తెలుపును. ఆయుద్ధమందును, పిమ్మటను హతులైన హైందవనాస్తికుల యొట్టుసంఖ్య లక్షకుమించెనని బసా

తీన్-అస్ - సలాతీన్ (Basatin-us-Salatin) ప్రకటించుచున్నది.

ఫ్రెడరిక్ అను ఇటలీదేశపుబాటసారి వేంకటాద్రి తనయన్నరామరాజుతో నసువులబాసినట్లు వ్రాసియున్నవాఁడు. పోర్చుగీసుచరిత్రకారుల వ్రాతయు దీనికి సరిపోవుచున్నది. తప్పించుకొని దూరపుదుర్గమునకు వెళ్ళెనని ఫెరిష్టా వ్రాతలవల్ల కననగును. రామరాజీయగ్రంథమును చెప్పుటల్లే. యుద్ధమైన రెండుసంవత్సరములకుపిమ్మట చెక్కించిన కృష్ణాపురపుతామ్రశాసనము చూడ వేంకటాద్రి బ్రతికియున్నట్లు తోచుచున్నది. చంద్రగిరికి పోయియుండవచ్చు నని మరియొక యూహ.

యుద్ధానంతరము తురుష్కులు హైందవులను విజయనగరమువరకును తరుముకొని పోలేదు. రణరంగమందే పదిదినములు నిలిచియుండిరి.

హైందవులసర్వస్వమును శత్రువులచేబడియె. అమూల్యములైన భూషణములు, గుడారములు, ఒంటెలు,ఏనుగులు,గుఱ్ఱములు, భేరీలు, కేతనములు,ఆయుధములు, ఇతరయుద్ధోపకరణములుదాసదాసీజనవర్గములన్నియుశత్రువుల వశమైయున్నదున్నట్లువారు భాగ్యవంతులైరి. దిగవిడచిన

యేనుగులనుమాత్రము సుల్తానులు పంచుకొని మిగిలిన కొల్లయంతయు సైనికులకే వదలిరి. ఛందోర్కర్ వ్రాసిన చొప్పున రామరాయడు రణభూమికి కొనితెచ్చిన సరకు సంబారములవెల ౧,౨౩,౫౭,౮౧౧ పణములని లెక్క పెట్టబడినది. ఆణిముత్తెములు, మరకతమాణిక్యములతో నొప్పి రామరాజుమెడ నలంకరించిన హారమొకటి అహమ్మద్‌నగరమునకు కొంపోబడెను. ఈసమరము జరుగుట ౧౫౬౫ సంవత్సరము జనవరి ౨౫ వ తేది.



## పదునేడవ యధ్యాయము

### అస్తమయము

ఉ. అంపలివారలెల్లను జయంబునఁ బొంగుచుఁ బేరెలుంగు లం
పంపఁ జెలంగఁగాఁ బిలుచి నార్వఁగ నొత్తిలి నవ్వ నాకసం
బందినయట్టి మ్రోఁత విని యక్కడ వోవఁగ నుల్కి రప్పు త
మ్ముగ్రం దడనన్ పడిన్ వెడలుచూఁకలు మ్రోయుటగాఁదలంచుచున్.

—భారతము, సౌప్తికపర్వము. ప్ర. ౫.

### శత్రువుల కొల్ల

ఈ ఘోరమగు ఓటమియొక్క విషాదవార్త రాజధాని విజయనగరమున వినవచ్చినతోడనే యందరిజనులు భయకంపములకు పాలైరి. ఇక జేతలగు సుల్తానులు నగరము ప్రవేశింతురేని తమకు చావో దాస్యమో తప్పదని జడిసి యార్తులై తలదాచి తప్పించికొనుటకు యత్నములు చేయుటతప్ప మఱియేమియు వారికితోఁచదాయె. రాజాంతఃపురమున నెలకొనియున్న రాజకుటుంబమును, యుద్ధరంగమునుండి మరలిన తిరుమలరాయడును, మిగిలిన మంత్రివర్గమును, సైన్యములును, తదితర

నతిశీఘ్రకాలమున నాపట్టణము విడిచి ధనరాసులు, గజా
శ్వములు, సింహాసనము మొదలయినవానితో పెనుగొండ
దుర్గపుదిక్కు మొగమై సాగి నడువజొచ్చిరి. అపుడు తెచ్చిన
సింహాసనమే యిప్పుడు మైసూరునం దుండునది. అంతి
వరకు చెరలోనున్న సదాశివుడును నా పరివారముతో
వెడలినవాడే. అవసరముం దానగరమును వదలిన రాజ
న్యులును, విత్తవంతులును విడిచివెళ్లిన ధనరాసులు లెక్క
లేనివి. ఇండ్లకు కాపులేనికారణముచే చుట్టుప్రక్కల నడ
వుల పొట్టపోసికొను నిషాదవర్గ మిదిసమయ మని పురము
జొరబడి చేతికిదొరకినదాని నెల్ల కొల్లగొనినది. పది దిన
ములు సమరాంగణమందు గెలుపుమత్తుచే నిల్చి విశ్రమించి
యున్న సుల్తానుచతుష్టయము మేల్కాంచి విజయ
నగరముపై విజయధాటి వెడలనమకట్టెను. సేనలు, దండ
నాయకులు, చెరగొనబడిన శాత్రవభటులు ముందునడువ
భేరీపటహకాహళశబ్దములతో వెనుక నేనుగుల నెక్కి
సుల్తానులు గెలుపుమెరవణి పరగ రాజధాని చొచ్చిరి.
రామరాజుతలను పొడుగైన బల్లెమునకు గ్రుచ్చి యెత్తి
చూపుచు నడచినదియు నపుడే కాబోలును. ఈయూరే
గింపు విజయనగరముచేరెను. సుల్తానులు తమతమ పరి
వారములతో నిర్జనములై యున్న రాజాంతఃపురముల

బసచేసిరి. శుద్ధాంతభాగములు వారి రాణివాసములకు వినియోగింపబడెను. ఇట్లాయూర జేతలగు సుల్తానులు నిల్చినకాల మారునెలలు. వారిసైన్యములు వెంటనే యా నగరరాజమును, దానిపరిసరములను కొల్లగొట్టుట కారంభించినవి. దాచినధనమునకై వారు త్రవ్విచూచిన గృహాంగణము లెన్నియో. చిక్కినవజ్రములును, వెలగల యితర రత్నములును పరివారములు వారివారిసుల్తానులకు కానుకగ నొసగుచుండిరి. కోడిగ్రుడ్డంతటి వజ్రపుతునుక యొకటి బిజాపురపుసుల్తాను ఆలీఅదిల్షాచేతి కందెను. దానిని వాడు తనపట్టపు గుఱ్ఱపుతలతురాయికి దిమ్మెగా నలంకరించెనని పోర్చుగీసు చరిత్రకారుడు కౌటో వ్రాసియున్నాడు.

ఆసమరమందు రామరాజుతల తెగవ్రేయుటతో కసి తీరక, తమవిజయోత్సాహము క్రొత్తదై యుండినట్టె తురకబలములు నగరమందలి గుళ్లుగోపురములను, సౌధములను పడగొట్టినట్టు గుర్తు లిప్పటికిని కానవచ్చు చుండుట నిజము. ఆపట్టణమున కొకవైపున నిల్చియున్న గొప్ప యొంటిరాతి నృసింహావిగ్రహము భిన్నమై యుండుట యాకాలపు దౌష్ట్యమునకు సాక్ష్యమని వేరుగ చెప్పనవసరము లేదు. దేవాలయములందు ప్రతిష్ఠింపబడి పూజ లందుచుండిన విగ్రహము లందు

కానక యాగుళ్లు శూన్యములై యుండుటకును అదియే కారణ మనుటకు సందేహముండదు. ముఖ్యమైన కట్ట డముల నన్నిటిని వానిచిత్రశిల్పముతో అడుగులు పెక లించి రాజధానికి సుల్తానులు నాశమాపాదించినట్లు ఫెరిష్టా వ్రాసియున్నాడు. ఆవ్రాతనుబట్టియే కాబోలు, సూయల్ చరిత్రకారుని యభిప్రాయమును నట్టిదయ్యే కన్పట్టుచున్నది.

సుల్తానుల సైరణ

ఇది సత్యమైయుండునా? ఇప్పుడు మిగిలియుండు శిల్ప భాగములనుమాత్రము శోధించితిమేని యీయిద్దరు చరిత్ర కారులు వ్రాసినంతటి యధికముగ రాజధాని నాశనము కాలేదనుట దీర్ఘముగ విచారించి చూచువారిమనస్సులకు తట్టకపోదు.

సుల్తానులునలుగురును ఆరునెలలకాలము రాజధాని యందు నెలకొనియుండిరన్న నానగరరాజమును తమ యధీనమందుంచుకొని యేలవలె ననుటకేయని భావింప తగియున్నది. అట్లగునేని సుల్తానులే యీనాశనమునకు తొడరి రనుట యసంగతము. మున్నూరేండ్ల కాలప్రవాహము సద్దులేక, యవసరపడక నగరవైభవమున

కాపాదించిన చ్యుతిభాగము కొంచెమైయుండదు. ఇపుడు చూచువారికి కన్పట్టునాశనవిస్తారమం దిదియు చేరియుండు నట్టిదే. ఫెరిష్టా చరిత్రకారుడు తన మతపాషండతచే హైందవసామ్రాజ్యముపై తురుష్కుల విజయసిద్ధిని ఉన్నవానితో లేనివి చేర్చి బడాయికై యతిశయముగ చెప్పినాడేమో. కాదేని ఇప్పటికిని చెక్కుచెదరక నిల్చియుండు గణేశవిగ్రహములు రెండు, గొప్ప రాతి నంది, అతిసుందరమగు పంపాపతిగోపురము - ఇవియన్ని యు వెనుకటివలె కట్టుకదలకనిల్చియుండుట యసంభవము. విటల-అచ్యుత దేవాలయములు (యిటికెతో కట్టిన గోపుర భాగములు తప్ప) భిన్నము కాకుండుటయు నీనాశనమునకు తొడరినవారు సుల్తానులు కారనుటను చెప్పకచెప్పును. వా రట్టి నాశనమున కడ్డుపెట్టియు నుండవచ్చునేమో. ఇంతేకాదు, ఆసుల్తానులు ఆనగరమున నిల్చినయచిరకాల మందు దానికి తురకసొగసు నీయదలచి కొత్తకట్టడముల తమశిల్పకళావైఖరిని ప్రదర్శింప సమకట్టినగుర్తు లున్నవి. అవి యిప్పటికిని కననగును. రాచనగరు ప్రాకారపు తూర్పుభాగముననుండు క్రీడాజలాశయము, యేనుగుల లాయములు, శుద్ధాంతమున గృహాంగణమొకటి, ధన నాయకుని పరిధికొకమూల నిల్పియుండు బురుజు, హం

పికి పోవు రథ్యయందు పొడగట్టు ఎనిమిదమూలలమంట పము - ఇవియన్నియు నీయూహకు నాధారములు. ఈ కట్టడములవిన్యాసమందు హిందూమహమ్మదీయశిల్ప పద్ధతులు మేళవింపబడియుండుట చూడ రక్షస్తగ్ధి యుద్ధానంతరము ఉభయజాతులకునుసామరస్యము నాపాదించుట ఈశ్వరసంకల్పమై యయ్యాది శిల్పసంస్కారమున మొదట వ్యక్తమైన దనుట యుదారదృష్టికి గోచరించునట్టిది. ఈయూహకు మరియొకయాధారముగానవచ్చును. ఆనగరమం దంతకుముం దుండిన రాతికట్టడములలో దేనియందైనను గచ్చనుమాట లేదు. పైన పేర్కొన్న కట్టడములందుమాత్రము గచ్చువేసి యుండుట విశేషము. బిజాపురమున నాకాలపు మహమ్మదీయసుల్తానులచే నిర్మింపబడిన "ఇబ్రహీంరౌజా" అను మందిరము యొక్క కప్పును దూలములు దంతులు లేక కేవలము గచ్చుతో మాత్రమె రచింపబడియుండుట యప్పటిగారబిగి తెల్పునట్టిది. దక్కనీసుల్తానులనాటి గచ్చునందలి జిగట బిగువు లప్రతిమానము లని శిల్పకళాకుశలు డగు కజిన్సు (Dr. James H. Cousins) వ్రాసియున్నాడు. సుల్తానువర్గము విజయనగరమును పడగొట్టి నాశనము చేసినా రనుటకు మారుగ రాజధానిని, గంభీరములైనట్టియు, విశాల

ములగునట్టియు క్రొత్తకట్టడము లనేకములుకట్టి యలంక రింప తివిరినారనుట బసాతిన్-అస్-సలాతిన్ (Basatin-us Salatin) అను మహమ్మదీయేతిహాసమునందు కననగును. రాజధాని కాసన్నమయిన నాశనపు గుర్తు లన్నిటికిని సుల్తాను లుత్తరవాదులై యుండరనుటకు ప్రబలదృష్టాంతము మరియొకటి యీవల వెలువడినది. సీసర్ ఫ్రెడరిక్ (Caesar Frederick) అనునతడు ఇటలీదేశపు పాంథుడు. రక్కస్తంగడి యుద్ధానంతరము ఆయూర నేడునెలలు బసచేసికొని నిల్చి యుండినవాడు. ఇతడు సుల్తానులు విజయనగరమం దారునెలలు నిలిచియుండినదియు, పిమ్మట వారు నలుగురును తమ తమ రాజ్యపు మొగమై బయలుదేరుటయు చూచినవాడు. తదనంతరము రామరాయల తమ్ముడగు తిరుమలదేవమహారాజు మరల రాజధానిని ప్రవేశించినసంగతి తానుసమక్షముండిచూచిన ట్లతడు వ్రాసియుంచిన యప్పటివ్రాతలు తెల్పుచున్నవి. రాజాంతఃపురమును తాను ప్రవేశించిచూచెననియు, యుద్ధమునకు పూర్వ మది యెంతవైభవముగ నుండెనో అంత వైభవములో కొంచెమైనను తరుగలేదని వ్రాసియున్నాడు. నిజముగ సుల్తానులు నగరనాశనమునకు తొడరియున్నట్టయిన, రాజాంతఃపుర మప్పటికి చెక్కుచెదరక



'గగనమహల్'
(పెనుగొండలోని విజయనగరకాలమునాటి రాజమందిరము.)

"వెంకటాద్రి దానకాలమున యువరాజై పెనుగొండయందు"

(౨౮ పుట.)

యథావిధిసమగ్రమై నిల్చుట పొసగియుండదు. దీనివలన ఫెరిష్టావ్రాత యతిశయోక్తియనుటకు వేరుసాక్ష్య మనవసరము. ఆవ్రాత నూతనగగొని ప్రకటించిన సూయల్ చరిత్రకారుని యనుమాన మట్లే నిరాధారము.

## సుల్తానుల వీడ్కోలు

ఇంతటివిభవయుక్తమైన నగరున నారునెల లుండి తుదకు సుల్తానులువిడిచి వారిత్రోవను చనినారన్న, కారణ మేమయియుండునా యనుట చదువరులకు తోచుప్రశ్న. అళియరామరాజు వీరస్వర్గము నెక్కినపిమ్మట తిరుమలుడును, వేంకటాద్రియు తప్పి మిగిలి బ్రతికినతమ్ములు. తిరుమలరాజు తిరుపతియందును, వేంకటాద్రి చంద్రగిరియందును ప్రచ్ఛన్నులై కాలమును వేచియుండిన ట్లున్నది. రాజధానిని మరల సామ్రాజ్యమునకు సాధించి దానివెను కటికీర్తిప్రతాపముల నెలకొల్పవలె ననుసంకల్పము వారి మనస్సునువదలిన ట్లగపడదు. ఇద్దరును సంప్రతించి తమ యన్న రామరాజు సుల్తానులనుండి జయించిన రాజ్యభాగములన్నియు మరల వారికే యొసగుట తమకుసమ్మతమనియు, రాజధాని విజయనగరమునుమాత్రముతమవశము చేసిన చాలుననియు, సుల్తానులకు రాయబార మంపినట్టు

కానవగును. అప్పటి కాసుల్తానుల విజయోత్సాహసంభ్ర మములును చల్లారియుండనోపు. అంతకాలము తమతమ రాజ్యముల వదలి పెరయూరివాసము వారి కాసమయ మున వేసటను పుట్టించనేమొ. ఇంతేకాక పనిలేక యొక చోట కూర్చొనియున్న నలువురిలో నొకరికొకరికి మన స్తాపములు కల్గుచు వచ్చినట్లును గుసగుసలు సహితము పొడమెనట. ఎట్లయిననేమి, నల్గురుసుల్తానులును ఒకరి తోనొకరు సెలవుపుచ్చుకొని విజయనగరమును విడనాడి రాయచూరుదిక్కు మొగమై తమతమపరివారములతో వెడలిరి.

## తిరుమలుని నగరప్రవేశము

ఈసమాచారము తెలిసినతోడనే తిరుపతినుండి తిరు మలదేవమహారాజు పయనమై నగరమును ప్రవేశించెను. అచట నెలకొన్నకొంతకాలమునకు తనయన్న రామరా జువెనుక మొనసినట్లు మహమ్మదీయ సుల్తానుల మరల దిగి రానీయక నడ్డుకట్ట సాహసించినవాడాయె. అంతకు ముందు పొడమిన మనస్తాపములచే సుల్తానులలో నొకరి కొకరికి మిత్రభేద మావహించెను. సుల్తానులు తమతో తమప్రతికక్షివారి నెదిరించుటయందు మునుపటివలె తిరు మలుని సహాయము వేడుటకును తలపెట్టిరి. ఈ నడుమ

నారాజు రాజ్య యశోవైభవముల నదిమొదలు జీర్ణోద్ధారము చేయు సంకల్పముతో దీక్షాబద్ధుడై కార్యముల నిర్వహించినట్లు చరిత్ర వెలయించుచున్నది. సదాశివుడు చెరయందున్నట్టే, రాజ్యాధికారము తిరుమలరాజు తానేవహించి యయిదేండ్లు పెనుగొండయే రాజధానిగ రాజ్యమేలి తనపెద్దకొడుకగు రంగరాజుకు పట్టముగట్టి తొంబదిరెండవవయస్సున-౧౫౭౨వ సంవత్సరమందు-పరమపదించెను. ఈరంగరాజు వైష్ణవభక్తుడనుట తప్ప పరిపాలనమునందు ప్రతాపవిచక్షణతల నేమియు ప్రదర్శించినవాడు కాడు. తాను సింహాసనమెక్కిన పండ్రెండు సంవత్సరములకాలమున మహమ్మదీయశత్రువర్గముచే పలుమారు లోటువడెను. ఈరాజన్యుడు ౧౫౮౫-వ సంవత్సరమున స్వర్గస్థుడైనతోడనే సామ్రాజ్యసింహాసనము నెక్కినవాడు వేంకటపతిమహారాజు (Venkata II). క్షీణించినసామ్రాజ్యశక్తిని మరల చాలవరకు నెలకొల్పి ప్రతిష్ఠించినవాడీతడు. *

సంక్షీణప్రభ

తుళువవంశ మంతరించి ఆరవీటివంశమువారు సామ్రాజ్యాధిపత్యమునకు వచ్చుట యీసమయమున నే. ఆరవీటి

* ఈచక్రవర్తి జీవితము నింతకుముందే వ్రాసి ప్రచురించితిని.

ప్రభువులు సామ్రాజ్యపువెనుకటివైభవముల నెప్పటివలె నెలకొల్పుటకు చేసిన సాహసకార్యము లప్రతిమానము లైనను రామరాయలకాలమునాటి తేజస్సు మరల రాజ్యము నావహించదాయె. అపుడు సన్నగిల మొదలిడిన రాజ్య శక్తి నానాటికి తరుగ, తుట్టతుదకు పశ్చిమోత్తరమునుండి శివాజి దండయాత్ర వెడలి అరవదేశమగు చోళదేశము నకు మహారాష్ట్రసంపర్కము కల్గుట పొసగినది. హైదరాలి మైసూరుసింహాసనము నాక్రమించుటకును మూలమదియే. పాదుషా ఔరంగజేబు ఢిల్లీనుండి దక్షిణమున దండయాత్ర వెడలించినదియు నటుపిమ్మటనే. ఆవలి చరిత్ర బ్రిటిష్ వారిప్రవేశముతో నారంభించునట్టిది.



# పదునెనిమిదవ యధ్యాయము

## గుణాదర్శము

ఆశౌర్యం బాసత్త్వం
బాశీలం బాపరాక్ర మాభీలత్వం
బాశుద్ధవ్రత మెందు న
నాశములని భీష్ముఁ బెద్ద నమ్మితిమిగదే.

—భీష్మపర్వము, ప్రథమా. 56.

అళియరామరాజుయొక్క జీవితకథను సమగ్రముగ నాలోకించినపుడు రాయలకాలమునాటి సంఘపరిస్థితులు, రాజ్యతంత్రాదర్శములు, దండనీతి, విద్యావైశద్యము, లలితకళాకౌశలము, ప్రజల యార్థికవ్యాపారముల పెంపు, సనాతనధర్మానుష్ఠానములు, రాజభక్తి, పరార్థచింతనము ఇవియన్నియు ముకురమున ప్రతిఫలించినట్టు కననగును. తన తొంబదియారవయేట రామరాజు ఖడ్గము చేత బూని వారించినను వినక శత్రువుల నడుమ జొరబడి ముఖాముఖి వారితో పోరదొడరె నన్నపుడు, ఆకాలపు జనసామాన్యముయొక్క శరీరపాటవమును, ధైర్యసాహ

సములును నిట్టివని యూహింపనగును. దేహము కేవలము సాధనమని భావించి సమయమునకు పనికివచ్చునట్లు దానికి శక్తిని సేకరించు రహస్యము వారు చక్కగ నెరిగియుండి రని యూహింపవలసియున్నది. తిరుమలరాజు సహితము తొంబది రెండేండ్లు బ్రతికినాడనుట యీయూహకు మరి యొక యాధారము. ఆ కాలపు సమరనీతికి ధీరోదాత్తత లక్షణమనుట విశ్వనాథుని జీవితము వేనోళ్ల ప్రకటించును. ప్రజలలో నాకాలమున చదువను వ్రాయను తెలిసినవారి సంఖ్య యెక్కువకాకపోయియుండవచ్చును. అయినను వారిచిత్తముల సంస్కరించు శక్తి నొసగు బోధనోపాయ ములు వివిధములై ప్రబలి వారి తెలివితేటలు మెరుగంది యుండవలెను. ఇట్టి బుద్ధిప్రభ సామాన్యముగ రాజ్య మెల్లెడల వ్యాపించియుండ దేని 'ఆముక్తమాల్యద', 'వసు చరిత్రము', 'కళాపూర్ణోదయము'వంటి యుద్గ్రంథములు రచింపబడుటయసంభావ్యము. రాజ్యముచుట్టు సముద్ర తీరముల పర్వియుండుచు వచ్చిన యరువది రేవుపట్టణ ము లప్పటి చేతిపనుల జీవికలకును (Cottage industries), వాణిజ్యమునకును, ఆర్థికసంపత్తి పెంపునకును సాక్షులు. శిల్పచరిత్రములవంటి లలితకళలు సహితము చక్కగ పోషింపబడుచుండె ననుటకు హంపి, లేపాక్షి,

తాటిపత్రి, మధుర, తిరుచునాపల్లె వంటి స్థలములు మిగిలి యుండు నాటి దేవాలయములలోని పనితనము చెప్పక చెప్ప సాక్ష్యమై పరగుచున్నది. పరార్థసంప్రదాయమే గురిగాగల రాజ్యతంత్రమున దైవభక్తియు, పరార్థచింతన మును సహజముగ నెలకొనియుండెననుట విశేషముకాదు. జనులయం దప్పటిమహమ్మదీయక్రైస్తవమతసహనము వారి చిత్తవృత్తియందలి యుదారస్వభావమును ప్రకటించునట్టిది.

రక్షస్తగ్గియుద్ధానంతరము నల్గురు మహమ్మదీయ సుల్తానుల వర్తనమును దీర్ఘముగ విచారించి చూచితి మేని యిరుప్రక్కల వైరుల మనస్పర్ధకు కారణము పర స్పరమతవిద్వేషము కాదనుటయు స్పష్టమగును. అంతియ కాక ఉభయజాతులవారికి నాకాలమున సామరస్యమునెల కొల్పి యొకజాతీయతను నిర్మించవలెననుకోరు విజయనగ రపు ప్రభువులు గురియం దుంచి దానికై యలవరచిన యుక్తులు వారి యుదారదేశభక్తిని ప్రకటించునట్టివి. ఈ వైఖరి విజయనగరయుగపు విజ్ఞానమునకే తిలకప్రాయ మన జెల్లు.

రాజ్యతంత్రజ్ఞానమందేమి, అజ్ఞానమును సమయోచి తముగ ననుష్ఠించి కార్యసిద్ధి కావించుకొనుటయందేమి,

సంగ్రామక్రమమున సామాదిచతురుపాయములను సమయోచితముగ విన్యసించుటయందేమి, రామరాజు చన్న రాజన్యవర్గములో నద్వితీయు డనబరగెను. అదివరకు భరతఖండము నేలిన రాజాధిరాజులలో నీత డొక డను నంతటి పేరుగన్నవాడని హీరాస్ పండితుడు విమర్శించి నిర్ణయించినవాడు. సదాశివుని చెరయం దుంచి తాను సింహాసన మెక్కుట యీభూపాలుని శీలమునకు కళంకముగ కన్పట్టునేమో. కాని యప్పటిసమయసందర్భముల సమగ్రముగ సమీక్షించితిమేని యావిపర్యాసము కేవలము సామ్రాజ్యసంగ్రహణార్థము కొరకే చేకొనబడె ననుట వ్యక్తమగును. తుంగభద్రయొద్దున నిల్చి తన యొక్క బాహుదండముచే పైనుండి దిగివచ్చు తురకల నడ్డుకట్టి,మరియొకదానిచే దక్షిణాపథమునందలి తీర్థక్షేత్రముల కభయదాన మొసగిన యీరాజన్యుని వ్యక్తి దృశ్య మొక్కటేసారి విభ్రమాశ్చర్యముల కల్గించునట్టిది. ఇట్టి క్షాత్రసాహసముల నడుమ హిందూమహమ్మదీయ సామరస్యమును ప్రజలమనసున పుట్టించి పోషించవలె నను కార్యదీక్ష ఆమహామహుడు తనలో పెంచుకొన్న దేశ

రామబురుజు (పెనుకొండ)



" కొండలవరుసయం దక్కడెక్కడ దుర్గముల కట్టించియుంచెను. " (౧౨౧ పుట.)

భక్తియొక్క సమగ్రతను చూపును. ఇంతటి సామ్రాజ్య
సంసారమును నిర్వహించుటయందు విసుగక సందుజేసి
కొని వీణె నెత్తి స్వయముగ శ్రుతిగూర్చి పాడి రమింప నేర్చి
నవాడీ నెరజాణ. సంస్కృతాంధ్రవాఙ్మయమున నారా
జావరించిన రక్తి భట్టుమూర్తివంటి కవిపుంగవుని తన
యాస్థానమున కలంకారముగ ప్రతిష్ఠించి 'రామరాజ
భూషణు'డని బిరుదు నొసగిన వితరణ ప్రకటించును.
ఈ వివిధములైన కార్యజాలమందును, సన్నాహము
లందును, వేదకలయందును పాఠ్యమును
మరువక, వేదాంతచింతనమే గురిగా నంతర్ముఖుడై
గురుసన్నిధియందు శాస్త్రవిచారములు సల్ప రాజధా
నినే వదలి యప్పుడప్పుడు విశ్రమించుకొనుట కలవడిన
విచారపరుడీ వీరవరుడు. తన జీవితపు సోపానపరంప
రలో నొక్కొక్క మెట్టున నాశ్రమధర్మమునే యనుష్ఠించి
వర్తించిన సదాచారపరాయణుడు. ఇతనికి తుదకు
లభించిన మరణయోగము సహితమతిసుందరమై, ఘనమై
యీ క్రింది భారతవాక్యము లాచంద్రతారార్కముగ
లక్ష్యమై పరగునట్టిది:

# అనుబంధము

## చారిత్రకజిజ్ఞాస—వాఙ్మయాధారములు

## Historical Research—Literary sources.

### I

దేశవాఙ్మయగ్రంథములందలి కృతికర్తృకృతిభర్తల వంశాభ్యుదయభాగములును, అధ్యాయాంతపుగద్యములును, చరిత్రనిర్మాణ సంభారములకనల్పమూలములు (Resources) అనుట చారిత్రకశాస్త్రనిపుణులగు డాక్టర్ కృష్ణస్వామి అయ్యంగార్లవారి మతము. ఈజిజ్ఞాసక్రమమును గొని Sources of Vijayanagar History అను పేరితో సంస్కృతాంధ్రవాఙ్మయములందలి యుక్తగ్రంథముల శోధించి, విజయనగర చరిత్రాంశములకుప్పగ చేర్చి పుస్తకమునే వ్రాసియున్నారు. ఇయ్యది మదరాసు యూనివర్సిటీవారిచే ప్రచురించబడియున్నది. ఈయుక్తి అయ్యంగార్లవారి కనుభవవేద్యమయి, తాము శోధించిన చరిత్రాంశములందలి, సంశయఘట్టములు వెలయించుటకు పలుమార్లు తోడ్పడిన వనుచుందురు.

ఈ జిజ్ఞాసక్రమమునందలి తత్త్వమును తెలియగోరి, అళియరామరాయల కాలపుదేశముల నీవల విమర్శించ

సంవత్సరమున ప్రకటించినట్టిది. ఇందు కృత్యాదిపద్యములు లేవు. ప్రథమాశ్వాసమునకే శీర్షిక 'కథాప్రారంభము' నామిత్రులగు శ్రేష్ఠిగారె కృత్యాదిభాగమును వెతకి వ్రాయించియుంచుకొన్నదానినే నాకు పంపుట.

ఈపద్యముల సాంగముగ చదివినపుడు, ఈక్రింద వివరించిన చరిత్రాంశములు స్ఫురణకు వచ్చినవి.

1. కృష్ణదేవరాయలకాలమునుండియే, కదిరి చుట్టుప్రక్కల ప్రదేశములు మైసూరు రాజ్యమందలి యిప్పటి తేకల్లువరకు నొకరాష్ట్రమై వ్యాపించియుండినట్టును, ఆవంశమునకు మూలపురుషుడు పెద్దయాబళరాజయినట్టును, ఈయాబళనాయుడు రాయలకును [illegible]కును సమకాలికుడయి వారివలనచే మన్ననలందినట్టును తేటపడును.

2. ఈయాబళరాజు మునిమనుమడు మాణిక్యరాజు అళియరామరాజుతో సమానముగ సింహాసనము నధివసించునంతటి చెల్లుబడి గల్గియుండినవాడనియు, సామంతరాజ్యముల స్థాపించినవాడనియు వ్యక్తమయ్యెడిని.

3. విజయనగరపు చక్రవర్తులవలెనే యిప్పటి సామంతులు సహితము, ఖడ్గనైపుణ్యముండే కాక, కవన

బూనుట నాకు తటస్థించినది. ఈవిమర్శనఫలముగ ఈపుస్తక మచ్చయినపిమ్మట విజయనగర చరిత్రాంశములు మరి కొన్ని స్ఫురణకు వచ్చినవి. వాని నీయనుబంధమున జేర్చితిని.

అనంతపురమండలమున కదిరి యాత్రాస్థానమనుట ననేకు లెరిగినసంగతి. ఈ పట్టణమున కనతిదూరమున పాతశేషల్లెపట్టణము లేక పాతర్లపల్లెపట్టణ మనుపేరితో చిన్నగ్రామ మొకటి కలదు. ఈ యూర వేంకటరమణప్ప శ్రేష్ఠిగారను వైశ్యశిఖామణులు నాకు చిరపరిచితులు. తెలుగుకావ్యప్రబంధముల వారికి రుచి మెండు. మొన మొన్న వారితో సళియరామరాజు కాలమునుగూర్చి సంభాషించుచుండ, 'శుకసప్తతి' యను గ్రంథమున రాజ వంశ మొకటి వర్ణింపబడియున్నదనియు, కదిరి నేలుచుం డిన కదిరీపతినాయ డాకృతికి కర్తయనియు, ఆ నాయని ముత్తాత యూబళరాజను మూలపురుషుడు అళియరామ రాజునకు సమకాలికుడనుట నాగ్రంథమున కననగు ననియు వారు మందలించిరి. మరికొన్ని దినములకే 'శుక సప్తతి' యచ్చుపుస్తకప్రతియు, దానితోపాటు వ్రాత పుస్తకము నొకదానిని వారు దయతో నాకు పంపిరి. అచ్చుపుస్తకము బ్రౌన్ (Brown) దొరగారిచే సంపాది తము; కాకినాడ సరస్వతీముద్రాక్షరశాలవారు 1909-వ

సంవత్సరమున ప్రకటించినట్టిది. ఇందు కృత్యాదిపద్యములు లేవు. ప్రథమాశ్వాసమునకే శీర్షిక 'కథాప్రారంభము' నామిత్రులగు శ్రేష్ఠిగారెట్లో కృత్యాదిభాగమును వెతకి వ్రాయించియుంచుకొన్నదానినే నాకు పంపుట.

ఈపద్యముల సాంగముగ చదివినపుడు, ఈక్రింద వివరించిన చరిత్రాంశములు స్ఫురణకు వచ్చినవి.

1. కృష్ణదేవరాయలకాలమునుండియే, కదిరి చుట్టుప్రక్కల ప్రదేశములు మైసూరు రాజ్యమందలి యిప్పటి తేకల్లువరకు నొకరాష్ట్రమై వ్యాపించియుండినట్టును, ఆవంశమునకు మూలపురుషుడు పెద్దయాబళరాజయినట్టును, ఈయాబళనాయుడు రాయలకును [illegible]కును సమకాలికుడయి వారిరువురిచే మన్ననలందినట్టును తేటపడును.

2. ఈయాబళరాజు మునిమనుమడు మాణిక్యరాజు అళియరామరాజుతో సమానముగ సింహాసనము నధివసించునంతటి చెల్లుబడి గల్గియుండినవాడనియు, సామంతరాజ్యముల స్థాపించినవాడనియు వ్యక్తమయ్యెడిని.

3. విజయనగరపు చక్రవర్తులవలెనే యిప్పటి సామంతులు సహితము, ఖడ్గనైపుణ్యముండేకాక, కవన

చాతుర్యమందును, వైష్ణవభక్తియందును సవ్యగ్రమనస్కులై యుండిరనుటయు తెల్లమగును.

4. ఔబళరాజునకును, వాని నాల్గవతరపు మునిమనుమడగు మాణిక్యరాజునకును, రామరాజుసమకాలీనులై యుండవలెననుటచే నా రాయడు తొంబదియాఱేండ్లు దేహపటుత్వముతో జీవించియుండవలెననుటకు మఱియొక యాధారము.

పాలవేకరినాయక వంశవృక్షము
(తాళిగోళ్ల వారు)

పెద్ద యౌబళుడు
(కృష్ణదేవరామరాయల సమకాలీనుడు
ఖాద్రి నృసింహస్వామి కైంకర్యపరుడు)

|

నారపరాజు

|

ఓబళరాజు
= బాలాంబ

|

మాణిక్యరాజు



మూలపురుషుఁడగు ఔబళరాజు ఖాద్రి నృసింహ స్వామి కైంకర్యపరు డనుటకు ఈ క్రింది కృత్యాది పద్య మాధారము.—

సీ. కొండుకుగల్ మొదలైన గురుతరగ్రామముల్
మహిమ జెన్నగు భోగమంటపములు
సరస గుభాళించు వరధూపవాసనల్
వివిధరాజాన్న నివేదనములు
కట్టాణిముత్యాల గట్టి చౌకట్లజో
డరుదైన నవరత్నహారతతులు
కడుదీప్తి మెరయు నఖండదీపజ్యోతు
లనుపమ సుప్రసూనార్చనములు
గీ. మొదలుగా గల్గు కైంకర్యముల నమర్చె
శ్రీకరుండైన ఖాద్రి నృసింహమూర్తి
కెనయ ప్రహ్లాదు డీతడో యనగ భక్తి
గలిగి పెదయౌభళేంద్రుండు వెలయుజగతి.

కృష్ణరాయలకును, రామరాయనికిని ఔబళరాజు సమకాలీనుడనుటకు—

సీ. రాయదత్తాశ్వవారణ రత్ననవరత్న
హారాంబరంబులే యధిపుడందె

అళెరామరాజేంద్రు బలవద్రిపుల్రదుంచు
కలనికే ధీరుండు కర్తయయ్యె
గద్దెరాకనుమ 'తేకల్' మొదలుగాగల్గు
బహురాజ్య మేశౌర్యమహిమ దేలె
............తాళిగోళ్ల నన్వయాఖ్య
జలధిచంద్రుండు పెద్దమూంబళవిభుండు.

ఇక మాణిక్యరాజునుగూర్చి—

సీ. ఏవదాన్యుడు రామదేవరాయలసరి
గద్దియ నొడ్డోలగిముననుండె
ఏమనుజాధీశు డితరన్నపాల రా
జ్యస్థాపనాచార్యుడై చెలంగె
......................................
...........................
తాడిగోళ్లాభళ న్నపాలతనయహూళి
నీతిగీప్పతి కరియమాణిక్యన్నపతి.

మాణిక్యరాజుమనుమడు కదిరీపతిరాజు శుకసప్తతి కర్త యనుటకు ఈక్రింది సీసపద్యమును ఆశ్వాసాంత గద్యను చూడవలెను.—

సీ. కావ్యనైపుణి శబ్దగౌరవ ప్రాగల్భ్య
మర్థావనాసక్తి యతిశయోక్తి

నాటకాలంకార నయమార్గసాంగత్య
సాహిత్య సౌహిత్య సరసముద్ర
సకలప్రబంధవాసన సువాక్ప్రౌఢిమా
న్వీత చతుర్విధ సత్కవిత్వధాటి
లక్ష్యలక్షణగుణ శ్లాఘ్యతాపటిమంబు
నైఘంట్వికసదానునయనిరూఢి
గనిన నీకు నసాధ్యంబె గణుతిసేయ
ధాత్రి నెకసత్కృతినొనర్ప తాడిగోళ్ల
ఘనగుణ కలాప కదురేంద్ర కదురభూప
చెలగి వాక్ప్రౌఢిచే గృతి సేయుమనిరి.

II

అచ్యుత, అళియరామరాయలకాలమున విజయనగరమునకు సామంతుడై, పాండ్యదేశమున మధురయె రాజధానిగ నెలకొని దాదాపు ముప్పదివత్సరములు (1534-1564) మిక్కిలి వితరణతో దక్షిణప్రాంతముల నేలి సామ్రాజ్యమునకే కీర్తిగడించి ఖ్యాతిగన్నవాడు విశ్వనాథనాయకుడు. ఈధీరోదాత్తుని జీవితోదంతము ఈపుస్తకమున నయిదవయధ్యాయమందిమిడియున్నది.

ఈనాయకుడు పరమపదించుట క్రీ.శ. 1564-వయేట. ఈయన యనంతరము పట్టమునకు వచ్చినవాడితని యౌరసుడు కృష్ణప్పనాయకుడు. అటుపిమ్మట యీనాయకమణి వంశపరంపరనుగూర్చి 'శృంగారసత్యభామాసాంత్వనము'ను నాంధ్రకావ్యమున వర్ణించియుండుట మొన

మొన్ననే చూడగల్గితిని. ఇందలి పీఠికను శోధించిచూచినపుడు-ఈ క్రిందివంశవృక్షము స్ఫురించినది. కావ్యగ్రంథములు చరిత్రనిర్మాణమున కాధారములనుట కిది మరియొకసాక్షి.



ఈ కావ్యమును ప్రచురించినవారు బ్రహ్మశ్రీ గంటి సూర్యనారాయణశాస్త్రిలవారు. 1928 సం. గ్రంథమును మొదట ముద్రించినది చెన్నపురి పద్మాముద్రాక్షరశాల. ఈ వ్యాసమునకు శాస్త్రిలవారు రచియించిన పీఠిక ముఖ్యబీజము (Source). ఈ కావ్యము శృంగారరసప్రధానము. 'కవిత్వము మృదుమధురశైలితో ద్రాక్షాపాకమున బడినట్టిది! మధురాంధ్రకృతులలో మొదటిది.'

## కృ తి క ర్త

గీనిని రచించిన కవిపేరు లింగనమఖి కామేశ్వరుడు. తల్లి పేరు కామాక్షమ్మ. తండ్రి నాగన. శ్రీకాళహస్తి పరిసరప్రదేశములందలి పల్లియ యొకటి యీకుటుంబపు నివాసస్థానమై కానవచ్చుచున్నది. ఇతడు క్రీ.శ. సుమారు 1679 సంవత్సరపుకాలమువాడు. 'సత్యభామాసాంత్వనమును' రచియించుటకుపూర్వము రుక్మిణీపరిణయమును రచియించినాడట. అది యే తాటియాకుల కట్టలో దాగియున్నదో యిపుడు కానరాదు. ఈకవికి సాహిత్యమందే కాక సంగీతమందును చొరవయున్నట్టును, ననేక గేయముల బాడినట్టును ప్రతీతి యున్నది. వీణ వాయించుటయందును నేర్పుగలవాడట.

## కృతిభర్త

ఈ కావ్యపుకృతి భర్తపేరు "ముద్దళగిరి" విశ్వనాథునికి యేడవతరపు మనుమడనుట వంశవృక్షము వెలయించును. ఇదియొకనూతన చరిత్రాంశము. ఈతడును సంగీతసాహిత్యములందు రసికుడు. ఆంధ్రకవితావినోది. మధురప్రాంతముల కుంతూరుదుర్గముల నేలుచుండిన వాడు. తంజాపూరిలోను కొంతకాలము స్వతంత్రుడై పాలించుచుండెను. అపుడే శివాజితమ్ముడగు ఏకోజి తంజావూరిపై దాడివెడలుట. ముద్దళగిరి తుదకు ఏకోజీని జయించినట్టు కృతియందు నాలుగు చంపకమాలికల కన నగును. ఈతని సవతి తల్లికొడుకు చొక్కనాయని పేరను, తన పేరను, శృంగారగేయము లనేకములున్నవట.

## సాహిత్యరక్తి

ఈ వ్యాసము బయలుపరచు చరిత్రాంశము మరి యొకటి. విజయనగరపు చక్రవర్తులును, వారి సామంతులును పరంపరగ నవనచాతుర్య బాహుపరాక్రమముల నలవరచుకొనుటతోపాటు సంగీతసాహిత్యములందు రక్తిని గడించి యీలలితకళలసౌరభమును పదునేడవ శతాబ్దము తుదివరకు వ్యాపింపజేసిన విన్నాణము కొనియాడ

తగినట్టిది. ఆకాలపు విద్యాపద్ధతు లెట్లుండెనో ఈచరిత్రాంశము కొంతవరకు వెలయించును.

## విశ్వనాథుని ప్రశంస

(శృంగార సత్యభామా సాంత్వనము)

"సీ. అచ్యుతరాయ లేయవనీశపాళికి
        నరుదుగా పలువగ బిరుదు లిచ్చె
    దక్షిణసింహాస నాక్షీణసామ్రాజ్య
        ధౌరేయుఁ డయ్యె నే ధరణిధవుఁడు
    ఘనముగా విజయదుర్గను మహాలక్ష్మి నే
        ధీరుఁడు దెచ్చి ప్రతిష్ఠసేసె
    మధురాపురంబున మహనీయపాండ్య భూ
        మండలంబేలె నే మహీపపాళి
    అతడు నృపమాత్రుఁడా మహాహవజయాంక
    భూవరాహాది బిరుదసంభూతకీర్తి
    కార్తికీచంద్రధవళిత గగనవాటి
    అలఘుఁ డగు విశ్వనాథనాయకకిరీటి."



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 11 | నూరు | మూరు |
| 7 | 5 | తల్లికోట | తాళికోట |
| 11 | 4 | అవనగిరి | ఆదవనిగిరి |
| 14 | 7 | వాడయ్యో | వాడయ్యో. |
| 19 | 11 | కుగురు | కుదురు. |
| 21 | 20 | గయాసుద్దీన్ | గియాజుద్దీన్ |
| 23 | 5 | (Veera Ballala III) | Veera Ballala. |
| 25 | 12 | పొడకట్టినరీతి. | పొడకట్టినరీతి— |
| 26 | 7 | గొట్టుటకయి | గొట్టుట— |
| 28 | 14 | దాచబడి ; | దాచబడి |
| 28 | 15 | తెచ్చిదాచబడినవే | తెచ్చినవే |
| 103 | 6 | దృష్టాంతము | దృష్టాంతము. |
| 120 | 15 | పరగుదానిని | పరగువానిని |
| 123 | 2 | వ్రాసినవాడు. | వ్రాసినవాడు, |
| 128 | 11 | లేదో. తన | లేదో, తన |
| 163 | 10 | కరక్కైన | కటుక్కైన |